మతి చెప్పినట్లు విని దుర్గతిని కొని తెచ్చుకున్నాం. శ్రుతి చెప్పినట్లు ఆచరించి సద్గతి కొరకు ప్రయత్నించాలి. మతి మాయలో పడేస్తుంది. శ్రుతి మహిమలో ఊరేగిస్తుంది. చీకటిలో నడచి పోయే వాడి చేతిలో దీపం ఉండాలి. అజ్ఞాన చీకటిలో చరించే మానవుని చిత్తంలో శాస్త్ర దీపం వెలుగుతూ ఉండాలి.

**మతి గల వాడే మానవుడు**
**మతి పతి యైతే వానరుడు**
**అంతా మతి యైతే శ్రుతి ఎందుకు?**
**శ్రుతి ఉంటేనే యతి ముందుకు**
**మాయలే మతికి రాస్తాలు**
**మహిమలు శ్రుతికి నేస్తాలు**
**రామ రామ జయ రాజారామ్**
**రామ రామ జయ సీతారామ్**

అని రామజోగి చిట్కా.

***వేదాః స్థానాని విద్యానాం*** - వేదాలు విద్యాస్థానాలు, జ్ఞాన నిలయాలు అన్నది యాజ్ఞవల్క్య స్మృతి. కర్తవ్య మేమిటి, అకర్తవ్య మేమిటి అనే విషయంలో శాస్త్రమే మనకు ప్రమాణము. వివిధ పురుషార్థాలను ఎలా సాధించు కోవాలో, ఆ మార్గా లన్నిటినీ సుబోధకం చేస్తుంది శాస్త్రం ***( పురుషార్థోపదేశత్వాత్ శ్రుతీనామ్ )*** అన్నారు తైత్తిరీయోపనిష ద్భాష్యంలో శ్రీ శంకరాచార్యస్వామి.

అందుచేత శాస్త్రవిధిని అనుసరించి, కర్తవ్యాన్ని ఆచరిస్తూ పోవాలి ***( జ్ఞాత్వా శాస్త్ర విధానోక్తం )***. విధి అంటే విధానము. శాస్త్రం చేత చెప్పబడింది శాస్త్రవిధి లేదా శాస్త్ర విధానము ***( విధిః విధానమ్, శాస్త్రేణ విధానమ్ శాస్త్ర విధానమ్ )***. దేవతలకు సైతము లభ్యం కాని కర్మాధికారం మానవులకే ఉంది. ఈ సత్యాన్ని స్పష్టం చేయడానికే ***ఇహ*** పద ప్రయోగము ***( ఇహ ఇతి కర్మాధికార భూమి ప్రదర్శనార్థమ్ )***. భూలోకం లోనే కర్మాధి కారం ఉంది కనుక, శాస్త్రోక్త విధి ననుసరించి, కర్తవ్యాన్ని నిర్వహించి, శ్రేయస్సును పొందమని ఉపదేశిస్తూ దైవాసుర సంపద్విభాగ యోగాన్ని భగవంతుడు సమాప్తం చేశాడు.

**ఓం తత్ సత్**

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
దైవాసుర సంపద్విభాగయోగో నామ షోడశోఽధ్యాయః

**ఈ విధంగా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రము, శ్రీకృష్ణార్జున సంవాదము అయిన భగవద్గీత యందు దైవాసుర సంపద్విభాగ యోగ మనే పదహారవ అధ్యాయము.**





# చైతన్య భగవద్గీత

## అథ సప్తదశోఽధ్యాయః - పదిహేడవ అధ్యాయము

## శ్రద్ధాత్రయ విభాగ యోగః - శ్రద్ధాత్రయ విభాగ యోగము

**ప్రమాణ విషయం**

ఎవరు దేనిని పొందా లనుకున్నా, దానికి సంబంధించిన జ్ఞానం వారికి ఉండాలి. ఉంటుంది. అప్పుడే దానిని పొంద గలరు.

వారు పొందాలి అనుకున్న దొకటి ఉండి, దానికి సంబంధించిన జ్ఞానము వారికి లేనపుడు, సాధారణంగా స్నేహితుడో, బంధువో లేదా మరొకరో చెప్పే ఆప్తవాక్యము మీద విశ్వాస ముంచి, వస్తు ప్రాప్తికి యత్నిస్తూ ఉంటారు. లోకంలో వ్యవహారా లన్నీ ఇలాగే ఉంటాయి.

స్వబుద్ధికి జ్ఞానం లేక పోవడం వల్లనే కదా, పరబుద్ధిని ఆశ్రయించడం జరిగింది? తన జ్ఞానం మీద తనకే విశ్వాసం లేక పోవడం చేత పరులను విశ్వసించడం జరిగింది. వారి మీద కూడా విశ్వాసం లేనట్లైతే, వస్తు ప్రాప్తికి ప్రయత్నం చేయలేడు కదా! ***( లోకేఽపి ఆప్తవాక్యే విశ్వాస అభావే, నైవ తదనుసారేణ ప్రవర్తతే పురుషః )***. లోకంలో ఏ కార్య ప్రాప్తి కైనా, తన జ్ఞానం మీద గాని, లేదా పరుల జ్ఞానం మీద గాని ఆధారపడే ప్రయత్నాలు సాగుతూ ఉంటాయి. కాని, ఈ రెండు ఆధారాలూ కొన్ని సమయాలలో ఆదా చేయడానికి ఉపకరించక పోవచ్చు. అలాంటి పరిస్థితులలో వారి మాటలు, ఊహలు ప్రశ్నార్థకంగా, సంశయాత్మకంగా, పరిశీలనాత్మకంగా విన పడుతూ ఉంటాయి.

'నాకు తెలియక అలా చేసేశాను. అలా చేయకుండా ఉంటే బాగుండేది' - ఈ మాటల వెనుక స్వబుద్ధి అజ్ఞానాన్ని ప్రత్యక్షంగా అంగీకరించడమే జరుగుతూ ఉంది.

'అతనికి అనుభవ ముందని విశ్వసించాను. వాళ్ళకు బాగా తెలుసని అభిప్రాయ పడ్డాను. పాపం! వాళ్ళ తప్పు కూడా లేదు. వాళ్ళకు తోచింది వాళ్ళు చెప్పారు. తెలియనిది ఎవరైనా ఎలా చెబుతారు? నాకే ప్రాప్తం లేదు' - ఈ మాటల వెనుక పరులకు లేని జ్ఞానముతో పాటు, వారి జ్ఞానం విషయంలో తన కున్న అజ్ఞానమును కూడా స్పష్టంగా అంగీకరించడమే జరిగింది.

సామాన్యమైన లౌకిక విషయ వ్యవహారాలే ఇలా ఉండే టప్పుడు, అతీంద్రియ విషయమైన ఆత్మ తత్త్వము నందు మన తలపులు, తర్కాలు, పరుల బుద్ధికి సంబంధించిన ఊహలు ఎంత వరకు సహకరిస్తాయి? వాటి విషయం చెప్పడానికి ఏముంది? ***( కి ముత అతీంద్రియే శాస్త్రార్థే? )***.

మనపై మనకు విశ్వాసం ఉండాలి. పరులపై కూడా విశ్వాసం ఉంచ వచ్చు. తప్పు లేదు. కాని, బ్రహ్మ జ్ఞానము విషయంలో మన విశ్వాసము పరులపై కాదు, ప్రమాణంపై ఉండాలి. ప్రమను, లేదా జ్ఞానమును కలిగించేది ప్రమాణము కనుక ***(ప్రమాకరణం ప్రమాణం)***. శాస్త్ర ప్రమాణంపై ప్రగాఢమైన విశ్వాసం ఉండాలి. దానినే శ్రద్ధ అంటారు. దేని చేత బ్రహ్మజ్ఞానము పొంద బడుతూ ఉందో, అదే శ్రద్ధ అన్నారు సత్పురుషులు ***('యయా వస్తూపలభ్యతే సా శ్రద్ధా' - ఇతి సద్భిః కథితా, )***. ఎవరికి శ్రద్ధ ఉంటుందో వారు జ్ఞానాన్ని పొందుతారు అని భగవంతుడు గీత - నాల్గవ అధ్యాయం లోనే ప్రబోధించాడు ***( శ్రద్ధావాన్ లభతే జ్ఞానం; 4 వ అ - 39వ శ్లో )***.

పరమేశ్వరుని యందు, గురుదేవుని యందు, శాస్త్ర విషయము నందు అకుంఠిత మైన విశ్వాసము కలిగి ఉండటమే శ్రద్ధ. శ్రద్ధ గల వారు జ్ఞానాన్ని పొందుతారు. దాని అర్థం శ్రద్ధ లేని వారు పొంద లేరు. పైగా, పరమాత్మను పొంద లేక పతనమై సంసార చక్రంలో పడి పరిభ్రమిస్తూ ఉంటారు.

అర్జునా! శ్రద్ధ లేని పురుషులు (***అశ్రద్దధానాః పురుషాః***) నన్ను పొంద లేక (***మాం అప్రాప్య***) జనన మరణ రూప సంసారంలో పడి పోతున్నారు (***మృత్యు సంసార వర్త్మని నివర్తన్తే***) అని గీత - రాజవిద్యా రాజగుహ్య యోగం మూడవ శ్లోకంలో భగవంతుడు హెచ్చరించాడు కూడా.

## సందర్భము

ఏది కర్తవ్యం, ఏది అకర్తవ్యం? అనే విషయంలో శాస్త్రమే ప్రమాణము. కనుక, శాస్త్రము జ్ఞాన సాధనము (***శాస్త్రం ప్రమాణం జ్ఞాన సాధనమ్***). శాస్త్రాన్ని విస్మరించి, ఇష్టానుసారం కర్మాచరణంలో ఉండే వారికి సుఖం ఉండదు (***న సుఖం***). పురుషార్థ యోగ్యత ఉండదు (***న సిద్ధిం***). మోక్షము ప్రాప్తించదు (***న పరాం గతిమ్***) అని పూర్వ అధ్యాయాంతంలో ప్రవచించిన పరమేశ్వరుడు, శాస్త్రోక్త విధానమును తెలుసుకొని (***జ్ఞాత్వా శాస్త్ర విధానోక్తం***) కర్మాచరణమును సాగించాలని బోధించి పదహారవ అధ్యాయాన్ని సమాప్తి చేశాడు. ఈ ఉపదేశమే పదిహేడవ అధ్యాయానికి ప్రశ్న బీజ మైంది (***'తస్మాత్ శాస్త్రం ప్రమాణం తే' ఇతి భగవ ద్వాక్యాత్ లబ్ధ ప్రశ్న బీజః***).

పదిహేనవ అధ్యాయం పురుషోత్తమ ప్రాప్తి. అదే మోక్ష ప్రాప్తి. దైవీ సంపదలో పుట్టిన వారికే గాని ఆసురీ సంపదలో పుట్టిన వారికి లభ్యం కానిది. కామ క్రోధ లోభాలనే నరక హేతువులను త్యజించి, ఆత్మకు శ్రేయస్సును కలిగించే దైవ మార్గంలో పయనించే వారికే లభ్య మవుతుంది. కనుక, ఆత్మజ్ఞానమును పొంది పురుషోత్తమ ప్రాప్తిని సాధించుటకు పరిహరించ దగినది, ఆత్మకు వినాశమును కలిగించే (***నాశన మాత్మనః***) ఆసురీ సంపదను త్యజించి స్వీకరించ దగినది, ఆత్మకు శ్రేయస్సును కలిగించునది (***ఆత్మనః శ్రేయః***) అయిన దైవీ సంపదను ముముక్షువు పెంపొందించు కోవాలి. ఆసురీ ప్రవృత్తిని దైవ ప్రవృత్తిగా మార్చుకునేందుకు పదహారు, పదిహేడు అధ్యాయాలు సహకరిస్తాయి. ఈ విధంగా సామీప్య సంబంధం ఉండటం చేత, ఈ రెండు అధ్యాయాలు పదిహేనవ అధ్యాయానికి అనుబంధ అధ్యాయాలుగా శోభిస్తున్నాయి.

శ్రద్ధను కేంద్ర విషయంగా కలిగి ఉన్నందున పదిహేడవ అధ్యాయానికి 'శ్రద్ధాత్రయ విభాగ యోగము' అనే పేరు వచ్చింది. అసుర సంపద కల వారు దైవ సంపద లోకి పరివర్తన చెందడానికి శ్రద్ధ ప్రముఖ పాత్రను పోషిస్తుంది. ఇక దైవ సంపద కల వారు ఆత్మజ్ఞానమును పొందడానికి అనువైన పరిణతిని సాధించ డానికి సహకరిస్తుంది. కనుకనే, ***శ్రద్ధా చ బ్రహ్మ విజ్ఞానే పరమం సాధనం*** - బ్రహ్మజ్ఞానమును సాధించుటలో శ్రద్ధ ఉత్కృష్ట మైనది అన్నారు బృహదారణ్యక భాష్యంలో ఆచార్యులు.

మోక్ష మార్గంలో శ్రద్ధ దారి దీపం లాంటిది. అది ప్రకాశిస్తున్నంత కాలము ప్రయాణము సజావుగా సాగుతూ ఉంటుంది. అది ఆరి పోయిందా, ప్రయాణం ఆగి పోయినట్లే.

శ్రద్ధ వల్లనే మోక్షేచ్ఛ కలుగుతుంది. పరమేశ్వరుని గూర్చి తెలుసుకోవాలి అనే జిజ్ఞాస శ్రద్ధ వల్లనే ఏర్పడుతుంది. శ్రద్ధే ముముక్షువుకు జన్మ నిస్తుంది. శ్రద్ధే ముముక్షువును ముక్త పురుషుణ్ణి చేస్తుంది.

ముముక్షువుకు జన్మ నిచ్చి, ముముక్షువు మోక్షరూపు డయ్యే వరకు సాధనలో అనుక్షణం కనిపెట్టుకొని శ్రద్ధ తల్లి లాగా సాధకుని పోషిస్తుంది. కనుక, సాధకు లైన బిడ్డ లందరూ శ్రద్ధామాత ఒడిలో పెరగ వలసిన వారే. శ్రద్ధామాత ఎవరో కాదు. శ్రద్ధామాత శారదా మాతయే. శ్రద్ధ రూపంలో జ్ఞానాన్ని పోషిస్తున్న జ్ఞాన సరస్వతియే శ్రద్ధామాత.





***యా దేవీ సర్వ భూతేషు శ్రద్ధా రూపేణ సంస్థితా,***
***నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః ॥***

అని దేవీ సప్తశతి. శ్రద్ధా రూపిణియై ఆయుష్షు పోసిన జ్ఞాన సరస్వతి విద్యారూపిణియై ఆశీర్వదించి అనుగ్రహిస్తుంది (***యా దేవీ సర్వభూతేషు విద్యారూపేణ సంస్థితా***).

శ్రద్ధ మనస్సుకు సంబంధించింది. మనస్సు ప్రకృతి సంభవ మని మనం ముందే తెలుసుకొని ఉన్నాం. ప్రకృతి గుణమయం కనుక, ప్రకృతి కార్యమైన మనస్సులో కూడా గుణాలే ఉంటాయి. అవే పదమూడు, పద్నాలుగు అధ్యాయాలలో మనం విస్తరించి చెప్పుకున్న సత్త్వ రజ స్తమో గుణాలు. మనస్సులో గుణత్రయమే ఉంది కనుక, మనస్సు లోని గుణ భేదాన్ని బట్టి శ్రద్ధ కూడా మూడు విధాలుగా ఉంటుంది. అవే త్రివిధ శ్రద్ధలు. అంటే, సాత్త్విక శ్రద్ధ, రాజసిక శ్రద్ధ, తామసిక శ్రద్ధ. ఈ మూడు విధాలైన శ్రద్ధలను విస్తారంగా వివరించడం చేత ఈ అధ్యాయానికి 'శ్రద్ధాత్రయ విభాగ యోగము' అనే పేరు వచ్చింది.

***సత్త్వాత్ సంజాయతే జ్ఞానం*** - సత్త్వగుణము వృద్ధి చెంది నపుడు జ్ఞానం పుడుతుంది అని గీతాచార్యుడే చెప్పడం జరిగింది (*14 వ అ - 17 వ శ్లో*). భక్తి జ్ఞానాలు రెండిటికి శ్రద్ధ ప్రధాన మైంది. కర్మయోగంలో చరించి అంతఃకరణ శుద్ధిని పొందా లన్నా, జ్ఞాన మార్గంలో సాగి ఆత్మజ్ఞానాన్ని అందుకోవా లన్నా, శ్రద్ధే ప్రధానంగా ఉంటుంది.

భగవద్గీతలో 'శ్రద్ధ' అనే పదాన్ని భగవంతుడు ఎన్నిసార్లు ఉపయోగించాడో! అప్పటికీ తృప్తి చెందక శ్రద్ధను వివరించి చెప్పడానికి ప్రత్యేకంగా ఒక అధ్యాయాన్నే కేటాయించాడు.

ద్వాదశాక్షరీ మహామంత్ర స్వరూపుడైన గీతాచార్యునికి హృదయమై భాసిస్తున్న ద్వాదశాధ్యాయ మైన భక్తి యోగమునకు ఆద్యంతాలలో శ్రద్ధను ప్రతిష్ఠించి భక్తికి ప్రాణం పోశాడు భగవంతుడు. ఎవరు గొప్ప శ్రద్ధతో (***పరయా శ్రద్ధయా***) కూడిన వారై (***ఉపేతాః***) నన్ను ఉపాసిస్తారో (***మాం ఉపాసతే***), వాళ్ళే యుక్తతములు (***తే యుక్త తమాః***) అంటూ భక్తియోగాన్ని ఆరంభించిన వాసుదేవుడు, శ్రద్ధావంతులై నన్ను ఉపాసించే వారు (***శ్రద్ధానా మత్పరమాః***) నాకు ఇష్టమైన వారు (***మే అతీవ ప్రియాః***) అంటూ అధ్యాయాన్ని సమాప్తి చేశాడు. శ్రద్ధకు పరమేశ్వరు డిచ్చిన ప్రాముఖ్యాన్ని, ప్రాధాన్యతను బట్టి శ్రద్ధ యొక్క ప్రాశస్త్యాన్ని గుర్తించ వచ్చు.

విధి విధానాలు తెలియక, భక్తి శ్రద్ధలకు నోచుకోక, అసుర సంపద నాశ్రయించి అన్యాయమై, బ్రతుకును అనర్థంగా మార్చుకుంటున్న అసుర మానవులు, శ్రద్ధావంతులై పరమేశ్వరుని ఆశ్రయిస్తే, మెల్లమెల్లగా దైవీ సంపదను పొంది, శాస్త్ర జ్ఞానమును అందుకొని, కృతకృత్యులై, ఆప్తకాములై తరిస్తారు. కనుక సాత్త్విక శ్రద్ధను పొంద డానికి ఈ అధ్యాయము కరదీపిక లాంటిది.

***విధి విధానము తెలియని అధమ జన్మ***
***భక్తి శ్రద్ధలు లేని దద్దమ్మ బ్రతుకు***
***మునిగి పోవుచుంటి సంసార మడుగు లోన***
***నీ అడుగుల కడ పడి ఉందు నీలకంఠా!***

అని నీలకంఠ శతకంలో ఒక విబూది పండు.

ఇది శ్రద్ధాత్రయ విభాగ యోగము. పదిహేడవ అధ్యాయము. గుణత్రయ భేదాన్ని అనుసరించి శ్రద్ధాత్రయము, అంటే త్రివిధ శ్రద్ధలు వివరింప బడ్డాయి. వాటితో పాటు త్రివిధ పూజలు, త్రివిధ ఆహారాలు, త్రివిధ యజ్ఞాలు, త్రివిధ తపస్సులు, త్రివిధ దానాలు మొదలైన వన్నీ గుణ భేదాన్ని అనుసరించి స్పష్టంగా

విశదీకరించ బడ్డాయి. అధ్యాయాంతంలో ***ఓం తత్ సత్*** అనే మంత్ర వ్యాఖ్యానము ఉంది. చివరగా అశ్రద్ధ కార్యాల వల్ల ప్రాప్తించే అనర్థ ఫలాలు కూడా చెప్పబడ్డాయి. సాధకులకు ఈ అధ్యాయము చాలా ఉపయుక్త మైనది.

*పూర్వాధ్యాయ సమాప్తంలో పరమేశ్వరుడు శాస్త్ర ప్రమాణాన్ని ప్రతిపాదించడం చేత, అది ఆలకించిన అర్జునుని అంతఃకరణములో ప్రశ్న బీజం పడింది. దానినే పార్థుడు ప్రశ్నిస్తున్నాడు.*

**అర్జున ఉవాచ :**

**యే శాస్త్రవిధి ముత్సృజ్య యజన్తే శ్రద్ధయాఽన్వితాః ।**
**తేషాం నిష్ఠా తు కా కృష్ణ సత్త్వ మాహో రజ స్తమః ॥** 1

***యే-శాస్త్రవిధిం-ఉత్సృజ్య-యజంతే-శ్రద్ధయా-అన్వితాః***
***తేషాం-నిష్ఠా-తు-కా-కృష్ణ-సత్త్వం-ఆహో-రజః-తమః***

| | | | | | |
|---|---|---|---|---|---|
| కృష్ణ | = కృష్ణా! | | తేషాం | = | వారి యొక్క |
| యే | = ఎవరు | | నిష్ఠా తు | = | స్థితి |
| శాస్త్రవిధిం | = శాస్త్ర విధానమును | | కా | = | ఎట్టిది |
| ఉత్సృజ్య | = విడిచి | | సత్త్వం | = | సత్త్వమా |
| శ్రద్ధయా | = శ్రద్ధతో | | ఆహో | = | లేక |
| అన్వితాః | = కూడిన వారై | | రజః | = | రజస్సా |
| యజంతే | = పూజలు చేస్తారో | | తమః | = | తమస్సా |

**అర్జునుడు అడుగుతున్నాడు :**

**కృష్ణా! కొందరు శ్రద్ధతో పూజలు చేస్తారు. కాని, శాస్త్ర విధిని అనుసరించరు. వారి నిష్ఠ సాత్త్వికమా? రాజసికమా? తామసికమా?**

**వ్యాఖ్య**

ఎవరైతే శాస్త్రోక్త విధానాన్ని విడిచి పెట్టి, స్వేచ్ఛాచారులై ప్రవర్తిస్తారో ***( యశ్శాస్త్ర విధి ముత్సృజ్య వర్తతే కామ కారతః ).*** వారు సిద్ధిని, సుఖాన్ని, మోక్షాన్ని పొందరు అని పూర్వాధ్యాయం ఇరవై మూడవ శ్లోకంలో చెప్పడం జరిగింది. భగవంతుడు చెప్పిన ఈ వాక్యాన్ని కొంత మార్పు చేసి, కామం స్థానంలో శ్రద్ధను ఉంచి అర్జునుడు ప్రశ్నిస్తున్నాడు. ***వర్తతే కామ కారతః*** *(16 వ అ - 23 వ శ్లో)* స్థానంలో ***యజన్తే శ్రద్ధయాన్వితాః*** అనే వాక్యాన్ని ఉంచి, కృష్ణా! ఎవరైతే శాస్త్రోక్త విధానాన్ని విడిచి పెట్టి శ్రద్ధతో కూడిన వారై పూజాదికాలు నిర్వర్తిస్తారో ***( యశ్శాస్త్ర విధి ముత్సృజ్య యజన్తే శ్రద్ధయాన్వితాః )*** వారి నిష్ఠ సాత్త్వికమా, రాజసికమా, తామసికమా? అని ప్రశ్నిస్తున్నాడు.

శాస్త్ర విధిని విడిచి పెట్టి స్వేచ్ఛాచారులైన వారికి సుఖశాంతులు మిగలవు అని పూర్వాధ్యాయంలో చెప్పడం చేత వారిది సాత్త్విక నిష్ఠ కాదని, ఆత్మ శ్రేయస్సుకు ఉపకరించదని తెలుస్తూనే ఉంది. అది దైవ సంబంధ మైనది కాదని కూడా తెలుస్తూ ఉంది. అంతే కాదు. ఆసురీ సంపదకు సంబంధించింది కనుక, అది రజ స్తమస్సులకు సంబంధించి నది కాబట్టి త్యజించ దగినది అనేది కూడా స్పష్ట మవుతూ ఉంది. కాకపోతే,



శాస్త్రోక్త విధానాన్ని విడిచి పెట్టి, కామ ప్రేరణ చేత కాకుండా శ్రద్ధతో ఆచరించే వారి గతేమిటి? అనేది ఈ శ్లోకంలో అర్జునుని ప్రశ్న. ముందుగా ఈ ప్రశ్న కాస్త స్పష్టంగా అర్థం కావాలి.

శాస్త్ర విధి విధానాలను త్యజించే వారు స్వేచ్ఛాచారులు. మరి, ఈ స్వేచ్ఛాచారులు శాస్త్రోక్త విధిని తెలిసి త్యజించారా, తెలియక త్యజించారా? నిజం చెప్పాలంటే రెండిటికీ పెద్ద తేడా లేదు. తెలియడం, తెలియక పోవడం అలా ఉంచితే, త్యజించడ మైతే చేశారు కదా! కనుక, ఎందుకు త్యజించారు - అనే ప్రశ్నే ఇక్కడ సంగతము. కామ ప్రేరణ చేతనే త్యజించారు అనేది సమాధానము. శాస్త్ర విధానాన్ని ఎందుకు త్యజించా రంటే, కామయుతులై వర్తించ డానికే త్యజించారు ***( శాస్త్ర విధిం ఉత్సృజ్య త్యక్త్వా వర్తతే కామ కారతః కామ ప్రయుక్తః ).*** కనుక, కామ ప్రధానం గానే త్యజించడం జరిగింది కాబట్టి వీరు ఆసురీ పంపదకు పంబంధించిన వారు. అందుచేత వీరి నిష్ఠ సుఖప్రదం కాలేదు. సిద్ధిప్రదం కాలేదు. మోక్షప్రదం కాబోదు.

ప్రస్తుతం ఎవరిని గూర్చి అయితే అర్జునుడు ప్రశ్నిస్తున్నాడో, వారు కూడా స్వేచ్ఛాచారులే. శాస్త్రముమ త్యజించిన వారే. కాకపోతే, వారి స్వేచ్ఛాచారము కామ ప్రయుక్తం కాదు. పైగా అది శ్రద్ధాన్వితం. ఈ అంతరాన్ని క్షుణ్ణంగా గ్రహించాలి. శాస్త్ర విధిని విడిచినా, వారు శ్రద్ధను విడువ లేదు. కామ ప్రేరితం కాని, శ్రద్ధాన్విత మైన ఈ నిష్ఠ సాత్త్వికమా, రాజసికమా, తామసికమా? అనేది అర్జునుని ప్రశ్న. ఒక్క మాటలో చెప్పాలంటే శ్రద్ధకు ప్రాధాన్యత అంటూ ఏదన్నా ఉందా, లేదా? అనేదే ప్రశ్నలో ముఖ్యాంశము అని నేను భావిస్తున్నా.

ఈ సందర్భములో మరొక విషయాన్ని అర్థం చేసుకోవడం కూడా ముఖ్యమని నా అభిప్రాయము. కామ ప్రేరితులై ఉన్నందున ఆసురీ సంపదకు సంబంధించిన వారు శాస్త్రాన్ని తెలిసినా, తెలియక పోయినా త్యజించారు అనే విషయాన్ని సులభంగా అర్థం చేసుకో వచ్చు. కాని, కామ ప్రయుక్తులు కాకుండా, శ్రద్ధ కలిగి ఆచరించే వారు ఆస్తిక్య బుద్ధి కలిగిన వారే కదా! మరి అలాంటి వారు శాస్త్రాన్ని త్యజించడ మేమిటి? వారు తెలియక త్యజించారా, లేక తెలిసే త్యజించారా? ఆస్తిక్య బుద్ధి కల వారు, శ్రద్ధ కల వారు తెలిసి ఎలా త్యజిస్తారు? అదెలా సాధ్యం? సాధ్యమే. సాధ్యమైంది కనుకనే దానిని చూచిన అర్జునుడు ప్రశ్నిస్తున్నాడు. సాధ్యము కానిది కనిపించదు. కనిపించని దానిని చూపిస్తూ ఎలా ప్రశ్నిస్తాడు?

కనుక, ఆస్తిక్య బుద్ధి కల వారే, శ్రద్ధ కల వారే ప్రస్తుత శ్లోకంలో శాస్త్రమును త్యజించిన వారు అనేది అంగీకరించ వలసిన విషయము. మరి, ఆస్తిక్య బుద్ధి కల వారు శాస్త్రాన్ని ఎందుకు త్యజిస్తారు? శాస్త్రాన్ని త్యజించిన వారికి ఆచార విషయము ఎలా తెలుస్తుంది? తెలియని దానిని శ్రద్ధతో వారు ఎలా ఆచరిస్తారు? ఒకవేళ అర్జునుడు చెబుతున్నాడు కనుక ఆచరిస్తున్నారని మనం అంగీకరించినా, దేనిని అనుసరించి ఆచరిస్తున్నారు? దీనికి సమాధానం ముందుగా అర్థం చేసుకుందాం.

ఎవరైతే అర్జునుడు చెబుతున్నట్లు శాస్త్ర విధిని విడిచి పెట్టి, శ్రుతి స్మృతి శాస్త్రోక్త విధానాన్ని త్యజించి ***(యే కేచిత్ శ్రుతి స్మృతి శాస్త్రచోదనామ్ ఉత్సృజ్య పరిత్యజ్య )*** దేవతలను పూజిస్తున్నారో, వారు శ్రద్ధ తోనే ఆరాధిస్తున్నారు ***( తే దేవాదీన్ పూజయన్తి శ్రద్ధయా అన్వితాః సంయుక్తాః ).*** శ్రద్ధతో ఆచరించే వారు శాస్త్రము తెలిస్తే దానిని త్యజించ లేరు కనుక, శాస్త్రజ్ఞానము లేని కారణం గానే శ్రద్ధతో ఆచరిస్తున్నారు. శాస్త్రం లేనపుడు, శాస్త్ర విధి తెలియ నపుడు, ఆచరించ డానికి విధానము ఎలా తెలుస్తుంది? అనేది అర్థవంత మైన ప్రశ్న. సమాధానం ఏమిటి అంటారా? శాస్త్రము, శాస్త్ర విధి తెలియక పోయినా, ఆస్తిక్య బుద్ధి ఉన్న కారణంగా, పెద్దల ఆచారమును ఆదర్శంగా తీసుకొని, దానిని అనుసరిస్తూ శ్రద్ధతో ఆచరిస్తారు. ఇదంతా శ్రద్ధ వల్లనే సాధ్య పడుతుంది. శాస్త్రము తెలిసినా కూడా శ్రద్ధ లేని కారణంగా ఆసురీ సంపదకు సంబంధించిన వారు శాస్త్రాన్ని

పరిత్యజించి స్వేచ్ఛాచారులై చరిస్తూ ఉంటే, శాస్త్రము తెలియక పోయినా, శ్రద్ధ ఉన్న కారణంగా విషయము తెలిసిన పెద్దల ఆచారమును అనుసరించి, శ్రద్ధతో దేవతలను ఆరాధించే వారిని అర్జునుడు చూపెడు తున్నాడు (**వృద్ధ వ్యవహార దర్శనా దేవ శ్రద్ధధాన తయా యే దేవాదీన్ పూజయన్తి తే ఇహ 'యే శాస్త్ర విధి ముత్సృజ్య యజన్తే శ్రద్ధ యాన్వితాః ' ఇత్యేవం గృహ్యన్తే!**). శాస్త్ర విధిని విడిచి పెట్టి, శ్రద్ధతో దేవతారాధనము చేస్తున్నారు అని అర్జునుడు ప్రస్తావించింది పెద్దల మార్గాన్ని అనుసరించే సుకృతాత్ములను గురించే నని స్పష్టమైంది (**మహా జనో యేన గతస్స పంథా**).

ఇక, ప్రస్తుతం మన ముందున్న మీమాంస ఒక్కటే. ఈ విధంగా శాస్త్రాన్ని త్యజించి, పెద్దల మార్గాన్ని శ్రద్ధతో అనుసరిస్తూ ఆచరించే వారి నిష్ఠ సాత్త్వికమా, రాజసికమా, తామసికమా? వారు సత్వగుణ ప్రధానులా, లేక రజ స్తమో గుణాలకు సంబంధించిన వారా? ఇదీ అర్జునుని ఆంతర్యం.

*దీనికి భగవంతుడు సమాధానం చెబుతున్నాడు.*

**శ్రీ భగవానువాచ :**

త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా ।
సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు ॥ 2

*త్రివిధా-భవతి-శ్రద్ధా-దేహినాం-సా-స్వభావజా*
*సాత్త్వికీ-రాజసీ-చ-ఏవ-తామసీ-చ-ఇతి-తాం-శృణు*

| | | | | | |
|---|---|---|---|---|---|
| దేహినాం | = | మానవులకు | తామసీ చ | = | తామసము |
| స్వభావజా | = | స్వభావముచే పుట్టిన | ఇతి | = | అని |
| సా | = | ఆ | త్రివిధా | = | మూడు విధములు |
| శ్రద్ధా | = | శ్రద్ధ | భవతి | = | అగుచున్నది |
| సాత్త్వికీ | = | సాత్త్వికము | తాం | = | దానిని |
| రాజసీ చ ఏవ | = | రాజసము | శృణు | = | విను |

**శ్రీ భగవంతుడు చెబుతున్నాడు :**

**అర్జునా! స్వభావం వల్ల పుట్టిన శ్రద్ధ మానవులకు మూడు విధాలు. అవే సాత్త్వికము, రాజసము, తామసము. వాటిని గూర్చి వివరంగా విను!**

**వ్యాఖ్య**

శాస్త్రోక్త విధానమును అనుసరించకుండా, శ్రద్ధాన్వితులై దేవాదులను ఆరాధించే వారి నిష్ఠ సాత్త్వికమా, రాజసమా, తామసమా? అనేది అర్జునుని ప్రశ్న. అర్జునుడు అడిగిన ఈ ప్రశ్న ఏ ఒక్కరినో ఉద్దేశించి ప్రశ్నించింది కాదు. అలా ప్రశ్నించి ఉంటే, ప్రశ్నకు సూటిగా సమాధానం చెప్పే అవకాశం ఉండేది. ఒకరిని ప్రత్యేకంగా ఉద్దేశించి అడిగింది కాకుండా ప్రశ్న సామాన్యంగా ప్రస్తావించ బడింది (**సామాన్య విషయః అయం ప్రశ్నః**). ప్రశ్న ఎప్పుడైతే సామాన్యంగా ప్రస్తావించ బడిందో; అది కూడా సాత్త్వికమా, రాజసమా, తామసమా? అని అడగటం జరిగిందో, ఏ గుణానికి ఆ గుణాన్ని విభజించి చెప్పనిదే సమాధానం పూర్ణం కాదు. కనుక, పార్థుని ప్రశ్నకు సమాధానం చెప్పాలంటే, శ్రద్ధాత్రయ విభాగము చేయక తప్పదు. అందుచేత, గుణ భేదానుసారంగా, శ్రద్ధాత్రయ



విభాగ పూర్వకంగా ప్రతివచనం పలుకు తున్నాడు పరమేశ్వరుడు. అలా కాకుండా మరో విధంగా చెప్పే అవకాశము లేదు (**న అప్రవిభజ్య ప్రతివచనమ్ అర్హతి ఇతి**). అందుకే శ్రద్ధాత్రయ విభాగము.

కాండత్రయంగా మనం చెప్పుకున్న భగవద్గీతలో పదమూడవ అధ్యాయం నుండి తృతీయ కాండ - జ్ఞానకాండ నడుస్తూ ఉంది. **తత్త్వమసి** వాక్య నిర్ణయంలో **అసి** పద నిర్దేశం జరుగుతూ ఉంది. అఖండ పరిపూర్ణ అద్వయ స్వరూపం వైపుకు ప్రయాణం సాగుతూ ఉంది కనుక, ఖండాలను, భాగాలను మిథ్యా రూపాలుగా నిర్ణయించి, అఖండ స్వరూపాన్ని దర్శించే దిశగా బోధ నడుస్తూ ఉంది. అందుచేత ఈ తృతీయ కాండమే విభాగముతో ఆరంభ మైంది. ఇక ఆ తరువాత వరుసగా విభాగాలనే వీక్షిస్తూ ఉన్నాము. క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగము, గుణత్రయ విభాగము, దైవాసుర సంపద్విభాగము, ఇప్పుడు శ్రద్ధాత్రయ విభాగము. ఏ నిష్ఠ యందు శ్రద్ధను గూర్చి అర్జునుడు ప్రశ్నిస్తున్నాడో, మానవుల స్వభావ జనితమైన ఆ నిష్ఠ మూడు విధాలుగా ఉంది అంటూ భగవంతుడు ఈ అధ్యాయంలో ప్రథమంగా అమృత వచనాన్ని వినిపించాడు.

శ్రద్ధ అనేది మనస్సుకు సంబంధించింది. మనం జీవితంలో ఏ విధమైన శ్రద్ధను ప్రదర్శిస్తూ, ప్రకటిస్తూ ఉంటామో, ఆ శ్రద్ధను నిర్ణయించేది మన స్వభావమే. కనుక శ్రద్ధ అనేది స్వభావము నుండి పుడుతుంది (**స్వభావ జా**). శ్రద్ధ అనేది మనస్సు ఉన్న మానవులకు సంబంధించిందే గాని, మనస్సుకు నోచుకోని, కేవలం సహజాతాల మీదనే ఆధారపడి జీవించే జంతువులకు సంబంధించింది కాక పోవుట చేత ఇక్కడ మానవులకు (**దేహినామ్**) అని ప్రత్యేకించి చెప్పడం జరిగింది.

'అర్జునా! మానవులకు (**దేహినామ్**) స్వభావం వల్ల పుట్టిన (**స్వభావజా**) శ్రద్ధ (**శ్రద్ధా**) మూడు విధాలుగా ఉంటుంది (**త్రివిధా భవతి**). అదే సాత్త్వికము, రాజసము, తామసము. దానిని గూర్చి విను (**తాం శృణు**) ' అంటున్నాడు భగవానుడు.

కారణము తెలియకుండా కార్యాన్ని ఊహించ లేము. కారణము అర్థం కానపుడు కార్యాన్ని తెలుసు కోవడం సాధ్య పడదు. శాస్త్ర విధిని త్యజించి శ్రద్ధతో దేవతారాధనము చేసే వారి నిష్ఠను గూర్చి అర్జునుడు ప్రశ్నించాడు (**తేషాం నిష్ఠా తు కా?**). అది సాత్త్వికమా, రాజసమా, తామసమా? అని తానే ప్రశ్నించాడు (**సత్త్వ మాహో రజ స్తమః**). కార్యమైన నిష్ఠను వివరించాలి అంటే కారణమైన శ్రద్ధను చెప్పి తీరాలి.

శ్రద్ధ ఒక్కటే. అయినా, గుణ భేదాన్ని బట్టి అది మూడు రూపాలుగా తెలుస్తూ ఉంది. శ్రద్ధా భేదాన్ని వివరించనిదే నిష్ఠను నిర్ణయించడం సాధ్య పడదు. అందుచేత, సత్త్వ రజ స్తమస్సులు అని మూడు విధాలుగా భిన్న మగుచున్న శ్రద్ధను భగవానుడు వివరించ వలసి వచ్చింది. అందుకనే, త్రివిధ శ్రద్ధలను వివరిస్తూ, వినమంటున్నాడు. 'విను' అని ప్రత్యేకంగా అనడం లోనే విషయ ప్రాధాన్యతను చెప్పకనే చెప్పిన ట్లైంది. మరి, ఈ శ్రద్ధ మూడు విధాలుగా ఉండటానికి కారణ మేమిటో కూడా చెబుతున్నాడు. స్వభావం నుండి పుట్టడం వల్లనే శ్రద్ధ మూడు విధాలుగా తెలుస్తూ ఉంది (**త్రివిధా త్రిప్రకారా భవతి**).

స్వభావము నుండి పుట్టిన శ్రద్ధ సాత్త్విక మని, రాజస మని, తామస మని మూడు విధాలు (**స్వభావజా శ్రద్ధా త్రివిధా**). స్వభావము అంటే తనతో కూడా ఉండేది అని అర్థము (**స్వేన సహ భవతీతి స్వభావః**). స్వభావము నుండి పుడుతుంది కనుక శ్రద్ధను స్వభావజం అనడం జరిగింది.

ఎవరి స్వభావం వారిదే. స్వభావమే జీవితంగా కనిపిస్తూ ఉంటుంది. స్వభావమును విడిచి మనిషి ఉండ లేడు. మనిషికి వేరుగా స్వభావం ఉండ లేదు. కనుక మనిషి సంస్కారమే మనిషి స్వభావము. సంస్కారాలే స్వభావాన్ని నిర్ణయిస్తాయి. నేడు మనిషి స్వభావం ఎలా ఉందో, దానిని బట్టే అతని జీవితము నడుస్తూ ఉంటుంది.

ఇప్పుడు అర్థమైంది అనుకుంటాను. మనిషి స్వభావజ మైన శ్రద్ధను బట్టే ఆ వ్యక్తి నిష్ఠ సాగుతూ ఉంటుంది. ఆ నిష్ఠ సాత్త్వికమా, రాజసమా, తామసమా అనేది స్వభావజ మైన శ్రద్ధపై ఆధారపడి ఉంటుంది. మనస్సులో సాత్త్విక శ్రద్ధ ఉంటే బాహ్యంలో నిష్ఠ సాత్త్వికంగా ఉంటుంది. అలాగే రాజస నిష్ఠ అయినా, తామస నిష్ఠ అయినా.

మానవ స్వభావం సంస్కార ప్రభావమే అనేది తేలి పోయింది కదా, మరి ఈ సంస్కారాలు కేవలం ఈ నాటి వేనా, లేక జన్మాంతర కృతాలా? స్వభావాలు పూర్వజన్మ కృత పుణ్యాపుణ్య సంస్కార జనితాలా? నూతనంగా నేడు కొన్ని సంస్కారాలు మనిషికి ఏర్పడ వచ్చు. కాని, స్వభావ మనేది ఈ జన్మ లోనే తయారైంది కాదు. అందుకనే, తనతో కూడా ఉండేది అనే విగ్రహ అర్థాన్ని ముందే తెలియ చేశాను. తాను ఎక్కడుంటే స్వభావము అక్కడే తోడుగా ఉంటుంది.

మనిషి ఉన్నాడు అంటే స్వభావంతో ఉన్నాడు అని అర్థము. మనిషి పుట్టాడు అంటే స్వభావం తోనే పుడుతాడు. పుట్టక ముందు మనిషి ఉన్న వాడే. మనిషి ఉన్న వాడే కనుక అతని స్వభావం కూడా పూర్వ జన్మలో అతనితో కూడా ఉన్నదే. ఉన్నది కనుకనే అతనిని విడిచి పెట్టకుండా, పుట్టే సమయంలో అతనితో కలిసి పుట్టింది. పుట్ట గానే మనిషి ఎందుకు ఏడుస్తాడు? బిడ్డ ఏడవ డానికి స్వభావమే కారణము. గతంలో ఏడ్చిన అనుభవం ఉంది కనుక, బాధానుభవంతో ఏడ్చిన సంఘటనలు గత జన్మలో ఉన్నవే కనుక, పుట్టే సమయంలో ప్రసూతి వాయువుల చేత నెట్ట బడుతూ, దుర్భేద్య మైన యోని ముఖం నుండి బయట పడే టప్పుడు బిడ్డ దిక్కు తోచక రోదిస్తాడు. జనన సమయంలో శిశువును ఏడిపించింది స్వభావమే. పుట్టుక లోనే ఏడిపించింది కనుక చచ్చే వరకు ఏడిపిస్తూనే ఉంటుంది. అంతటితో ఆగదు. తిరిగి పుట్టే టప్పుడు మళ్ళీ కలిసే జన్మకు వస్తుంది. దేహాన్ని అంటి పెట్టుకున్న చర్మం శ్మశానంలో కాలి పోతుంది గాని, మనస్సును అంటిపెట్టుకున్న స్వభావము జీవి ఉన్నంత కాలం జన్మజన్మలకు తోడు గానే ఉంటుంది. అదీ స్వభావ మంటే. దాని నుండి పుట్టేదే శ్రద్ధ.

ప్రాచీన సంస్కారమే స్వభావము. దాని నుండి పుట్టింది కనుక శ్రద్ధ స్వభావజము. మనస్సులో స్వభావ జంగా ఉన్న శ్రద్ధ బాహ్య పరిస్థితుల్ని నిర్ణయిస్తుంది. కనుక స్వభావమును బట్టే సమస్తమూను. స్వభావము సమస్తాన్ని శాసిస్తూ పోతుంది. వేష భాషల్ని నిర్ణయించేది, ఆహార విహారాలను నిర్దేశించేది, సంబంధ బాంధవ్యాలను నిర్ధారించేది అంతా స్వభావమే. ఈ స్వభావము జన్మాది నుండే ఉంది కనుక, జీవితంలో జరిగే వన్నీ స్వభావానికి అనుకూలాలే కావడం చేత, బిడ్డ గర్భంలో ఉన్నప్పుడే, అంటే పుట్టక ముందే పూర్వోత్తరాలు లిఖింప బడతాయి అన్నది శాస్త్రం.

*శ్లో॥ ఆయుః కర్మ చ చిత్తం చ విద్యా నిధన మేవ చ,*
*పంచైతాని విలిఖ్యన్తే గర్భస్థ స్యైవ దేహినః ॥*

ప్రపంచంలో జీవి ఎలా బ్రతకాలి? అతని ఆయుర్దాయ మెంత? అతని కర్మగతు లెలా ఉంటాయి? మనోగతు లెలా ఉంటాయి? అతని చదువు ఎంత మాత్రం ఉంటుంది ? చచ్చిపోయే క్షణ మెప్పుడు? ఇవన్నీ పూర్వోత్తరాలు. ఆయుష్షు, కర్మ, మనస్సు, విద్య, మరణము - ఈ పంచ విషయాలకు సంబంధించిన పంచాయతి జీవి గర్భంలో ఉన్నప్పుడే జరిగి పోతుంది అన్నది శాస్త్రం. ఇక ఆ నిర్ణయాలను అమలు పరచడమే జీవితము.

ఏవి ఆశించి జీవుడు జన్మించాడో, వాటి కన్నా అన్యమైన వాటిని ఎలా చేస్తాడు? స్వభావాన్ని అనుసరించే ప్రవర్తన ఉంటుంది (**స్వభావస్తు ప్రవర్తతే**). కొందరికి వారి ప్రవర్తన వారికే నచ్చదు. నచ్చని ప్రవర్తనను తలచు కుంటూ నొచ్చుకుంటూ ఉంటారు కూడా.

దొంగతనం అంటే దొంగకు ఇష్టం ఉండదు. కాని, దొంగ ఇష్టంగా చేయ గలిగింది దొంగతన మొక్కటే. అదే స్వభావ మంటే. దొంగతనమే వృత్తిగా పెట్టుకొని జీవించే దొంగ, తన వస్తువుల్ని మరెవరైనా దొంగిలిస్తే భరించ లేడు. అందుకే అంటున్నాను దొంగతనం దొంగకి గిట్టదు అని. సత్యాలు వేరు, స్వభావాలు వేరు. ఇక్కడే బ్రతుకులో ఘర్షణ, జీవికి సంఘర్షణ.

స్వభావాన్ని బట్టి వ్యక్తి ప్రవర్తన ఉంటుంది. స్వభావాన్ని బట్టే కర్మలు, అలవాట్లు, అభిరుచులు, అలంకరణలు, సాధనలు - అన్నీను. ఆంతర్యము లోని స్వభావాన్ని బట్టి బాహ్యంలో నిష్ఠ ఉంటుంది. నిష్ఠ సాత్త్వికమా, రాజసమా, తామసమా? అనే అర్జునుని ప్రశ్నకు సమాధానం ఏమని చెప్పాలి? స్వభావాన్ని బట్టి నిష్ఠ ఉంటుంది. స్వభావము సాత్త్విక మైతే నిష్ఠ సాత్త్వికంగా ఉంటుంది. స్వభావము రాజస మైతే నిష్ఠ రాజసంగా ఉంటుంది. స్వభావము తామస మైతే నిష్ఠ తామసంగా ఉంటుంది.

కర్మలే కాదు, ఫలితాలు కూడా అలాగే ఉంటాయి. జన్మాంతర వాసనలు బ్రతుకును నిర్దేశిస్తూ ఉంటే, జన్మాంతర పుణ్యాపాపాలు ఆయా ఫలాలను నిర్విరామంగా పంచుతూ ఉంటాయి. ఎప్పుడు ఏది వస్తుందో అర్థం కాదు. కర్మలలో ప్రవర్తన ఎలా వింతగా ఉంటుందో, జీవితంలో అందే ఫలితాలు కూడా విచిత్రం గానే ఉంటాయి. కర్మాచరణం లోనే స్వభావాలు తయా రవుతాయి. కర్మాచరణం లోనే ఫలితాలు నిర్ణయింప బడతాయి. ఉన్న స్వభావమే ప్రవర్తనలో బయట పడుతుంది. పొంచి ఉన్న ఫలాలే ముందు కొస్తాయి. ముంచు కొస్తాయి. ఆశించినవి అందక పోవచ్చు. కాని అందే వాటిని ఎవ్వరూ ఆప లేరు. మనవే మనకు వస్తాయి. మనవి కానివి రమ్మన్నా రావు.

**సంపదలు కావాలంటారు**
**ఆపదలు రాకూడ దంటారు**
**లేనివి రమ్మంటే వస్తాయా?**
**కానివి వద్దంటే ఆగుతాయా?**
**చేసిన పుణ్యాలే చెబుతారు**
**పాపాలను దాచి పెడతారు**
**రామ రామ జయ రాజారామ్**
**రామ రామ జయ సీతారామ్**

అని రామజోగి చిట్కా.

**ఆశాదీపం**

స్వభావమును బట్టే నిష్ఠ ఉంటుంది కనుక, ఇక మన బ్రతుకు తెరువు మార దేమో! మన జీవన విధానము మార్పు చెందే అవకాశమే లేదేమో! అని నిరాశా నిస్పృహలకు లోనుగా నవసరం లేదు. స్వభావాన్ని మార్చే శక్తి సామర్థ్యాలు శాస్త్ర జన్య జ్ఞానానికి ఉన్నాయి. ఈ విషయంలో ఎవ్వరూ నిరాశ చెంద నవసరం లేదు. నా స్వభావాన్ని మార్చుకోవాలి. నా బ్రతుకు లోని చీకట్లను దూరం చేసుకోవాలి అని మనిషి ప్రగాఢంగా నిర్ణయించుకుంటే చాలు. స్వభావాన్ని సాత్త్వికంగా ఎలా మార్చుకోవాలో శాస్త్రం తెలియ జేస్తుంది. బోధ యొక్క ముఖ్య ఉద్దేశం, ముఖ్య ప్రయోజనం ఇదే.

స్వభావాన్ని మార్చుకొనే అవకాశం లేకపోతే వాల్మీకి ఎలా ఉద్భవించాడు? తులసీదాస్ ఎలా పరివర్తన చెందాడు? ఎందరో పతితులు పావనాత్ములై తరించారు. నది ప్రవహిస్తూనే ఉంటుంది. కాని దిగిన వారికే తాపం తీరుతుంది. మలిన దేహాలను శుద్ధి చేసేందుకే నిర్మల జలా లున్నాయి. పతితుల్ని పవిత్రుల్ని చేసేందుకే జ్ఞాన జల ముంది. ముఖ్యంగా మనస్సును సత్త్వ గుణంతో నింపుకో గలిగితే, ఇక ఆ తరువాత మెల్ల మెల్లగా అజ్ఞాన చీకటి తెరలు తొలగి పోతాయి. జ్ఞాన వెలుగులు బ్రతుకులో విరబూస్తాయి. ఆ విషయంలో సాధకు లైన ముముక్షువులకు ఈ శ్రద్ధాత్రయ విభాగ యోగము ఎంత గానో ఉపయోగ పడుతుంది.

*జీవితంలో శ్రద్ధ ఎంత ప్రముఖ మైందో చెబుతున్నాడు.*

**సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత ।**
**శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధ స్స ఏవ సః ॥** 3

*సత్త్వానురూపా-సర్వస్య-శ్రద్ధా-భవతి-భారత*
*శ్రద్ధామయః-అయం-పురుషః-యః-యత్-శ్రద్ధః-సః-ఏవ-సః*

| | | | |
|---|---|---|---|
| భారత | = అర్జునా! | పురుషః | = పురుషుడు |
| సర్వస్య | = సర్వులకు | శ్రద్ధామయః | = శ్రద్ధామయుడు |
| సత్త్వానురూపా | = అంతఃకరణకు తగినట్లుగా | యః | = ఎవడు |
| శ్రద్ధా | = శ్రద్ధ | యత్ శ్రద్ధః | = ఎటువంటి శ్రద్ధ కలవాడో |
| భవతి | = కలుగుతూ ఉంటుంది | సః | = అతడు |
| అయం | = ఈ | సః ఏవ | = అట్టివాడే |

**అర్జునా! వారి వారి మనస్సును బట్టి అందరికీ శ్రద్ధ కలుగుతూ ఉంటుంది. శ్రద్ధే జీవుని స్వరూపము. ఎవరికి ఎలాంటి శ్రద్ధ ఉందో, వాళ్ళు అలాగే ప్రవర్తిస్తూ ఉంటారు.**

**వ్యాఖ్య**

పూర్వ శ్లోకంలో దేని నైతే స్వభావం అని చెప్పుకున్నామో అదే ఇక్కడ సత్త్వంగా చెప్పబడుతూ ఉంది. ***సత్త్వాను రూపా*** అంటే అంతఃకరణమునకు తగినట్లుగా అని అర్థం. మనస్సుకు తగినట్లుగా అనుకోండి; సులభంగా అర్థ మవుతుంది. స్వభావము లేదా సత్త్వము మనస్సు లోనే కదా ఉంటుంది! కనుక ఎవరి శ్రద్ధ అయినా వారి మనస్సుకు అనురూపం గానే ఉంటుంది. అదే సత్త్వానురూపం. మనస్సు సాత్త్వికంగా ఉంటే శ్రద్ధ కూడా సాత్త్వికం గానే ఉంటుంది. మనస్సు లోని సత్త్వము, లేదా స్వభావము ఎలాగైతే ఉందో, దానిని అనుసరించే శ్రద్ధ ఉంటుంది. ఈ శ్రద్ధ అన్ని విషయాల లోను ప్రతిఫలిస్తూ ఉంటుంది. ఒక్క మాటలో చెప్పాలంటే జీవుడే శ్రద్ధా మయుడు. మనస్సులో ఏ విధమైన శ్రద్ధ ఉందో, దానికి అనుకూలం గానే జీవుని ప్రవర్తన ఉంటుంది (***శ్రద్ధా మయః అయం పురుషః సంసారీ జీవః***). ఎవరు ఏ విధమైన శ్రద్ధ కలిగి ఉంటారో (***యః యచ్ఛ్రద్ధః***). వారు ఆ శ్రద్ధకు అనుకూలం గానే ప్రవర్తిస్తూ ఉంటారు (***సః స ఏవ, తచ్ఛ్రద్ధానురూప ఏవ సః జీవః***).

## శ్రద్ధయే నిర్ణేత

మనం ప్రపంచంలో ఎలా ఉన్నా, ఎలా ప్రవర్తించినా, ఏది ఎలా ఆచరించినా, వాస్తవానికి దాని నంతా నిర్ణయించేది శ్రద్ధే. శ్రద్ధను బట్టే సామాజిక, రాజకీయ, సాంస్కృతిక, వైజ్ఞానిక, వాణిజ్య, విద్యా, వ్యాపారాలు





బాహ్య ప్రపంచంలో సాగుతూ ఉంటాయి. వ్యక్తిగత ప్రవర్తన సమస్తమూ శ్రద్ధామయమే. అందుచేతనే పురుషుడు శ్రద్ధామయుడు అన్నాడు భగవంతుడు (**శ్రద్ధామయోఽయం పురుషః**).

మన మనస్సులో ఏ గుణం ఏ మోతాదులో ఉందో దానిని బట్టి మన శ్రద్ధ ఉంటుంది. ఏ గుణం ప్రముఖంగా ఉంటే, దానికి సంబంధించిన శ్రద్ధే మనలో వ్యక్త మవుతుంది. సత్త్వగుణము ప్రధానంగా ఉంటే, మనలో సాత్త్విక శ్రద్ధ ప్రముఖంగా ఉంటుంది. శ్రద్ధ సాత్త్వికంగా ఉంది కనుక శ్రద్ధను బట్టి కర్మలు కూడా సాత్త్వికం గానే సాగుతాయి. ఇదీ క్రమము.

ఒకవేళ, వ్యక్తిలో తమోగుణము ప్రముఖంగా ఉందనుకోండి. అతని శ్రద్ధ తామసికంగా ఉంటుంది. తామసిక శ్రద్ధ ఉంది కనుక, దానిని అనుసరించి (**సత్త్వానురూపా**) తామస కర్మలే ఆచరింప బడుతాయి. అలాగే రాజసిక శ్రద్ధ కూడా.

తామసిక శ్రద్ధ మనస్సులో ఉన్నప్పుడు, ఆ వ్యక్తి దృక్పథంలో, ఆలోచనా విధానంలో, ఆచారములో - అన్నిటిలో తమోగుణ ప్రవృత్తే ప్రధానంగా ఉంటుంది. మానవీయ విలువల కన్నా జంతు ప్రవృత్తి ప్రముఖంగా ఉంటుంది. ఒక జంతువు తాను జీవించ డానికి మరొక జంతువును బలి తీసుకుంటుంది. కారణం, జంతువులలో తమోగుణమే ఉంది కనుక. అలాగే మానవునిలో కూడా ఆ విధమైన తమోగుణమే ప్రముఖంగా ఉండే టప్పుడు, అతని ప్రవర్తన కూడా తామసిక శ్రద్ధకు అనుగుణం గానే ఉంటుంది కనుక, తామసికులు ఎటువంటి కార్యాని కైనా ఒడి గడతారు.

ముఖ్యంగా నేటి సమాజంలో, ఈ తమోగుణ ప్రవృత్తి ప్రవృద్ధం కావడం చేతనే ఎక్కడ చూచినా మోసాలు, ద్రోహాలు, వంచనలు, హింసలు, హత్యలు, అపహరణలు విరివిగా కనిపిస్తున్నాయి. కారణం, ప్రపంచము తమోభిభూతమై ఉంది కనుక.

## ప్రవర్తనలు - ప్రాధాన్యతలు

మనిషిలో ఏ విధమైన శ్రద్ధ ఉందో, దానికి అనుగుణం గానే అతని జీవన విధానం ఉంటుంది. అతడు మరో విధంగా ఉండాలి అనుకున్నా ఉండ లేడు. అలా ఉండాలి అంటే, అతని కృషి ఎంత గానో ఉండాలి. వ్యక్తిలో విచారం విరబూయాలి. ఆ విచారాన్ని అతనిలో కలిగించడమే గాక, దానిని సక్రమంగా నడిపే వ్యక్తి కూడా తోడు ఉండాలి. నిశ్చయం దృఢంగా ఉంటే వ్యక్తి స్వభావాన్ని దాటి పోగలడు. మనస్సు లోని ప్రాధాన్యత లను మార్పు చేసుకోగలడు. అలా కాక, ఒక వైపు ప్రాధాన్యతలను పూజిస్తూ, మరో వైపు ప్రవర్తనలో పరివర్తనను ఆశించడము గుఱ్ఱం ముందు బండిని ఉంచడమే అవుతుంది.

ప్రాధాన్యత లనేవి బ్రతుకులో ఎంతటి ప్రముఖ పాత్రను పోషిస్తాయో నేను స్వానుభవంలో చూశాను. నా నలభై సంవత్సరాల సేవా జీవనంలో లెక్కకు అందనంత మంది నన్ను కలిశారు. ఆధ్యాత్మికంగా ఉన్నతిని సాధించాలని నన్ను ఆశ్రయించారు. కొందరు పరివర్తన చెందారు. అంటే, తమ ప్రాధాన్యతలను ప్రక్కకు నెట్టి, దేనిని ఆశించి వచ్చారో దానిని సాధించుకొనే క్రమంలో నిమగ్న మయ్యారు అని అర్థం. అలాంటి వర్గం ఒకటి ఉంది.

ఇక రాకపోకల తిరునాళ్ళు అంటారా? ఆ జాతర మరొక వైపు నిరంతరం సాగుతూనే ఉంది. ఏ పక్షి ఎప్పుడు వాలుతుందో తెలియదు. ఏ గువ్వ ఎప్పుడు ఎగిరి పోతుందో అర్థం కాదు. అర్థం కాని వాటికి భాష్యం చెప్ప మంటే ఎవరి తరము? ఎవరు ఎలా ప్రవర్తించినా అలా ప్రవర్తించడము వెనుక వారి స్వభావ ముంది. మనస్తత్త్వ శాస్త్ర కోణం నుండి విశ్లేషిస్తే, వాస్తవానికి ఎవరైనా, వారి వారి స్వభావం చేత కార్యరంగం లోకి

బలవంతంగా నెట్ట బడుతూ ఉంటారే గాని, అలా నెట్టబడి కర్మ లాచరించే వారికి, ప్రవర్తించే వారికి వారు అలా ఎందుకు ప్రవర్తిస్తున్నారో కూడా అర్థం కాదు. అంటే, వారి అంతఃకరణములో నిగూఢంగా పెనవేసుకు పోయిన స్వభావము వారికే అర్థం కాదు అని అర్థం. ఎవరి స్వభావం వారికే తెలియ నపుడు, మరొకరికి తెలిసే అవకాశం ఉందా?

ఉపన్యాసాలు వింటారు. ప్రబోధకుడు కనుక ప్రతిభావంతు డైతే తాత్కాలికంగా ఆవేశంతో స్పందిస్తారు. రజోగుణాన్ని తోడు చేసుకొని పరివర్తన వైపుకు ప్రాకు లాడుతారు. మొత్తానికి ఏదో ప్రయత్నం చేస్తారు. ఇక్కడే ప్రాధాన్యతలు పడగలు విప్పుతాయి. అదే మనిషికి కాళరాత్రి. బ్రతుకులో చీకటి రాత్రి. అలాంటి విషమ పరిస్థితిలో అర్జునుడు కళ్ళెమును కృష్ణుని చేతిలో పెట్టినట్లు, తమ బుద్ధి అనే కళ్ళెమును ఆచార్యుని చేతిలో పెట్టాలి. ఆ తరువాత అతడు సూచించిన మార్గంలో చరించాలి. ఇలా ప్రవర్తించడము కూడా స్వభావం పైనే ఆధారపడి ఉంటుంది. స్వభావాలలో ప్రాధాన్యతలు ఎలా ఉన్నవో దానిని బట్టే జీవన శకటం పయనిస్తూ ఉంటుంది.

కొందరు నన్ను అడుగుతూ ఉంటారు. స్వామీ! పూర్వం మీ వద్ద అతడు ఉండే వాడు. ఆమె ఉండేది. ఇటీవల వాళ్ళు కనిపించడం లేదే అని. నాలో నేను నవ్వుకొనే కొన్ని విషయాలలో ఇదొకటి. ఏం చెప్పేది? శ్రద్ధాత్రయ విభాగ యోగాన్ని బోధించేదా? సాధ్య మేనా? వారి కేదో సమాధానం చెబుతా ననుకోండి. అది వేరే విషయం. కాని, ముఖ్యమైన విషయ మేమిటంటే నన్ను ప్రశ్నించిన ఈ వ్యక్తి మనస్సులో ప్రాధాన్యత దేని కుందో అర్థం చేసుకోండి. ఏదో జ్ఞానార్జన అంటూ వస్తారు. అది స్వభావంలో ఉండదు కనుక, సాత్త్విక శ్రద్ధ లేని కారణంగా, రాజసిక శ్రద్ధే నిండి ఉన్నందున, వారి మనస్సులో ప్రాధాన్యత లౌకిక విషయాలకు ఉంటుందే గాని, పారమార్థిక విషయానికి ఉండదు.

లేని వారు ఎందుకు లేకుండా పోయారో అడిగే వ్యక్తి తెలుసుకొని ఏమి సాధిస్తాడు? ఎవరెవరు లేరు, ఉన్న వారిలో ఎవరెవరు ఎలా ఉన్నారు? ఈ ఆలోచనల కన్నా, ఈ ప్రపంచంలో ఉన్న వారందరూ లేకుండా పోయేందుకే ఉన్నారు అనే తాత్త్విక ఆలోచన చేయ గలిగితే ఇలాంటి అప్రస్తుత ప్రసంగాలకు అవకాశం ఉండదు.

ఇదంతా ఎందుకు చెబుతున్నా నంటే, ప్రాధాన్యతలను పరిశీలించకుండా ప్రగతిని సాధించ లేము. సాత్త్విక శ్రద్ధ లేకుండా ఆధ్యాత్మిక ప్రగతి సాధ్యం కాదు. ఇది స్వానుభవం నుండి చెబుతున్న మాట! ఈ విషయంలో నేను కాయను కాను, పిల్లకాయను కాను. పండి పోయిన వాణ్ణి. నా భవ రోగ చికిత్సాలయంలో ఇప్పటికి ఎందరు రోగుల్ని చూశానో!

ఏ వైద్యు డైనా అందరు రోగుల్ని బాగు చేయ లేడు. అన్ని రోగాలు నయం చేయ లేడు. రోగం నయం కావడ మనేది కేవలం వైద్యుడి మీద, ఔషధం మీద, చికిత్సా విధానం మీదనే ఆధారపడి ఉంది అనుకోవడం భావ్యం కాదు. వాస్తవం చెప్పాలంటే, రోగి మీదనే ఎక్కువ శాతం ఆధారపడి ఉంటుంది. కనుక, వైద్యుడు తన ధర్మాన్ని తాను నిర్వర్తించాలి. అంతే. ఒకవేళ, ఆయుష్షు కారిపోయి రోగి మరణిస్తే, వైద్యుడు మరొక రోగి వైపు దృష్టి సారించాలే గాని, మరణించిన రోగిని తలచుకొని విలపించ కూడదు. ఇవన్నీ జీవన సత్యాలు.

ఆపదలను తట్టుకోలేక ఆశ్రమాలను ఆశ్రయించే వాళ్ళు, ఆరోగ్యాలను పోగొట్టుకొని వచ్చే వాళ్ళు, బాధలను భరించ లేక అరుదెంచే వాళ్ళు, బిడ్డను పోగొట్టుకొని వచ్చే వాళ్ళు - ఇలాంటి ఆర్తులు కొంత కాలం ఆధ్యాత్మిక మార్గంలో ఊరేగుతారు. ఆశ్రమాలలో ఉక్కిరి బిక్కిరి అవుతూ ఉత్సాహాన్ని పారబోస్తూ కనిపిస్తారు.

కొంత కాలం ఉంటారు. బాధలు తీరుతాయి. భయాలు తొలగుతాయి. స్వభావాలు పల్లవిస్తాయి.





ప్రాధాన్యతలు పూత పెడతాయి. పిందె పుడుతుంది. పిచ్చి రేగుతుంది. ఆ తరువాత పలాయనమే ప్రస్థానము.

నా విషయాని కొస్తే, ఎవరైనా ఇతరుల పలాయనాలను, ప్రస్థానాలను నాతో ప్రస్తావిస్తే నేను ప్రతివచనం ఒక్కటే చెబుతాను. తరువు అన్న తరువాత పక్షు లెన్నో వాలుతాయి. వచ్చేవి వస్తూ ఉంటాయి. పోయేవి పోతూ ఉంటాయి. ఈ రాకపోకల తిరునాళ్ళకు, తరువుకు ఏమి సంబంధం?

ఆశ్రయించిన వారికి నీడ నివ్వడానికే తరువు ఉంది. వాలిన పక్షుల్ని తోలకుండా పండ్లు పెట్టేందుకే చెట్టు ఉంది. పండ్లు తిని పక్షులు ఎగిరినా, రెట్ట లేసి గువ్వలు రివ్వు మన్నా చెట్టు పట్టించుకోదు. తరువే పట్టించుకో నపుడు, గురువు పట్టించు కుంటాడా? 'నేనూ తరువు లాగా తటస్థుణ్ణే' అని చెప్పడానికే గురువులు తరువుల క్రింద ఆసీనులై ఉంటారు (**మూలం తరోః కేవల మాశ్రయన్తః**).

ఆత్మబంధువులారా! చైతన్య భగవద్గీత రెండు వేల పుటలను నింపుకున్న గ్రంథము. అయినా అందులో ఒక్క మాట గాని, ఒక్క వాక్యము గాని అసందర్భంగా, అప్రస్తుతంగా ఉండటాన్ని నేను ఊహించ లేను. భరించ లేను. ఇప్పుడు నేను చెప్పిన దంతా సాధకులకు అమృత తుల్యమైన సత్యం. సాధన పరమైన విషయం. కనుక ముందు మనస్సులో ప్రాధాన్యతలు ఎలా ఉన్నవో గుర్తించాలి. ఆ తరువాత అవసర మైతే, పరివర్తన వైపు పయనించే ప్రయత్నం దృఢంగా చెయ్యాలి. అందుకే, కాస్త అనుభవాన్ని జోడించి మరీ చెప్ప వలసి వచ్చింది.

జీవితం బొమ్మలాట కాదు. నవ్వులాట అసలే కాదు. జీవితం అతి స్వల్పం, అనిత్యం; కాదా? అని ప్రశ్నించింది శాస్త్రం. ***అనిత్యం ఖలు జీవితమ్?*** ప్రపంచం మనకు స్థిర నివాసం కాదు. కరుణించే స్వభావం కాలానికి లేదు. అందుకే ఊరి నంటి పెట్టుకొనే వల్లకాడు ఉంటుంది. అందరూ చక్రం తిప్పాలని చిందు లేసే వారే గాని, జనన మరణ చక్రాన్ని ఆపాలని ప్రయత్నించే పుణ్యాత్ము లెందరు?

మనస్సులో ఏది ప్రధానంగా ఉండాలో మనకు తెలిసి రావాలి. ఏది అవసరమో అర్థం కావాలి. అది తెలియక పోతే, నేడు అవసరాలుగా అంతఃకరణలో ఉన్నవి రేపు బ్రతుకునే అంతం చేయ వచ్చు.

విలువలకు విలువ కట్టడం నేర్చుకోవాలి. అప్పుడే బ్రతుకులో వెతలు తొలగుతాయి. వెలుగులు నిండుతాయి. కాలాన్ని వాడు కోవాలి. అంతేగాని కాలంతో ఆడుకో కూడదు. వాడుక లోనే ఉంది వేడుక. బుద్ధి సాత్త్విక మైతే, శ్రద్ధ సాత్త్విక మవుతుంది. సాత్త్విక శ్రద్ధ సాత్త్విక కర్మల్ని ఆవిష్కరిస్తుంది. అదే జరిగితే, బ్రతుకులో ఇక్కట్లు తీరుతాయి. చీకట్లు తొలగుతాయి.

జీవితంలో పురుషార్థ నిశ్చయం జరిగి, ప్రధాన మైంది ఏదో తెలిసి వస్తే స్వభావంలో మార్పు వస్తుంది. సాత్త్విక శ్రద్ధ విరాజిల్లు తుంది. ప్రవర్తనలో పరిపక్వత గోచరిస్తుంది.

**వచ్చిన దెపుడో తెలియదు ఎవరికి**
**పోయే రోజుందని తెలియని దెవరికి?**
**దారాసుతులు ధనదాయాదులు**
**కలిసి రాలేని రోజు అది**
**మట్టిలో కాయము కలవాలి**
**తోడొచ్చే దేమిటో తెలియాలి**
**రామ రామ జయ రాజారామ్**
**రామ రామ జయ సీతారామ్** అని రామజోగి చిట్కా.

స్వభావము అనేది జీవునితో కలిసి పుడుతుంది అని తెలుసుకున్నాం. ప్రాచీన స్వభావాన్ని బట్టి శ్రద్ధ ఉంటుంది. శ్రద్ధకు తగిన విధంగా కార్యాలు ఉంటాయి. కనుక, జీవులు ఆచరించే కార్యాలను బట్టి కూడా కారణమైన శ్రద్ధను ఊహించ వచ్చు. అదే చెబుతున్నాడు.

**యజన్తే సాత్త్వికా దేవా న్యక్ష రక్షాంసి రాజసాః ।**
**ప్రేతా న్భూతగణాం శ్చాన్యే యజన్తే తామసా జనాః ॥** 4

***యజంతే-సాత్త్వికా-దేవాన్-యక్షరక్షాంసి-రాజసాః***
***ప్రేతాన్-భూతగణాన్-చ-అన్యే-యజంతే-తామసాః-జనాః***

| | | | | | |
|---|---|---|---|---|---|
| సాత్త్వికాః | = | సాత్త్వికులు | తామసాః | = | తామసులు |
| దేవాన్ | = | దేవతలను | జనాః | = | జనులు |
| రాజసాః | = | రాజసులు | ప్రేతాన్ | = | ప్రేతములను |
| యక్షరక్షాంసి | = | యక్షులను, రాక్షసులను | భూతగణాన్ చ | = | భూత గణములను |
| యజంతే | = | పూజించు చున్నారు | యజంతే | = | పూజిస్తున్నారు |
| అన్యే | = | ఇతరులైన | | | |

**అర్జునా! సాత్త్వికులు దేవతలను పూజిస్తున్నారు. రాజసికులు యక్షులను, రాక్షసులను పూజిస్తున్నారు. తామసికులు భూత ప్రేతాలను సేవిస్తున్నారు.**

**వ్యాఖ్య**

ఒక వ్యక్తి చేసే కర్మను హేతువుగా చేసుకొని అతని మనస్సును తెలుసుకో వచ్చు. దేవతార్చనాది కర్మల్ని ఒక వ్యక్తి నిర్వర్తించే టప్పుడు అతడు ఏ ఉద్దేశ్యంతో చేస్తున్నాడో దానిని బట్టి అతని మనస్సు లోని శ్రద్ధను ఊహించ వచ్చు. అందుచేత, కార్యము అనే లింగం చేత స్వభావమును తెలుసుకో వచ్చు. ఒక వ్యక్తి దేవతా పూజ చేస్తూ ఉంటే, దేవ పూజ అనే కార్య రూపమైన లింగం చేత ***(కార్యేణ లింగేన దేవాది పూజయా)*** అతడి సత్త్వాది నిష్ఠను అనుమాన ప్రమాణం ద్వారా అర్థం చేసుకో వచ్చు ***(సత్త్వాది నిష్ఠా అనుమేయా ఇత్యాహ)*** అని చెబుతున్నాడు.

'లింగము' అంటే హేతువు, లేదా కారణము అని అర్థము. ***లింగ్యతే బుధ్యతే అనేన ఇతి లింగమ్*** - దేని సహాయం చేత మరొక దానిని తెలుసుకోవడం జరుగుతుందో దానిని 'లింగము' అంటారు.

నిప్పుకు పొగ లింగము. పొగను ఆధారం చేసుకొని నిప్పును ఊహిస్తాము. అందుచేత పొగ అనేది నిప్పుకు లింగము. దూరంగా ఒక పర్వతము మీద మనకు పొగ కనపడుతుంది. మనకు కనిపించేది పొగ. కనపడనిది అగ్ని. అయినా పొగ అనే లింగమును ఆధారం చేసుకొని అగ్నిని అనుమానించి నిర్ణయిస్తాము. ***పర్వతో వహ్నిమాన్ ధూమత్వాత్*** - ధూమము కనిపిస్తూ ఉంది కనుక పర్వతముపై అగ్ని ఉంది. ***ధూమత్వాత్*** అనేది అగ్నికి హేతువుగా తెలుస్తూ ఉంది. కనుక ధూమము అనేది అగ్నికి లింగము. అంటే ధూమం యొక్క సహాయంతో అగ్నిని ఊహిస్తున్నాం. అంతే కాదు. ఎక్కడైతే పొగ ఉంటుందో అక్కడ అగ్ని ఉంటుంది ***(యత్ర యత్ర ధూమః తత్ర తత్ర వహ్నిః)***. అంటే నిప్పు లేనిదే పొగ రాదు అనేది విషయము. దీనిని 'కార్యలింగ కానుమానము' అంటారు. అలాగే దేవపూజ అనే హేతువును, లేదా లింగమును ఆధారం చేసుకొని వ్యక్తి యొక్క సత్త్వ నిష్ఠను ఊహించ వచ్చు. అంటే, సాత్త్విక శ్రద్ధ ఉంటేనే దేవపూజ జరుగుతుంది అనేది విషయము.





సత్త్వనిష్ఠ కల వారు సాత్త్వికులు. వారు దేవతలను పూజిస్తారు ***(యజన్తే పూజయన్తి, సాత్త్వికాః సత్త్వ నిష్ఠాః దేవాన్)***. అంటే, ఎవరైతే దేవతలను పూజిస్తున్నారో ***(కార్యేణ లింగేన దేవాది పూజయా)*** వారి శ్రద్ధ సాత్త్వికమైనది అని అర్థము.

ఈ అధ్యాయారంభంలో అర్జునుడు అడిగిన విషయాన్ని మననం చేసుకుంటే, ఆ ప్రశ్నకు ఇక్కడ సమాధానం లభించినట్లే కదూ! 'శాస్త్ర విధిని అనుసరించకుండా, శ్రద్ధతో దేవాదులను అర్చించే వారి శ్రద్ధ సాత్త్వికమా, రాజసమా, తామసమా?' అని కదా అర్జునుడు ప్రశ్నించాడు? శాస్త్రజ్ఞానము లేక పోయినా, దేవతారాధనము చేస్తూ ఉన్నారు అంటే, స్వభావతః వారి శ్రద్ధ సాత్త్వికమే అని నిశ్చయ మైంది. నేను ముందే చెప్పినట్లు ప్రశ్న సామాన్యంగా ఉండటం చేత, శ్రద్ధాత్రయ విభాగ పూర్వకంగా ప్రతి వచనం చెప్ప వలసి వచ్చింది. అలా చెప్పడం చేతనే ఈ దశలో అర్జునుని ప్రశ్నకు రూఢిగా సమాధానం లభించింది.

సాత్త్వికులు దేవతలను ఆరాధిస్తే, రాజసులు యక్షులను, రాక్షసులను పూజిస్తారు ***(యక్ష రక్షాంసి రాజసాః)***. యక్ష రాక్షసులను పూజించడ మనే కార్యలింగం చేత వారి నిష్ఠ రాజస మని నిశ్చయింప బడుతుంది. అంటే, రాజసిక శ్రద్ధ కల వారు యక్షులను, రాక్షసులను పూజిస్తారు అని అర్థము.

తామసులు ప్రేత భూత గణాలను పూజిస్తారు ***(ప్రేతాన్ భూత గణాన్ చైవ సప్త మాతృకాదీన్ యజన్తే తామసాః జనాః)***. తామసు లైన జనులు ప్రేతాలను, సప్త మాతృకలు మొదలైన భూత గణాలను పూజిస్తారు. ఈ విధమైన పూజా కార్యాలనే లింగం చేత వీరు తామస నిష్ఠ కల వారని నిర్ణయ మవుతుంది. అంటే, తామస శ్రద్ధ కల వారు భూత ప్రేతాలను పూజిస్తారు అని అర్థం.

ఈ సందర్భములో శంకర భాష్యం విలక్షణంగా వ్యాఖ్యానించింది. గుణ భేదాన్ని బట్టి శ్రద్ధా భేదంతో ముగ్గురు మూడు విధాలుగా పూజిస్తున్నా, ఎక్కువ శాతం రాజస, తామస శ్రద్ధ కల వారే ఉంటారని, వేల మందిలో ఏ ఒక్కడో సత్త్వనిష్ఠుడై ఉంటాడని వ్యాఖ్యానించింది.

***కశ్చి దేవ సహస్రేషు దేవ పూజాది తత్పరః సత్త్వనిష్ఠః భవతి*** - వేల మందిలో ఏ ఒక్కడో మాత్రమే దేవారాధన తత్పరుడై ఉంటాడు. చాలా మంది రజోనిష్ఠులు గానో, తమోనిష్ఠులు గానో ఉంటారు ***(బాహుళ్యేన తు రజోనిష్ఠాః తమోనిష్ఠాః చ ఏవ ప్రాణినః భవన్తి)***.

ఆచార్యులు అలా వ్యాఖ్యానించడం వెనుక ఆంతర్యం ఏమిటో బాహాటం గానే తెలుస్తూ ఉంది. ఎక్కువ మంది అనిత్యమైన భోగాలకు, పదవులకు, కీర్తి ప్రతిష్ఠలకు ప్రాకులాడు తున్నారే గాని, పరమ పురుషార్థ మైన మోక్షం కొరకు పరమేశ్వరుని ఎంత మంది ఆరాధిస్తున్నారు?

అర్జునా! వేలాది మంది మనుషులలో ఏ ఒక్కడో మోక్షం కోసం ప్రయత్నిస్తాడు. అలాంటి వారిలో కూడా ఏ ఒక్కడో నా యథార్థ స్వరూపాన్ని తెలుసుకుంటాడు అని గీతాచార్యుడే ఏడవ అధ్యాయంలో చెప్పి ఉన్నాడు కదా *(7 వ అ - 3 వ శ్లో)*. విశిష్టమైన ఫలం కలది కాబట్టి జ్ఞానం దుర్లభము. అట్టి దుర్లభమైన జ్ఞానము కొరకు ప్రయత్నించే వారు కూడా దుర్లభులే మరి!

*రాజస, తామస శ్రద్ధలతో పూజాదికాలు నిర్వహించే వారు ఆసురీ సంపదకు సంబంధించిన వారు. వారు కూడా ఉగ్రమైన తపస్సులు చేస్తారు. అవన్నీ త్యాజ్యములే కాని యోగ్యములు కావని, తరువాత వరుసగా రెండు శ్లోకాలలో చెబుతున్నాడు.*

**అశాస్త్రవిహితం ఘోరం తప్యన్తే యే తపో జనాః ।**
**ద మ్భాహంకార సంయుక్తాః కామరాగ బలాన్వితాః ॥** 5

*అశాస్త్రవిహితం-ఘోరం-తప్యంతే-యే-తపః-జనాః*
*దంభాహంకార సంయుక్తాః-కామరాగబలాన్వితాః*

**కర్షయన్తః శరీరస్థం భూతగ్రామ మచేతసః ।**
**మాంచై వాన్తః శరీరస్థం తా న్వి ద్ధ్యాసుర నిశ్చయాన్ ॥**

*కర్షయంతః-శరీరస్థం-భూతగ్రామం-అచేతసః* 6
*మాం-చ-ఏవ-అంతః శరీరస్థం-తాన్-విద్ధి-ఆసురనిశ్చయాన్*

| | | | |
|---|---|---|---|
| అశాస్త్రవిహితం | = శాస్త్ర విరుద్ధమైన | భూతగ్రామం | = ఇంద్రియ సమూహమును |
| ఘోరం | = భయంకరమైన | అంతఃశరీరస్థం | = ఆంతర్యములో ఉన్న |
| తపః | = తపమును | మాం చ ఏవ | = నన్నును |
| యే | = ఎట్టి | కర్షయంతః | = కృశింప జేయుచున్న వారై |
| జనాః | = జనులు | తప్యంతే | = తపస్సు చేస్తున్నారో |
| దంభాహంకార సంయుక్తాః | = దంభము తోను, అహంకారము తోను కూడిన వారై | తాన్ | = అట్టి |
| కామరాగబలాన్వితాః | = కామరాగ బలముతో కూడిన వారు | అచేతసః | = అవివేకులు |
| శరీరస్థం | = శరీరము నందున్న | ఆసుర నిశ్చయాన్ | = అసుర స్వభావము గల వారని |
| | | విద్ధి | = గ్రహించు |

**అర్జునా! అసుర స్వభావులు దంభముతో, అహంకారముతో ఉంటారు. వీరు కామ రాగ బలాన్వితులు. శాస్త్ర విరుద్ధంగా ఘోరమైన తపస్సులు చేస్తారు.**

**దేహము నందున్న ఇంద్రియాలను శుష్కింప చేస్తారు. శరీరంలో ఉన్న నన్ను కూడా కృశింప చేస్తారు. వీళ్ళు అవివేకులు. అసుర జీవనం కల వారని తెలుసుకో!**

వ్యాఖ్య

సాత్త్వికులు దైవీ ప్రకృతికి సంబంధించిన వారు. సాత్త్విక శ్రద్ధ కలిగిన దైవీ సంపద కల వారు దేవతలను పూజిస్తారు. ఇక రాజసులు, తామసులు ఆసురీ సంపదకు సంబంధించిన వారు. వారి అసుర ధర్మాన్ని ప్రస్తుతం ఐదు, ఆరు శ్లోకాలలో చెబుతున్నాడు.

శాస్త్రోక్తము కాని, శాస్త్ర విధి విధానమునకు సంబంధించని దారుణమైన తపస్సును అసుర సంపద కలిగిన ఈ రాజస తామసులు ఆచరిస్తారు.

ఏదయితే శాస్త్రము చేత ప్రతిపాదించ బడ లేదో అది అశాస్త్ర విహితము ***(న శాస్త్ర విహితమ్ అశాస్త్ర విహితమ్)***. అసుర జనులు ఆచరించే తపస్సు శాస్త్ర ప్రతిపాదితము కాక పోవడమే గాక ఘోర మైనది కూడా. ఘోర మైనది అంటే పీడాకర మైనది ***(ఘోరం పీడాకారం ప్రాణినామ్)***. తనకు, ఇతరులకు పీడను కలిగించే ఉగ్ర రూప సాధనే ఘోర తపస్సు. రాజస తామస ప్రవృత్తి కల ఆసురీ ప్రకృతికి సంబంధించిన వారు శాస్త్ర విరుద్ధ మైన ఈ ఘోర తపస్సులు ఆచరిస్తారు. ఇవి శాస్త్ర విరుద్ధాలు కనుక నింద్యములు.

ఉగ్ర రూపాన్ని ప్రదర్శించే వీరి తపస్సులు వారికి, లోకానికి కూడా హితకర మైనవి కావు. పైగా, ఇరువురికీ





పీడను కలిగిస్తాయి కనుక అహితములు. గర్హనీయములు. తపస్సు అనేది ఏదైనా మనస్సు లోని పాపాలను, దోషాలను నివారించు కొనేందుకే ఉద్దేశింప బడింది.

***తపతీతి తపః*** - తపింప చేసేది కనుక తపస్సు అన్నారు. భూమి నుండి బంగారును వెలికి తీసి నపుడు దానిని నిప్పులో బాగా కాల్చుతారు. తపింప చేస్తారు. అలా చేయడం వల్ల బంగారు నిష్కల్మషమై, నిర్మలమై, నిగ్గు తీరి దివ్యంగా ప్రకాశిస్తుంది. అలాగే మనస్సు లోని దోషాలను నిర్మూలించుకొని మనస్సును పవిత్రం చేసుకోవడానికి ఉపకరించే పవిత్రమైన సాధనయే తపస్సు. తపస్సు చేత పాపాలు క్షీణింప చేసుకున్న ముముక్షువులు, జ్ఞానప్రాప్తి ద్వారా మోక్షసిద్ధికి ప్రయత్నిస్తారు ***(తపోభిః క్షీణ పాపానాం)***. ఇది సాత్త్వికులు ఆచరించే తపస్సు. దైవీ సంపద కల వారు అనుష్ఠించే తపస్సు. ఈ తపస్సు తేజోవంత మైనది. ఈ విధమైన తపస్సు తాపసులనే గాక, వారిని ఆశ్రయించిన వారికి కూడా స్ఫూర్తిని, దీప్తిని ప్రసాదించి వారి జీవితాలను కూడా తేజోమయం చేస్తుంది. కాని, ప్రస్తుతం మనం చూస్తున్న అశాస్త్ర విహితము, దారుణము అయిన ఈ తపస్సు తాపసులకు, అలాగే ఇతరులకు కూడా పీడనే కలిగిస్తూ ఉంది ***(పీడాకారం ప్రాణినామ్ ఆత్మనశ్చ)***.

అసుర జనులు కొందరు తపస్సు పేరుతో కఠోరమైన ఉపవాస దీక్షలు చేస్తూ ఉంటారు. ఉపవాస దీక్షలు పరమోత్కృష్ట మని వారి అభిప్రాయము. ఉపవసించడం ఆరోగ్యానికి మంచిదే కాని, అది ఏదో, ఎప్పుడో అవసరాన్ని దృష్టిలో పెట్టుకొని చెయ్యాలి. ఏకాదశీ వ్రతాల వంటివి అనుసరించ వచ్చు. అలాగని ఉపవాసాన్నే ఒక ఉగ్ర తపస్సుగా మలచుకొని రోజుల తరబడి నిరాహారంగా ఉండటం, తత్ఫలితంగా దేహేంద్రియ మనోబుద్ధులు శుష్కించి పోతూ ఉంటే, ఈ దారుణాన్ని చూడలేక సన్నిహితులు, బంధువులు పరితపిస్తూ ఉండటం తపస్సు అని శాస్త్రం ఎక్కడా చెప్ప లేదు. అందువల్ల వీళ్ళు ఆచరించే తపస్సు అశాస్త్ర విహితము. ఉపవాసాలే గనుక ఉదార తపస్సులై ఆధ్యాత్మిక ఉన్నతికి సహకరించే టట్లైతే, ముప్పూటలా తిండికి నోచుకోని పేదలు, రోగులు, బిచ్చగాళ్ళు అందరూ తాపసులై, యోగులై తరించి పోయి ఉండే వారు.

మరి, అలాంటప్పుడు ఈ ఆసురీలు ఈ విధమైన ఉగ్ర తపస్సులు ఎందుకు చేస్తారు? ఏముంది! దంభానికి చేస్తారు. అహంకారాన్ని ప్రదర్శించుకోవ డానికి చేస్తారు. అదొక ఆటోపము. దంభము. తనను మించిన వారు లేరు అని ప్రకటించుకొనే జంభము. రాజస తామస ప్రవృత్తి కలిగిన తపస్సు లన్నీ ఇలాగే ఉంటాయి. చేసే వాళ్ళకు ఉపయుక్తం కావు. పరులకూ ఉపకరించవు. పైగా, ఉభయులకూ కీడు చేస్తాయి. పరితాపాన్నే మిగుల్చుతాయి.

కొందరు పది మంది తిరిగే చోట ఒంటి కాలు మీద నిలబడి కఠోరంగా తపిస్తూ ఉంటారు. ఆ తరువాత కొంపలో తైల మర్దనం చేయ లేక కుటుంబీకులు యాతన పడుతూ ఉంటారు.

కొందరు ***తప్త శిలారోహణ తపస్సు***ను కూడలిలో నిలబడి ఆచరిస్తూ ఉంటారు. ఇందులో తపస్సేమీ ఉండదు. అంతా ప్రదర్శనమే. తప్తశిల అంటే బాగా వేడెక్కిన రాయి. ఆ కాలే రాతి మీద కాళ్ళు పెట్టి, కళ్ళు పైకెత్తి చూస్తూ, కదలకుండా నిలబడి ఉండటము తప్తశిలారోహణ తపస్సు. నాకు తెలిసి శాస్త్రంలో ఎక్కడా ఈ దరిద్రం లేదు. అదేదో ఉగ్రమైన భద్ర తపస్సు అని పదుగురి మెప్పు కోసం ఈ దారుణాన్ని భరిస్తారు. మరి, వాళ్ళకు కాళ్ళు మండి పోవా? ఎలా చేస్తారు? ఎందుకు మండి పోవు! కాళ్ళు మండి పోయినా, జన హృదయాలలో వారి కీర్తి నిండి పోవాలి అనేదే వారి దుగ్ధ. కూడలిలో ప్రదర్శన మిచ్చి కొంపకు చేరుతారు. ఇంకే ముంది? కొన్ని రోజుల వరకు కదల లేరు. మంచం లోనే పడి ఉంటారు. కాలిన కాళ్ళకు కొబ్బరి నూనె పట్టించ లేక కుటుంబీకు లంతా దిక్కు తోచని స్థితిలో కూలబడతారు. **మెచ్చుకు పెద్దమామ చస్తే, ఏడ్వలేక ఇంట్లో వాళ్ళు చచ్చారట** అనే సామెత బహుశ ఈ కుహనా తపోధనుల మహిమను చాటేందుకే పుట్టిందేమో!

అందుచేతనే శాస్త్ర విరుద్ధంగా వీరు ఆచరించే దారుణ మైన తపస్సులు దంభాహంకార సంయుక్తాలు అంటున్నాడు. అంటే, డాంభికత్వముతో, అహంకారముతో కూడినవే గాని పవిత్రమైన తపస్సులు కావు అని చెబుతున్నాడు.

అది నిజమే కావచ్చు. కాని, ఇంతటి దారుణమైన, కఠోరమైన కార్యాలు చేయడానికి వారికి అంత శక్తి ఎక్కడిది? ఆ బలం ఎవరిది? అది దైవబలం కాదు, అసుర బలం. అది దైవశక్తి కాదు, రాక్షస శక్తి. తపస్సు పేరుతో వారు అనుభవించే దారుణమైన బాధలను భరించే శక్తి వారికి కామం నుండి వస్తుంది. రాగం నుండి వస్తుంది. అది కామ శక్తి, రాగ శక్తి. అది కామం యొక్క బలం. రాగం యొక్క బలం. అందుకే వారిని కామ రాగ బలాన్వితులు అంటున్నాడు భగవంతుడు. అంటే, వారి బలం కామం చేత, రాగం చేత తయారైనది. అట్టి బలంతో కూడిన వారు కనుక వారు కామ రాగ బలాన్వితులు (**కామశ్చ రాగశ్చ కామరాగౌ, తత్కృతం బలం కామ రాగబలమ్, తేన అన్వితాః కామరాగ బలైః వా అన్వితాః కామరాగ బలాన్వితాః**).

దైవసంపద గల సాత్త్వికులకు భక్తియే బలం. జ్ఞానమే బలం. కాని, అసుర సంపద గల రాజస తామసులకు కామమే బలం. రాగమే బలం. అందుచేత వారు కామ రాగ బలాన్వితులు. ఇది క్షుద్రబలం. భద్రత నివ్వ లేని దరిద్ర బలం. దంభాహంకార సంయుక్తులై, కామరాగ బలాన్వితులై, రాజస తామస శ్రద్ధా ప్రేరితులైన ఆసురీ సంపద గల వారు ఆచరించే ఘోర తపస్సులు శాస్త్ర విరుద్ధాలు. స్వీయ ప్రగతి నిరోధకాలు. పర పీడనాలు.

రావణాసురుడు ఎంత ఘోర తపస్సు చేశాడు? హిరణ్యకశిపుడు ఎంత దారుణమైన తపస్సు నాచరించాడు? వీరిరువురు దేహేంద్రియాలను ఎంతగా శుష్కింప చేసుకున్నారు? బ్రహ్మరుద్రాదుల నుండి ఎన్ని వరాలను పొందారు? చివరికి ఏమి సాధించారు? వాళ్ళ తపః ఫల మేమిటి? ఏముంది! వారికీ సుఖం లేదు, వారిని ఆశ్రయించిన వారికీ మేలు లేదు. అంతా విధ్వంసమే. అంతా వినాశమే.

కఠోరమైన తపస్సు చేసి దివ్యమైన వరాలను పొందిన రావణాసురుడు కామం చేతికి చిక్కి శాశ్వతంగా కన్ను మూసాడు. భయంకరమైన తపస్సు నాచరించి అనితర సాధ్యమైన, విచిత్రమైన వరాలను పొందిన హిరణ్యకశిపుడు క్రోధము చేతిలో దారుణంగా ఓడిపోయి, నరసింహమూర్తి ఒడిలో నఖముల చేత చీల్చ బడి అసువులు బాసాడు.

మహోన్నత మైన ఉగ్ర తపస్సు నాచరించిన ఈ ఉభయులు, రాగద్వేషాది మల దోషాన్నే పోగొట్టుకోలేక పోయారు. చిత్తశుద్ధినే సాధించలేక పోయారు. ఇక మోక్షాన్ని సాధించే దేముంటుంది? మరి, వీళ్ళు ఎందుకని అలా అయ్యారు? ఏముంది, వారు అచేతసులు కావడమే కారణం అంటున్నాడు భగవంతుడు.

అచేతసులు అంటే అవివేకులు (**అచేతసః అవివేకినః**). అంటే వివేకము లేని వారు. ఆలోచనలలో స్పష్టత లేని వాళ్ళు. బుద్ధికి ప్రాధాన్యము నిచ్చే వాళ్ళే గాని బుద్ధిమంతులు, జ్ఞానవంతులు కావాలనే ఆలోచన చేయలేని వాళ్ళు. వివేకం లేని వాళ్ళు కనుక, వారి అనాలోచిత చర్యల వల్ల వాళ్ళు పతనం కావడమే గాక, ఇతరుల ప్రగతిని కూడా పాడు చేస్తారు. దారి తప్పిన వాళ్ళు కనుక, ఏ కారణం చేత నైనా పవిత్రమైన రంగాలకు సంబంధించిన కార్య క్షేత్రాలలో ప్రవేశించారంటే, ప్రజలు పెద్ద సంఖ్యలో పాడై పోతారు.

వివేకం కల వారు తాము ప్రగతిని సాధించడమే గాక, ఇతరులను కూడా ప్రగతి పథంలో నడిపిస్తారు. వివేకం లేని వారు, అంటే మనం చెప్పుకుంటున్న ఈ అచేతసులు; వాళ్ళు నశించడమే గాక, పరులను కూడా నశింప చేస్తారు. కాని, ప్రస్తుత శ్లోకంలో భగవంతుడు విస్మయాన్ని కలిగించే ఒక వాక్యాన్ని వినిపిస్తున్నాడు.



అచేతసులు, అంటే అవివేకులు అర్థ రహితమైన వారి ఘోర తపస్సు వలన వారి దేహంలో ఉన్న ఇంద్రియాలను కృశింప చేసుకోవడమే గాక (**శరీరస్థం భూతగ్రామం కరణ సముదాయమ్ కర్శయన్తః కృశీ కుర్వన్తః**). వారి శరీరాల లోపలే వారి కర్మలకు, బుద్ధికి సాక్షిగా ఉన్న తనను కూడా కృశింప చేస్తున్నారు అంటున్నాడు (**మాం చ ఏవ తత్కర్మ బుద్ధి సాక్షి భూతమ్ అన్తః శరీరస్థం కర్శయన్తః**).

అవివేకులైన ఈ రాజస తామసులు, అశాస్త్ర విహితంగా వారు ఆచరించే ఘోర తపస్సు వల్ల ఇంద్రియ సముదాయాన్ని కృశింప చేస్తున్నారు. ఉపవాస వ్రతాలు మొదలైన కఠోర సాధనల వల్ల వారి దేహాలు నిస్సార మవుతున్నాయి. దేహం లోనే ఉన్న ఇంద్రియాలు కూడా నిర్వీర్య మవుతున్నాయి.

అంతే కాదు. అంత కన్నా లోపల, శరీరంలో చైతన్య స్ఫూర్తిగా పరమేశ్వరుడే హృదయస్థుడై ఉన్నాడు. అట్టి పరమాత్మను కూడా వారు కష్ట పెడుతున్నారు అంటున్నాడు.

ఇంద్రియాలను శుష్కింప చేస్తున్నారు అనే వాక్యాన్ని అర్థం చేసుకో వచ్చు. అర్థం చేసుకున్నాం కూడా. కాని, పరమేశ్వరుని శుష్కింప చేస్తున్నారు అనే దానిని ఎలా అర్థం చేసుకోవాలి? శ్రీ శంకరులు ఎలా అర్థం చేసుకున్నారో అలాగే అర్థం చేసుకోవాలి.

పరమేశ్వరుని కృశింప చేయడము అంటే, పరమేశ్వరుని శాసనాన్ని అతిక్రమించడమే (**మదను శాసన అకరణ మేవ మత్కర్శనమ్** - శంకర భాష్యము).

ప్రమాణ మైన శాస్త్రము జ్ఞాన స్వరూపము. ఆ జ్ఞానము ఈశ్వర జ్ఞానమే. ఈశ్వరుడు, ఈశ్వర జ్ఞానము రెండు కావు. అచేతసులైన అసుర జనులు శాస్త్ర విరుద్ధ మైన తపస్సులను ఆచరించుట చేత, శాస్త్ర ధర్మాలను అతిక్రమిస్తున్నారు. కనుక, పరమేశ్వరుని అతిక్రమిస్తున్నారు.

ఇకపోతే, అశాస్త్ర విహితులైన రాజస తామసులు ధర్మ దూరులు. అధర్మపరులు. ధర్మము ఏదో కాదు, నియతి. నియతి రూపంలో ఉన్నది ఎవరో కాదు, నియంతయే, పరమేశ్వరుడే. కనుక, ధర్మాన్ని అతిక్రమించే ఈ అచేతసులు ధర్మ రూపంలో ఉన్న దైవాన్ని అతిక్రమించిన వారే అయ్యారు. ఈ విధంగా జ్ఞానాన్ని, ధర్మాన్ని తిరస్కరించి, దైవాన్ని తిరస్కరించిన వారయ్యారు. ఆసురీ ప్రకృతికి సంబంధించిన రాజస తామసులు అసుర నిశ్చయం కల వాళ్ళని తెలుసుకో మంటున్నాడు భగవంతుడు (**తాన్ విద్ధి అసుర నిశ్చయాన్**). అలాంటి అసుర జనాన్ని గూర్చి గీత ప్రబోధించడ మెందుకు? అసుర సంబంధమైన ఈ అనర్థ విషయాన్ని మనం ఆలకించడ మెందుకు? అనే సందేహం కలగ వచ్చు. దానిని నివారించేందుకు భాష్యంలో ఆచార్యుల వారు ఒక్క వాక్యం పలికారు. అసుర జనుల నుండి, అసుర ప్రవృత్తి నుండి దూరంగా ఉండ మని సూచించడం కోసమే ఈ ఉపదేశం అని సందేశ మిచ్చారు (**యేషాం తే ఆసుర నిశ్చయాః తాన్ పరిహారణార్థం విద్ధి ఇతి ఉపదేశః**).

*గుణభేదాన్ని బట్టి త్రివిధము లైన పూజలను నాల్గవ శ్లోకంలో ఎలాగైతే చూశామో, అలాగే ఇప్పుడు త్రివిధములుగా తెలుస్తున్న ఆహారము, యజ్ఞము, తపస్సు, దానములను గూర్చి కూడా చెబుతున్నాడు.*

**ఆహార స్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః ।** 7
**యజ్ఞ స్తప స్తథా దానం తేషాం భేద మిమం శృణు ॥**

ఆహారః-తు-అపి-సర్వస్య-త్రివిధః-భవతి-ప్రియః
యజ్ఞః-తపః-తథా-దానం-తేషాం-భేదం-ఇమం-శృణు

సర్వస్య = సర్వులకు

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆహారఃతు అపి | = | ఆహారము కూడా | తపః | = | తపస్సు |
| త్రివిధః | = | మూడు విధములు | దానం | = | దానమును |
| ప్రియః | = | ప్రియమైనది | తేషాం | = | వాని యొక్క |
| భవతి | = | అగుచున్నది | ఇమం | = | ఈ |
| తథా | = | అటులనే | భేదం | = | భేదమును |
| యజ్ఞః | = | యజ్ఞము | శృణు | = | విను |

**అర్జునా! అందరికీ ప్రియమైన ఆహారము కూడా మూడు విధాలుగా ఉంది. అలాగే యజ్ఞము, తపస్సు, దానము కూడా మూడు విధాలు. వాటి లోని అంతరాన్ని చెబుతా. విను.**

**వ్యాఖ్య**

అసుర జనుల నుండి, అసుర ప్రవృత్తి నుండి దూరంగా ఉండటం కొరకు అసుర సంపదను ఎలాగైతే తెలుసుకున్నామో, అలాగే సాత్త్విక, రాజస, తామసులకు ప్రియంగా ఉండే త్రివిధ ఆహారాలను తెలుసుకోవడం చేత, ఎవరు ఏ ఆహారము నందు ప్రీతి కలిగి ఉన్నారో, దానిని బట్టి కార్యలింగము చేత (***కార్య లింగేన***) వారు సాత్త్వికులా, రాజసులా, తామసులా? అని తెలుసుకో వచ్చు. అలా తెలుసుకోవడం చేత, అసుర సంపదను పరిత్యజించాలని పూర్వం ఎలాగైతే చెప్పుకున్నామో, అలాగే ఇక్కడ కూడా రజ స్తమో గుణ లింగాలైన ఆహారా లను ముట్టకుండా, సత్త్వగుణ లింగాలైన ఆహారాలనే స్వీకరించ వచ్చు. అలాగే గుణ భేదాలను బట్టి యజ్ఞ దాన తపస్సులను తెలుసుకొని రాజస తామస యజ్ఞాలను, తపస్సులను, దానాలను పరిత్యజించి సాత్త్విక యజ్ఞా లను, తపస్సులను, దానాలను అనుష్ఠించడం కొరకు ఆహారాది త్రివిధ భేదాలను చెప్పడం జరుగుతూ ఉంది.

జ్ఞానము సిద్ధించాలంటే చిత్తము శుద్ధి పడి ఉండాలి. ఆహారము యొక్క సూక్ష్మాంశమే మనస్సు అవుతుంది. కనుక, మనం తీసుకొనే ఆహారము యొక్క ప్రభావము మనస్సు పై ఉంటుంది. మనం ఎలాంటి ఆహారాన్ని తీసుకుంటామో, అలాంటి బుద్ధే తయారవుతుంది అన్నారు పెద్దలు (***యాదృశం భక్షయేత్ అన్నం బుద్ధి ర్భవతి తాదృశీ***).

ఆహారము అంటే కేవలం అన్నము అనే అర్థాన్నే గ్రహించ డానికి లేదు. బాహ్యము నుండి మన లోకి ప్రవేశించేది ఏదైనా ఆహారమే. మనం పీల్చే గాలి కూడా ఆహారమే. బాహ్యం లోని శబ్దాది విషయాలు మన దేహం లోని శ్రోత్రాది ఇంద్రియాల ద్వారా లోనికి ప్రవేశిస్తూ ఉన్నాయి కనుక అవి కూడా ఆహారం క్రిందికే వస్తాయి. అయినా ఆహారము అన్నపుడు అన్న పానీయాలనే ప్రముఖంగా గ్రహిస్తూ ఉంటారు. ఆహారం విషయాన్ని యోగ శాస్త్రమే గాక, జ్ఞానకాండకు సంబంధించిన ఉపనిషత్తులు కూడా ప్రముఖం గానే చర్చించాయి.

***ఆహార శుద్ధౌ సత్త్వశుద్ధిః సత్త్వశుద్ధౌ ధ్రువాస్మృతిః స్మృతిలమ్భే సర్వ గ్రన్థీనాం విప్రమోక్షః తస్మై మృదిత కషాయాయ తమసః పారం దర్శయతి.***

ఆహార శుద్ధితో అంతఃకరణ శుద్ధి కలుగుతుంది. అంతఃకరణ శుద్ధి వలన స్మృతి దృఢ మవుతుంది. నిశ్చలమైన స్మృతి చేత అజ్ఞాన ముడు లన్నీ విడి పోతాయి. తద్వారా దోషాలన్నీ దూర మవుతాయి అని భగవంతుడైన సనత్కుమారుడు నారద మహర్షికి ఛాందోగ్యోపనిషత్తులో బోధించాడు (*ఛాం॥ 7 - 26 - 2*).

మహాభారతం - ఉద్యోగ పర్వంలో శ్రీకృష్ణ పరమాత్మ రాయబారాని కేగి నపుడు దుర్యోధనుడు భగవంతుని విందుకు ఆహ్వానిస్తే, పరమేశ్వరుడు అంగీకరించ లేదు. సున్నితంగా తిరస్కరించాడు. ***ద్విషదన్నం న భోక్తవ్యం*** - విద్వేషులు పెట్టే ఆహారాన్ని భుజించ కూడదు అన్నాడు భగవంతుడు.



ఆహారం ఎలాగైతే మూడు విధాలుగా ఉందో, యజ్ఞ దాన తపస్సులు కూడా గుణ భేదాన్ని బట్టి మూడు విధాలుగా ఉన్నాయి. వాటికి సంబంధించిన భేదాన్ని వివరంగా చెబుతున్నాడు.

*ముందుగా సాత్త్విక శ్రద్ధ కల వానికి ఏ విధమైన ఆహారము ప్రియమో చెబుతున్నాడు.*

**ఆయుః సత్త్వ బలారోగ్య సుఖ ప్రీతి వివర్ధనాః ।**
**రస్యాః స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారాః సాత్త్వికప్రియాః ॥** 8

*ఆయుః-సత్త్వ- బలః-ఆరోగ్యః-సుఖః-ప్రీతిః-వివర్ధనాః*
*రస్యాః-స్నిగ్ధాః-స్థిరాః-హృద్యాః-ఆహారాః-సాత్త్వికప్రియాః*

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆయుః | = | ఆయువు | రస్యాః | = | రస పూర్ణ మైనవి |
| సత్త్వః | = | సత్త్వము | స్నిగ్ధాః | = | చమురు గలవి |
| బలః | = | బలము | స్థిరాః | = | స్థిర మైనవి |
| ఆరోగ్యః | = | ఆరోగ్యము | హృద్యాః | = | మనస్సునకు ప్రియ మైనవి |
| సుఖః | = | సుఖము | ఆహారాః | = | ఆహారములు |
| ప్రీతిః | = | సంతోషము | సాత్త్వికప్రియాః | = | సాత్త్వికులకు ప్రియములు |
| వివర్ధనాః | = | వృద్ధి చేయునవి | | | |

**అర్జునా! ఆయుష్షును, సత్త్వమును, బలమును, ఆరోగ్యమును, సుఖమును, ప్రీతిని వృద్ధి చేసేవి - అలాగే రసపూర్ణ మైనవి, స్నిగ్ధము, స్థిరము, హృద్యము అయిన ఆహారములు సాత్త్వికులకు ప్రియ మైనవి.**

**వ్యాఖ్య**

సాత్త్వికులైన వారికి ప్రియమైన ఆహారమును గూర్చి చెబుతున్నాడు. అదే సాత్త్వికాహారము. పది విషయా లతో కూడి ఉన్నది. ఈ ఆహారము ఏమి ఇస్తుందో, ఆరు విషయాలుగా చెప్ప బడ్డాయి. ఈ ఆహారము ఎలా ఉంటుందో, నాలుగు విషయాలలో చెప్పడం జరిగింది. మొత్తం పది విషయాలు.

**ఆయుర్వర్ధనం :-** సాత్త్వికాహారము ఆయుర్దాయమును పెంచేదై ఉండాలి. ఎలాంటి ఆహారాన్ని గ్రహిస్తే దీర్ఘ జీవితం ఉంటుందో అది సాత్త్వికము. దీర్ఘ జీవిత మెందుకు? కాకితో పోటీ పడటానికా? కాదు. ధర్మ, జ్ఞాన సంపాదనార్థం దీర్ఘాయువు ఉండాలి. అలాంటి ఆయుష్షును ప్రసాదించే ఆహారము సాత్త్వికము. ఏది దీర్ఘ కాల జీవనాన్ని ప్రసాదిస్తుందో అది సాత్త్వికాహారము.

**సత్త్వస్థితి :-** సత్త్వము అంటే చిత్త స్థైర్యము. దుఃఖాలు, బాధలు ముంచు కొచ్చినా చెదరని, చెరగని ధైర్యాన్ని, స్థైర్యాన్ని కలిగించే ఆహారము సాత్త్వికాహారము. మనస్సులో ఉద్యమ స్ఫూర్తి, ఉత్సాహ దీప్తి సత్త్వ ప్రధానాలు.

**బలవర్ధకం :-** మనస్సుకు పుష్టి నిచ్చేది సత్త్వ మైతే, దేహానికి పుష్టి నిచ్చేది బలం. అదే ధాతు పుష్టి (**ధాతు ప్రపోషణమ్**). కార్య నిర్వహణము నందు దేహ సామర్థ్యమే బలం. అట్టి బలమును పెంపొందించేది సాత్త్వికము. దేహేంద్రియములకు పుష్టి నిచ్చే ఆహారము.

**ఆరోగ్య ప్రదం :-** ఆహారము ఆరోగ్యాన్ని ప్రసాదించేదై ఉండాలి. అట్టి ఆరోగ్యప్రద మైన ఆహారము సాత్త్వికము. రోగము లేకుండా ఉండటమే ఆరోగ్యము. కనుక సాత్త్వికాహారము ఔషధ లక్షణాలను కూడా కలిగి ఉంటుందని భావము. వ్యాధుల్ని, దేహ బాధల్ని దగ్గరకు రానివ్వని ఆహారము.

**సుఖ వర్ధనం :-** ఆహారము సుఖాన్ని పెంపొందించేదై ఉండాలి. ఆహార సేవనము హృదయాహ్లాదాన్ని కలిగించాలి. భుజించడంలో ఆనందము కలగాలి. తినే కొద్ది సుఖము, లేదా ఆనందము కూడా పెరుగుతూ ఉండాలి. భోజనానంతరము ఆయాసము లేకుండా ఆనందాన్ని ప్రసాదించేదై ఉండాలి.

**ప్రీతి వర్ధనం :-** తినడానికే కాదు, చూడటానికి కూడా ప్రియంగా ఉండాలి. కొన్ని పదార్థాలను చూడగానే ఆకలి చచ్చి పోతుంది. 'చూడటానికి అలా ఉంటుంది. తిని చూడండి మీకే తెలుస్తుంది' అని వడ్డించే వాళ్ళు చెబుతూ ఉంటారు. కళ్ళే వద్దంటుంటే, ఇక కడుపెలా సాహసిస్తుంది? చూచే కొద్దీ తినా లనిపించాలి. అప్పుడే అది ప్రీతి వర్ధనము. ఇంతవరకు సాత్త్వికాహారము మనకు ఏమి ఇస్తుందో తెలుసుకున్నాం. ఇక ఆ విధమైన ఆహారము ఎలా ఉంటుందో తరువాత నాలుగు విషయాలలో చూద్దాం.

**రసపూర్ణం :-** రసవంత మైనవి. మధుర మైనవి. రసయుక్త మైనవి (***రసోపేతాః***). రుచికరమై ఆస్వాదింప దగిన ఫల రసనీయాలు. మధుర రస ప్రధానమైన ఆహారములు (***రస్యాః***). సులభంగా జీర్ణమయ్యే పండ్లు, కాయలు మొదలైనవి (***లఘు పాకం***).

**స్నిగ్ధములు :-** స్నిగ్ధములు అంటే చమురు కలవి. స్నేహవంతాలు. స్నేహయుక్తాలు (***స్నేహవన్తః***). పుష్టి వంతాలు. పాలు, నెయ్యి, వెన్న, పెరుగు మొదలైనవి సహజ స్నేహయుతాలు. ఆగంతుకము లైన ఘృతము మొదలైన వాటితో కలిసిన పుష్టికరమైన పదార్థాలు కూడా స్నిగ్ధములే.

**స్థిరములు :-** స్థిరములు అంటే స్థిర మైనవి (***స్థిరాః***). స్థిరమైన పరిణామం కలవి. ఎక్కువ కాలము దేహానికి పుష్టిని, శక్తిని ఇస్తూ ఉపకరించేవి స్థిరములు. అపకారం చేయకుండా, నిదానంగా జీర్ణ మౌతూ శరీరానికి ధార లాగా శక్తిని సమకూర్చేవి (***చిరకాల స్థాయినో దేహే***). సారవంత మైనవి. పుష్టి దాయకాలు. దీర్ఘ పుష్టి దాయకాలు.

**హృద్యములు :-** హృదయాహ్లాదములు. హృదయ ప్రియాలు (***హృద్యాః హృదయ ప్రియాః***). హృదయంగమములు. శుచి, గంధ, దర్శన ప్రియాలు. మనోహరాలు. దర్శనము తోనే హృదయాన్ని ఆకర్షించేవి. రమణీయాలు. మనస్సుకు ఇంపితాలు.

ఈ విధమైన ఆహారాలు (***ఆహారాః***) - అంటే చర్వ్యములైన చోష్య, లేహ్య, పేయాలు సాత్త్వికులకు ప్రియ మైనవి (***సాత్త్విక ప్రియాః సాత్త్వికస్య ఇష్టాః***). ఇంతవరకు మనం చెప్పుకొనిన పది విషయాలు ఒకే పదార్థములో లభించే అవకాశం ఉందా? అది కూడా ఆగంతుకాలతో కలవకుండా ఒకే పదార్థములో సహజంగా ఉంటాయా? ఏమో! కొబ్బరిని గూర్చి కొద్దిగా ఆలోచించండి. ఇది నా అభిప్రాయం మాత్రమే. చర్చనీయాంశం కాదు.

*ఇక రాజసులకు ప్రియమైన ఆహారాన్ని చెబుతున్నాడు.*

**కట్వామ్ల లవణాత్యుష్ణ తీక్ష్ణరూక్ష విదాహినః ।**
**ఆహారా రాజస స్యేష్టా దుఃఖశోకామయప్రదాః ॥** 9

*కటు-అమ్ల-లవణ-అత్యుష్ణ-తీక్ష్ణ-రూక్ష-విదాహినః*
*ఆహారాః-రాజసస్య-ఇష్టాః-దుఃఖశోకామయప్రదాః*

| | |
|---|---|
| కటు | = చేదు |
| అమ్ల | = పులుపు |
| లవణ | = ఉప్పు |
| అత్యుష్ణ | = మిక్కిలి వేడి |
| తీక్ష్ణ | = కారము |





| | |
|---|---|
| రూక్ష | = శోషకరము |
| విదాహినః | = దాహము కలిగించేవి |
| దుఃఖశోకామయప్రదాః | = దుఃఖమును, శోకమును కలుగజేయునవి అగు |
| ఆహారాః | = ఆహారములు |
| రాజసస్య | = రజోగుణము గల వారికి |
| ఇష్టాః | = ఇష్టములు |

**అర్జునా! చేదు, పులుపు, ఉప్పు, మిక్కిలి వేడి, కారము, రసహీనము, దాహం కలిగించేవి - ఈ విధమైన పదార్థాలు రాజసులకు ప్రియమైన ఆహారాలు.**

**వ్యాఖ్య**

***ఆయుస్సత్త్వ బలారోగ్య*** అంటూ పది విషయాలతో సాత్త్వికులకు ప్రియమైన ఆహారమును గూర్చి చెప్పిన భగవంతుడు, ప్రస్తుత శ్లోకంలో **కట్వామ్ల లవణాత్యుష్ణ** అంటూ ఏడు విషయాలతో రాజసులకు ప్రియమైన ఆహారాన్ని గూర్చి చెబుతున్నాడు. ఈ శ్లోకం **కట్వామ్ల** అంటూ ప్రారంభమైంది. దీనికి **కట్వమ్ల** అని పాఠాంతరము కూడా ఉంది. ఎలాగైనా పఠించ వచ్చు.

చేదు (***కటుః***), పులుపు (***అమ్లః***), ఉప్పు (***లవణః***), అతివేడి (***అత్యుష్ణః***), కారము (***తీక్ష్ణః***), శోషకరము (***రూక్షః***), దాహయుతము (***విదాహినః***) - ఈ ఏడు విషయాలు కల ఆహారాలు రాజసులకు ప్రియ మైనవి (***ఆహారాః రాజసస్య ఇష్టాః ప్రియాః ఇతి***). ఇవి దుఃఖశోకామయప్రదాలు (***దుఃఖ శోకామయప్రదాః***).

***కట్వామ్ల లవణాత్యుష్ణ తీక్ష్ణ రూక్ష విదాహినః*** అనే ఏడు విషయాలలో నాల్గవది అత్యుష్ణము. 'అతి' అనే శబ్దం కలవడం చేత ఉష్ణము అత్యుష్ణ మైంది. ఈ 'అతి' శబ్దాన్ని మిగత ఆరంటికి కూడా అన్వయించు కోవాలి. అప్పుడు అతి చేదు, అతి పులుపు అంటూ అన్నీ అతిగా వ్యవహరిస్తాయి (***అత్యుష్ణః అతి శబ్దః కట్వాదిషు సర్వత్ర యోజ్యః - అతి కటుః అతి అమ్లః ఇత్యేవమ్***). ఇందులో ఒక అంతర్భావము కూడా ఉంది. 'అతి' శబ్దాన్ని ఏడు విషయాలకూ అన్వయించు కుంటున్నాము కదా! అతి అనేది ఎక్కడైనా, ఎప్పుడైనా వర్జనీయమే (***అతి సర్వత్ర వర్జయేత్***). కనుక, రాజసులకు ఇష్టమైన ఈ ఏడు విషయాలు కూడా విడువ దగినవే గాని వాడుకో దగినవి కావు. ఉపేక్షణీయాలే గాని అపేక్షణీయాలు కావు.

రాజసులు స్వీకరించే ఆహారములో 'అతి' సర్వత్ర దర్శనీయంగా ఉంటుంది. చట్నీలో పులుపు చిక్కగా తెలుస్తూ ఉన్నా, నిమ్మళంగా నిమ్మ చెక్కను పిండుకొని నిండుగా, దండిగా భోం చేస్తూ ఉంటారు. పులుపుతో సరిపెట్టుకోరు. అతి పులుపును ఆదరిస్తారు. పులుపు అతిగా ఉంది కనుక ఉప్పు, కారము కూడా అతి గానే ఉంటాయి.

సాత్త్వికాహారం యోగ్యమై, యోగమయంగా ఉంటే, రాజసాహారం అయోగ్యమై రోగమయంగా ఉంటుంది. కట్వామ్లాలు అతిగా తీసుకోవడం వల్ల జీర్ణక్రియ దెబ్బ తింటుంది. ఉదరాకాశంలో ఊపిరి సలుపని గాలి దుమార మంతా దీని ప్రభావమే. దేహం మీదే కాకుండా మనస్సు పై కూడా దీని ప్రభావం ఉంటుంది. మనస్సులో క్రోధావేశము, చాంచల్యము మొదలైన వన్నీ తీక్ష్ణామ్ల లవణాల ప్రభావమే. చట్నీలు, పచ్చళ్ళు, నిలువ ఉంచిన వ్యంజనములు ఆరోగ్యాన్ని పాడు చేసే రాజసాహారాలే. రాజసాహారా లన్నీ నాలుకకు విందు చేస్తాయి. మనస్సుకు పసందును కలిగిస్తాయి. ఉదరాన్ని మాత్రం పాడు చేస్తాయి. ఆరోగ్యానికి కీడు తెస్తాయి. అతి ఉష్ణం కారణం గానే నరాలు బలహీన పడతాయి. వృద్ధాప్యంలో దేహాంగాల కంపనాలు, కరచరణాదుల చలనాలు - ఇవన్నీ వయసులో అతి వేడి పదార్థాలను, పానీయాలను స్వీకరించడం వల్ల కలిగిన అనర్థాలే. దేహానికి, ఇంద్రియాలకు,

ప్రాణానికి, మనస్సుకు ముప్పు కలిగించ డానికి ముందు వరుసలో ఉండేది ఉప్పే. ధాతు నష్టం మొదలుకొని రక్తపోటు వరకు అంతా ఉప్పు నిర్వాకమే.

రాజసులకు ప్రియమైన ఈ రాజసాహారము చివరగా దుఃఖ శోకామయప్రదము అంటున్నాడు (***దుఃఖ శోకామయప్రదః***).

దుఃఖమును, శోకమును ఆమయమును కలిగించే ఆహారములు కనుక అవి దుఃఖశోకామయ ప్రదాలు (***దుఃఖం చ శోకం చ ఆమయం చ ప్రయచ్ఛన్తి ఇతి దుఃఖ శోకామయప్రదాః***). రాజసాహారాన్ని తీసుకోవడం వల్ల తక్షణ ప్రభావమును చూపేది దుఃఖము. కాలాంతరములో దుర్భరమైన కష్టాన్ని కలిగించేది శోకము. ఇక ఆమయము అంటే రోగము. భుజించ గానే అజీర్ణ ఆయాసాది బాధలే దుఃఖాలు. కాలగతిలో భయంకరంగా బాధించే మధుమేహము, రక్తపోటు మొదలైనవి శోకరూపాలు. చివరగా రోగాల వాత పడటం ఆమయము. ఇవే, రాజసాహారం వల్ల కలిగే దుఃఖశోకామయాలు.

*ఇక తామసులకు ప్రియమైన ఆహారాన్ని గూర్చి చెబుతున్నాడు.*

**యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్ ।**
**ఉచ్ఛిష్ట మపి చామేధ్యం భోజనం తామస ప్రియమ్ ॥** 10

***యాతయామం-గతరసం-పూతి-పర్యుషితం-చ-యత్***
***ఉచ్ఛిష్టం-అపి-చ-అమేధ్యం-భోజనం-తామసప్రియం***

| | | | |
|---|---|---|---|
| యాతయామం | = వండిన తరువాత ఒక జాము గడిచినది | అమేధ్యం చ | = అశుద్ధ మైనది |
| గతరసం | = రుచి పోయినది | యత్ | = ఏ |
| పూతి | = దుర్గంధ మైనది | భోజనం | = ఆహారము |
| పర్యుషితం చ | = పాసి పోయింది | తత్ | = అది |
| ఉచ్ఛిష్టం అపి | = ఇతరులు తినగా మిగిలినది | తామసప్రియం | = తామసులకు ప్రియము |

**అర్జునా! పక్వం కాని ఆహారము, రసహీన మైనది, దుర్గంధ మైనది, పాసి పోయినది, ఎంగిలి చేసినది, అశుద్ధ మైనది - ఈ విధమైన ఆహారము తామసులకు ప్రియము.**

**వ్యాఖ్య**

పది విషయాలతో సాత్త్విక ప్రియమైన ఆహారాన్ని, ఏడు విషయాలతో రాజస ప్రియమైన ఆహారాన్ని తెలిపిన పరమేశ్వరుడు, ఆరు విషయాలతో తామస ప్రియమైన ఆహారాన్ని గూర్చి వివరిస్తున్నాడు. యాతయామం, గతరసం, పూతి, పర్యుషితం, ఉచ్ఛిష్టం, అమేధ్యం - ఈ ఆరు విధములైన ఆహారము తామస ప్రియమైనది.

**యాతయామం**

యాతయామము అంటే సరిగ పక్వము కాని ఆహారము అని అర్థము (***మందపక్వం***). కొంచెము పక్వ మైనది, లేదా సగం ఉడికినది అని అర్థము. ఇది భాష్యార్థము. శ్రీ శంకరులు చెప్పిన అర్థము.

***యామః*** అనేది కాల విషయము. యామ మంటే ఒక జాము కాలము అని అర్థము. జాము అంటే మూడు గంటల కాలము. ***యాతః*** అంటే గడచినది అని అర్థము. యాతయామము అంటే ఒక జాము, అంటే





మూడు గంటల కాలము గడచినది. వండిన తరువాత మూడు గంటల కాలము నిల్వ ఉంచిన ఆహారము యాతయామ మవుతుంది. వండిన ఆహారము నిల్వ చేసుకొనే పరికరాలు లేని ఆ రోజుల్లో మూడు గంటల కాలము ఆహారము నిల్వ ఉంటే పాడై పోయే అవకాశము ఉండేది. కనుక యాతయామ మైన ఆహారాన్ని ఎవ్వరూ స్వీకరించరు. కాని, అట్టి ఆహారమును తామసులు ప్రియంగా ఆరగిస్తారు.

**గతరసం**

రసం లేనిది గతరసం. రసహీనము. ఏ ఆహారము నందు రసము హరించుకుని పోయిందో అది గతరసం. నిర్వీర్యమైన ఆహారము (***నిర్వీర్యస్య గత రసేన ఉక్తత్వాత్, గతరసం రస వియుక్తం***). సారము లేని ఆహారము. పోషక పదార్థాలు క్షీణించిన ఆహారము. అట్టి ఆహారము తామస ప్రియము.

**పూతి**

పూతి అంటే దుర్వాసనతో కూడినది (***పూతి దుర్గంధం***). దుర్గంధముతో కూడిన ఆహార పానీయాదులను పూతి అంటారు. అంటే కంపు గొట్టే పదార్థాలు. కుళ్ళిన పదార్థాలు, మాంసమత్స్యాదులు, కల్లుసారాలు, అతిశయించి మగ్గిన ఫలాలు - ఇవన్నీ దుర్గంధము తోనే ఉంటాయి. తినడానికి, త్రాగడానికి యోగ్యం కాకుండా ఉంటాయి. కాని, తామసులకు అవే ప్రియంగా ఉంటాయి.

**పర్యుషితం**

వండిన ఆహారమును ఒక రాత్రి నిల్వ ఉంచితే, దానిని పర్యుషితం అంటారు. రాత్రి వండిన ఆహారాన్ని నీళ్ళల్లో ఉంచి, ఉదయాన్నే అట్టి ఆహారాన్ని చల్ది అన్నంగా ఆరగిస్తూ ఉంటారు. ఈ విధమైన ఆహారము పర్యుషితం అనబడుతుంది. ఈ చల్ది అన్నమును భోం చేసిన వారు కప్పను మ్రింగిన పాము ల్లాగా మత్తుగా కనిపిస్తారు. అవకాశము వచ్చినప్పుడల్లా కునుకు తీస్తూ ఉంటారు. తామసులకు ప్రియ మైనది కనుక తమో గుణ ప్రధానమై మత్తును కలిగిస్తుంది. ఇదే కాదు, మత్తును కలిగించే దేదైనా తామసికాహారమే.

**ఉచ్ఛిష్టం**

ఇతరులు తినగా మిగిలిన ఆహారాన్ని ఉచ్ఛిష్టము అంటారు (***ఉచ్ఛిష్టమ్ భుక్త శిష్టమ్***). అలాంటి దానిని వాస్తవానికి తిన కూడదు.

***యజ్ఞ శిష్టా శిన స్సన్తో ముచ్యన్తే సర్వ కిల్బిషైః*** - యజ్ఞ శిష్టము, లేదా యజ్ఞ శేషమైన ఆహారాన్ని ఎవరు భుజిస్తారో, వాళ్ళు సమస్త కల్మషాల నుండి విడి పడతారు అని శ్రీ భగవానువాచ (*3 వ అ - 13 వ శ్లో*).

***యజ్ఞశిష్టామృత భుజో యాన్తి బ్రహ్మ సనాతనమ్*** - యజ్ఞశిష్టంగా, లేదా యజ్ఞ శేషంగా మిగిలిన ఆహారము అమృత తుల్యము. అట్టి అమృతాహారాన్ని భుజించే వారు సనాతన మైన బ్రహ్మపదమును పొందుతారు అని గీతాచార్యుని ప్రబోధము (*4 వ అ - 31 వ శ్లో*).

యజ్ఞాల చేత సంతృప్తి చెందిన దేవతలు భోగ్యములను అనుగ్రహిస్తారు. దేవతలు అనుగ్రహించిన వాటిని తిరిగి కృతజ్ఞతా భావంతో వారికి సమర్పించకుండా ఎవడైతే స్వార్థంతో తానే అనుభవిస్తాడో, అతడు ఎవరో కాదు, దొంగ అని భగవద్గీతే అన్నది (***స్తేనః ఏవ తస్కరః ఏవ, సః దేవాది స్వాపహారీ*** - *3 వ అ - 12 వ శ్లో*). పరమేశ్వరుని అనుగ్రహంగా ప్రాప్తించిన ఆహారాన్ని పరమేశ్వరునికి సమర్పించకుండా భుజించ కూడదు.

పరమేశ్వరుని అనుగ్రహంగా ప్రాప్తించిన ఆహారాన్ని పరమేశ్వరునికి సమర్పిస్తే అది యజ్ఞశేష మవుతుంది. అమృత మవుతుంది. మరి, ఇతరులు భుజించిన ఆహారాన్ని, అనగా ఉచ్ఛిష్టాన్ని పరమేశ్వరునికి ఎలా సమర్పించ గలము? సమర్పించకుండా మన మెలా

భుజించ గలము? కనుక, యజ్ఞ శేషాన్ని భుజించాలే గాని, భుక్త శేషాన్ని, అనగా ఉచ్ఛిష్టాన్ని భుజించ కూడదు. కాని, అట్టి ఉచ్ఛిష్టమైన ఆహారమే తామసు లకు ప్రియంగా ఉంటుంది. కారణం, వారు దైవదూరులు, అశాస్త్ర విహితులు కనుక.

### అమేధ్యం

అమేధ్యము అంటే యజ్ఞార్హము కానిది ( **అమేధ్యమ్ అయజ్ఞార్హమ్** ). పూజార్హము కానిది. నివేదింప తగనిది. పరమేశ్వరునికి సమర్పించకుండా ఆహారాన్ని ఆరగించ కూడదు అని ఇప్పుడే తెలుసు కున్నాం. సమర్పించ డానికి అయోగ్యమైన దానిని కూడా తినకూడదు అనేది ప్రస్తుత విషయం. అంటే పూజార్హాలు, యజ్ఞార్హాలు కాని కలంజాదులను భుజించ కూడదు అని అర్థము. సమర్పించకుండా భుజిస్తే దొంగ లవుతాము *(3 వ అ - 12 వ శ్లో)*. అలాగని పూజకు అనర్హమైన దానిని ఎలా సమర్పించ గలము? సమర్పించ లేము. మరి, నివేదించని దానిని ఎలా ఆరగించ గలము? ఆరగించ లేము. అందుకే అవి నిషేధాలు. మచ్చుకు కలంజాదు లన్నా మనుకోండి. మాంసాన్ని మాధవుడికి అర్పించ గలమా? కనుక మాంస భక్షణం చేయ కూడదు అని భావం (దయ చేసి పాఠకులు కన్నప్పలు కాకండి. వట్టి పాపానికి కళ్ళు పోతాయి). కనుక అమేధ్యాలు, అంటే యజ్ఞార్హాలు కాని ఆహారాన్ని భుజించ కూడదు. కాని, తామసులకు అవే ప్రియమైన ఆహారము ( **ఈదృశం భోజనం తామస ప్రియమ్** ).

## ఆహార సమీక్షణము

అన్నం లేనిదే జీవి లేదు. జీవితం లేదు. మనిషి జీవించడానికి అన్నం అవసరం. బ్రతికినంత కాలం మనిషి అన్నం తింటూనే బ్రతకాలి. బ్రతికున్న మనిషికి అన్నం జీవనంగా ఉపయోగ పడుతుంది. అంతే కాని, అన్నం మనిషిని బ్రతికించ లేదు. అన్నం చావును ఆప లేదు.

అన్నం విషయంలో భారతీయ సంస్కృతి పాశ్చాత్య దేశాల అవగాహనకు విలక్షణంగా శోభిస్తోంది. బ్రతక డానికి ఆహారం అవసరం. అవసరమైన ఆహారం రుచిగా, శుచిగా, ఆరోగ్యకరంగా ఉండాలి. ఇది పాశ్చాత్యుల అవగాహన. జీవితంలో పాశ్చాత్యులు తమ కాలాన్ని ఎక్కువ శాతం అన్నానికే వినియోగిస్తారు. ఆహార సంపాద నకు, వంట వార్పులకు, తినడానికి - ఎక్కువ శాతం వారి కాలం ఇలాగే వినియోగ మవుతుంది. భౌతికంగా అవసరాన్ని తీర్చే ఆహారం మానసికంగా కూడా తృప్తి పరచేదిగా ఉండాలి అనేది వాళ్ళ అవగాహనలో భాగం కావడం చేత రుచులు ప్రాధాన్యతను పొందుతాయి. ఇది స్థూలంగా పాశ్చాత్య జీవన విధానంలో ఆహారానికి ఉన్న స్థానము.

కాకపోతే, కొన్ని ప్రత్యేక సందర్భాలలో ఆహార పానీయాలను తాత్త్విక కోణంలో ఊహించడం కూడా ఉంది. ఈ దృక్పథం మతపర మైంది. విశ్వాసానికి సంబంధించింది. అది కూడా ఎప్పుడో అరుదైన సందర్భాలకే పరిమితంగా ఉంటుంది. కొన్ని మతాలలో దైనందిన కార్యక్రమంలో కూడా సంకల్ప మాత్రంగా ఉన్నా, అది మనం ఇక్కడ విశ్లేషించ దగిన స్థాయికి సంబంధించింది కాదు. విస్మరించ దగిందే. ప్రత్యేక సందర్భాలలో ఆహారాన్ని తాత్త్విక కోణంలో వాళ్ళు దర్శించినా, దినసరి కార్యక్రమంలో సంకల్ప మాత్రంగా విశ్వసించినా, అదంతా అశాస్త్రీయము, హేతు భిన్నం కావడం చేత దానిని ఇక్కడ మనం విశ్లేషించ నవసరం లేదని భావిస్తున్నాను.

భారతీయ సంస్కృతిలో అన్నానికి ప్రశస్త మైన స్థానం ఉంది. అన్నం కేవలం రుచికి, ఆరోగ్యానికి, జీవనానికి మాత్రమే కాదు. చిత్తశుద్ధికి, మోక్షసిద్ధికి కూడా ఉపకరించే పవిత్ర సాధనంగా భారతీయులు





దర్శించారు. అందుచేతనే ఆహారాన్ని అన్నం అని, భోజనం అని పవిత్రంగా పిలుచు కున్నారు. అన్నమును కేవలం ఆకలిని పోగొట్టి ఆరోగ్యాన్ని రాబట్టే పదార్థంగా కాకుండా, అన్నంలో సారభూతమైన దానిని గుర్తించి, ఆ సారభూతమైన దానిని సృష్టి స్థితి లయ కారణము, సత్తా స్ఫూర్తి ప్రదాయకమైన పరమేశ్వర స్వరూపంగా దర్శించడము కూడా జరిగింది. అద్భుతమైన ఈ శాస్త్రీయ తాత్త్విక అవగాహనలో అన్నం బ్రహ్మ స్వరూపంగా దర్శన మిచ్చింది.

***అన్నం బ్రహ్మేతి వ్యజానాత్*** - అన్నమును బ్రహ్మముగా తెలుసుకో అని తైత్తిరీయ శ్రుతిలో భృగువు ప్రబోధము *(3 - 2)*.

***అద్యతే భూతైః ఇతి అన్నమ్*** - భూతముల చేత తినబడేది అన్నము. అంటే, అన్నరూపుడైన బ్రహ్మము జీవులలో ప్రవేశించి జీవుల్ని పోషిస్తూ ఉన్నాడు. ఇది ఒక అర్థము. మరొక అర్థాన్ని కూడా తెలుసుకుందాము.

***అత్తి చ భూతాని ఇతి అన్నమ్*** - భూతములను తినునది కనుక అన్నము. అన్న రూపంలో జీవనమై ప్రాణ రూపుడుగా ఉండి పోషించే బ్రహ్మమే దారి తప్పి, అయోగ్యమైన ఆహారాన్ని హద్దు మీరి భుజించి నపుడు జీవులను భక్షిస్తున్నాడు. ఈ విధంగా అన్న రూపంలో ఉన్న పరమేశ్వరుడు జీవులను రక్షిస్తూ ఉన్నాడు. అలాగే జీవుల్ని భక్షిస్తూ ఉన్నాడు. ఇది అన్నము శబ్దార్థము. ఇలా అన్నమును బ్రహ్మ స్వరూపంగా భావించడం చేత భారతీయ సంస్కృతిలో జీవించే వారికి అన్నము పవిత్ర మైనది.

జీవితం విలువైనది. ప్రశస్త మైనది. పవిత్ర మైనది. అట్టి జీవితము యొక్క మనుగడకు కారణమైన అన్నము కూడా పవిత్ర మైనదే. అలాగే భగవంతుడు పూజనీయుడు. అన్న రూపంలో ఉన్నది సత్తా రూపుడైన పరమేశ్వరుడే కనుక అన్నము కూడా పూజార్హమే. ఇది భారతీయుల అవగాహన. పాశ్చాత్యుల ఊహలకు అందని వాస్తవము.

కనుకనే, భారతీయులు అన్నాన్ని క్రింద పడ నివ్వరు. అసందర్భం కాదని భావించి నా వ్యక్తిగత మైన విషయం ఒకటి చెబుతాను. అది నా బాల్యదశ. భోజన సమయంలో కుటుంబము లోని వాళ్ళందరమూ ఒకే చోట ఒకే పంక్తిలో కలిసి భోం చేసే వాళ్ళం. మాతో పాటు పంక్తిలో మా నాన్నగారు కూడా కూర్చునే వారు. ఆయన గారిది భయంకరమైన క్రమశిక్షణ. ఆయన అంటే ఇంట్లో అందరికీ భయమే.

పద్మాసనంలో పీట మీద కూర్చున్నది మొదలు, ఎడమ చేయి క్రింద పెట్టడం, అన్నం మెతుకులు నేలపై పడటం, తుమ్మి నపుడు సంకల్పం చెప్పి వేళ్ళపై నీళ్ళు చల్లుకోవడం, చివరగా లేచి వెళ్ళి చేతులు శుభ్రం చేసుకొని తుడుచుకోవడం వరకు ఏదీ ఆయన దృష్టిని దాటి పోయేది కాదు. అడుగడుగునా అన్నీ ఆంక్షలే. దారి తప్పితే అక్షింతలే.

అన్నం మెతుకులు పొరపాటున క్రింద పడితే చాలు, వణికి పోయే వాళ్ళం. ఆ విషయంలో నేను చాలా జాగ్రత్తగా ఉండే వాణ్ణి. ఇంకెవరైనా పొరపాటున క్రింద పడేశారా! మా నాన్న గారు ఆదిశేషుడు పడగ విప్పినట్లే చూచేవారు. ఆయన పేరులో కూడా ఆ నామమే ఉండటం కారణ మేమో! క్రింద పడిన మెతుకుల్ని తిరిగి పళ్ళెంలో వేసుకొనే వరకు కళ్ళు ఆర్పేవారు కారు. 'అన్నంతో బ్రతుకు తున్నావు. అన్నం పరబ్రహ్మ స్వరూపం. అన్నాన్ని మట్టిపాలు చేస్తావా!' అని గద్దించే వారు.

బాల్యం కావడం చేత ఆ మాటలకు అర్థ మేమిటో, ఆ మాటల వెనుక పరమార్థ మేమిటో అప్పట్లో తెలిసేది కాదు. భయమో, భక్తో తెలియదు గాని నాకు బాగా జ్ఞాపక ముంది. నే నెప్పుడూ అన్నం క్రింద పడేయ లేదు. మా నాన్నగారి చేత ఆ విషయంలో తిట్టించుకో లేదు.

మన పవిత్ర భారతీయ సంస్కృతిలో సదాచారాలను పిల్లలకి బాల్యం లోనే పెద్దలు వంట పట్టించే వారు. ఆ సదాచారాల వెనుక సర్వాత్మ భావం ఎలా దాగి ఉందో ఆ పిల్లలే పెద్దలైన తరువాత గుర్తించే వారు.

బాల్యంలో నా మనస్సును గట్టిగా పట్టుకున్న సంస్కారము ఈ నాటికీ నాకు దూరం కాలేదు. ఇప్పుడు కూడా నేను భోజనం చేసే టప్పుడు ఆకు దాటి అన్నపు మెతుకు అవనిపై పడదు. ఆశ్రమంలో నాకు వడ్డించే టప్పుడు పొరపాటున మా ఆశ్రమవాసులు ఆకుకు దూరంగా మెతుకులు పడేస్తే, ఇప్పటికీ వాటిని ఎత్తి కళ్ళ కద్దుకొని ఆకులో వేసుకోవడం నన్ను వీడని ఆచారము. అది చూచి వాళ్ళు కూడా జాగ్రత్తగా వడ్డిస్తూ ఉంటారు.

పూర్వపు రోజుల్లో ఈ పద్ధతులు, ఆచారాలు ప్రతి ఇంటి లోను ఉండేవి. ఈ రోజుల్లో ఎక్కడా కనిపించని కారణంగా, ఆకులలో అన్నం వడ్డించినట్లు తెల్లని కాగితాల మీద నల్లని అక్షరాలను వడ్డించ వలసి వస్తోంది.

అన్నమును బ్రహ్మ స్వరూపంగా దర్శించడం చేత ఆహారమును నిందించడాన్ని మన పెద్దలు అంగీకరించరు. పైగా అట్టి నిందను గర్హిస్తారు. ***అన్నం న నిన్ద్యాత్, తద్వ్రతమ్*** - అన్నమును నిందించ కూడదు. అది వ్రతము అన్నది తైత్తిరీయోపనిషత్ *(3 - 7)*.

అన్నం భగవ దనుగ్రహంగా మనకు లభిస్తుంది. అన్న రూపంలో భగవంతుడే ఉన్నాడు. అన్నాన్ని చిన్న చూపు చూస్తే, అలా చూచిన వాడి కనుచూపు పోతుంది అనే వాళ్ళు మన పెద్దలు. మనకు ప్రాతః స్మరణీయులు.

కాని, ఈ రోజుల్లో అన్నాన్ని చిన్న చూపు చూడటమే కాదు, భోజన సమయాలలో కొన్ని కుటుంబాలలో పళ్ళెములే రెక్క లొచ్చి ఎగురుతూ ఉంటాయి. అక్కడికి చేరింది ఈ రోజు మన సంస్కృతి. అన్నం మెతు కైనా పళ్ళెం నుండి క్రింద పడితే సహించని పుణ్యాత్ములకు వారసులమైన మనం పళ్ళెములను అన్నంతో సహా విసిరి కొట్టే స్థాయికి ఎదిగాము. ఎంత దురదృష్టం!

ఈ దురదృష్టాలు, దురాచారాలు ఎందుకని ఆవిష్కృత మౌతున్నాయి? ఏముంది! రుచి లేదని కొందరు. ఆశించింది పళ్ళెం లోకి రాలేదని ఇంకొందరు. ఈ రెండే కారణాలు కనబడు తున్నాయి. వాస్తవానికి ఈ రెండూ మన సంస్కృతిలో మన పూర్వీకులకు తెలియని విషయాలే.

మనది రుచి చూచే సంస్కృతే గాని రుచిని ఆశించే సంస్కృతి కాదు. ఇది మొదట అర్థం కావాలి. ***స్వాద్వన్నం న తు యాచ్యతాం*** - స్వాదు అన్నం అంటే రుచికరమైన భోజనము. రుచికరమైన ఆహారాన్ని ఆశించకు అన్నారు ఆచార్యులు. అంతే కాదు. ఏది ప్రాప్తిస్తే దానిని సంతోషంగా, తృప్తిగా ఆరగించ మన్నారు ***(విధి వశాత్ ప్రాప్తేన సంతుష్యతాం )***.

ఏది మనకు లభిస్తే అదే మనది. అది అలా ప్రాప్తించడం వెనుక ఎంతో నేపథ్యం ఉంది. నియతి ఉంది. నియంత నిర్ణయా లున్నాయి. అందే వన్నీ కర్మఫలాలే. కర్మఫల ప్రదాత పరమేశ్వరుడు. మన కర్మలకు ఫలితాలే మనకు అందుతున్నాయి. రావలసినవే వస్తున్నాయి. లేనివి రమ్మంటే ఎలా వస్తాయి? ఇవన్నీ జీవన సత్యాలు. ఇవి అర్థం కాక పోవడం చేత, మన సంస్కృతికి మనం దూరం కావడము చేత సంతోషించ వలసిన చోట సంతాపానికి గురి అవుతున్నాం. మతి చెడిన వాళ్ళ లాగా ప్రవర్తిస్తున్నాం. మనస్సు లోని చాంచల్యము కారణంగా పళ్ళెములే పక్షులై గాలిలో ఎగురు తున్నాయి.

***అన్నం న పరిచక్షీత*** - అన్నమును పడేయకు. అన్నమును నిరాకరించకు అని వేదమాత ఆదేశం. అన్నమును విసిరి వేయడ మంటే అన్న రూపుడైన పరమేశ్వరుని విసిరి వేయడం కాదా? ఎవరు చేస్తారు ఈ పని? కంసుడు చేస్తాడు. శిశుపాలుడు చేస్తాడు. ఖరుడు చేస్తాడు. శూర్పణఖ చేస్తుంది. వాళ్ళది ఆసురీ సంపద. వారిలో సత్త్వగుణం లేదు. అందుకే వాళ్ళు అలా చేస్తారు. కాని, మనం అలా చెయ్యలేము. చెయ్య కూడదు. అన్నమును దూరం చేసుకో కూడదు. శ్రమించి అన్నాన్ని ప్రోగు చేసుకోవాలి.





***అన్నం బహు కుర్వీత తద్వ్రతమ్*** - అన్నాన్ని ఎక్కువగా పొంది, దానిని వినియోగించడం జీవితంలో వ్రతం కావాలి అన్నది ఉపనిషత్తు. దాని అర్థం ఎక్కువగా అన్నదానం చేయ మని. పరమేశ్వరుడు అందరి వాడు. అందరిలో ఉన్న వాడు. అందరిలో ఉన్న వాడి ముచ్చటను అందరితో కలిసి అవలోకించి, అనుభవించి, ఆనందించి, తరించ మనేదే ఉపనిషత్తు సందేశము లోని కేంద్ర విషయము.

అన్నంతో మనం బ్రతుకు తున్నాం. అన్నంలో సార రూపంగా పరమేశ్వరుడే ఉన్నాడు. అన్నమును అనుగ్రహించేది, తినిన అన్నాన్ని వంట బట్టించేది కూడా పరమేశ్వరుడే. ఈ విషయాలన్నీ పూర్వాధ్యాయా లలో తృప్తిగా చెప్పుకున్నాం. అన్నం విషయంలో అన్ని విధాల పరమేశ్వరుడే దర్శనీయ మవుతున్నాడు. కనుక అన్నము దైవ ప్రసాదము. ఈశ్వర ప్రసాదము.

నైవేద్యము పెడితేనే ప్రసాదము ప్రాప్తిస్తుంది. ధనం లేనిదే నైవేద్యం తయారు కాదు. నైవేద్యానికి ఉపకరించేది కనుక ఆ ధనం కూడా ధర్మ సంపాదనై ఉండాలి అని మన పెద్దలు ఆలోచించే వాళ్ళు. ధర్మ బద్ధంగా జీవించి, ధనమును సంపాదించి, శుచిగా దేహాన్ని, ప్రసన్నంగా మనస్సును ఉంచుకొని వంట తయారు చేసి, ఆరాధనా భావంతో ఆహారాన్ని ప్రసాదంగా స్వీకరించి, ఈ వ్యవహారాన్నంతా ఆత్మోన్నతికి, ఆత్మ సాక్షాత్కారానికి సాధనగా వినియోగించుకొనే వాళ్ళు. అందుచేత, ఆహార విషయంలో నైవేద్యము - ప్రసాదము అనే దివ్యమైన భావాలు భారతీయులకు ఉండేవి. కనుక, యోగ్యమైన, యోగమునకు ఉపయుక్త మైన, ఆరోగ్యకరమైన, ఆనంద దాయకమైన ఆహారాన్నే భారతీయులు గ్రహించే వారు. ఆహారం విషయంలో ఇది భారతీయులకు ఉండే అవగాహన.

**అన్నం శాకాహారము**

శాకాహారమా, మాంసాహారమా? ఏది తీసుకోవాలి? అని కొందరు అదేదో బ్రహ్మ పదార్థ మన్నట్లు అడుగుతూ ఉంటారు. అన్నము, లేదా ఆహారము అంటే మన సంస్కృతిలో శాకాహార మనే అర్థం. ఆహారము అంటేనే శాకాహారము. మాంసాహారము అనే దానిని వేదిక మీదికి తీసుకొని రావడం చేత, శాకాహారమా, మాంసాహారమా? అనే మీమాంస తలెత్తింది.

***ఓషధీభ్యః అన్నమ్, అన్నాత్ పురుషః*** - ఓషధుల నుండి అన్నం పుడుతుంది. అన్నం నుండి పురుషుడు జన్మిస్తాడు. కనుక మొక్కల నుండి, చెట్ల నుండి మనకు లభించేదే అన్నము.

కొందరు జల్ప వితండాలలో తలలు దూర్చి, మాకు శాకాహారము గిట్టదు. మేము కూరగాయలు ముట్టము. ఆకుకూరలు తినము. కాయలు, పండ్లు మాకు రుచించవు. మాకు మాంసమే కావాలి. మేము మాంసాహారులం, మత్స్యాహారులం అంటూ గంతు లేస్తూ ఉంటారు. అలాంటి వారికి తెలియని సత్యం ఒకటుంది. వారు కూడా శాకాహారులే గాని మాంసాహారులు కారు అని.

అదేమిటి? మేము మాంసమే తింటాము. సరే. అలాగే అనుకుందాం. ఈ రోజు మీరు ఏమి తిన్నారు? మాంసమే భుజించాము. ఏమి మాంసం? మేక మాంసం. మేక ఏమి తింటే దానికి మాంసం పట్టింది. మేక ఆకులు తింటుంది. అంతే కదా! మేకలు ఆకులు తింటాయే గాని మాంసం తినవు కదా! అవును.

మేకలు ఆకులు తింటాయి. అవి తినే ఆహారం వల్ల వాటిలో మాంసం తయా రవుతుంది. మేక లోని మాంసానికి మూల మేమిటి? ఆకులే. అదీ విషయం. ఆ ఆకుల్నే ప్రత్యక్షంగా గ్రహించే వాళ్ళు శాకాహారులు. అవే ఆకుల్ని మేక మాంసం రూపంలో పరోక్షంగా గ్రహించే వాళ్ళు మాంసాహారులు. శాకాహారు లైనా, మాంసాహారు లైనా ఇరువురికీ మూల పదార్థ మొక్కటే. ఓషధులు. ఓషధులే అన్నం. అన్నం నుండే జనం.

## ఆహార ప్రియత్వము - గుణభేదము

ఆత్మ సాక్షాత్కారానికి ప్రయత్నించే ముముక్షువులకు ఆత్మవిచారానికి ముందుగా అన్న విచారానికి ఎంత ప్రాధాన్యత ఉందో ఈ ఆహార సమీక్షణములో అర్థం చేసుకున్నాం. భోజన మీమాంస లేకుండా బ్రహ్మ మీమాంస వంట పట్టదని ఇప్పటికే మనకు అర్థమై పోయింది.

**ఆహార శుద్ధౌ సత్త్వశుద్ధిః** - అంతఃకరణ శుద్ధి లేనిదే ఆత్మవిచారము చేయలేము. అంతఃకరణ శుద్ధి ఆహారశుద్ధి ద్వారా ఏర్పడుతూ ఉంది కనుక ఆధ్యాత్మిక చింతనాపరులకు ఆహారము సాధన పరంగా విచారాంశమైంది.

గుణ భేదాన్ని దృష్టిలో ఉంచుకొని ఆహార లక్షణాలను వివరిస్తూ సాత్త్విక, రాజస, తామస ఆహారాలను భగవంతుడు విశదం చేయడం జరిగింది. ఈ మూడు విధాలైన ఆహారాలను స్వీకరించడములో ఎవరికి ఏ విధమైన శ్రద్ధ ఉంటే వారికి ఆ విధమైన ఆహారము ప్రియంగా ఉంటుంది. గుణాలు త్రివిధములు కనుక ఆహారమును కూడా శాస్త్రీయంగా త్రివిధాలుగా క్రమబద్ధీకరించడం జరిగింది.

శ్రద్ధను బట్టే ఆహారం రుచిస్తుంది. సాత్త్విక శ్రద్ధ ఉండే వారికి సాత్త్వికాహారం ప్రియంగా ఉంటుంది. రాజస శ్రద్ధ కల వారికి రాజసాహారము ప్రియంగా ఉంటుంది. తామస శ్రద్ధ కల వారికి తామసాహారం ప్రియంగా ఉంటుంది. గుణ భేదాన్ని అనుసరించే ఆహార ప్రియత్వంలో భేదాలు గోచరిస్తాయి. శ్రద్ధ ఇక్కడ ప్రధాన భూమికను పోషిస్తూ ఉంది. కనుక సాత్త్వికుల విషయం వచ్చినపుడు, **సాత్త్వికప్రియాః** - సాత్త్వికులకు ప్రియమైన ఆహారము అని, రాజసుల విషయంలో, **రాజసస్య ఇష్టాః** - రాజసులకు ఇష్టమైన ఆహారము అని, తామసుల విషయంలో, **తామసప్రియమ్** - తామసులకు ప్రియమైన ఆహార మని భగవంతుడు బోధించడము జరిగింది.

ఈ సందర్భంలో ప్రధానమైన విషయం, చక్కగా అర్థం చేసుకొని బుద్ధిలో స్థిరంగా ఉంచుకో దగిన విషయం ఏమిటంటే, సాత్త్విక శ్రద్ధ కల వారికి సాత్త్వికాహారం, రాజస శ్రద్ధ కల వారికి రాజసాహారం, తామస శ్రద్ధ కల వారికి తామసాహారం ప్రియంగా ఉండొచ్చు. అలాగని రాజసాహారం తినే వాళ్ళు రాజసులని, తామసాహారం తినే వాళ్ళు తామసులని, సాత్త్వికాహారం తినే వాళ్ళు సాత్త్వికులని చెప్పడానికి వీలు లేదు. పారమార్థిక దృష్టిలో దీనిని కొలతబద్ధగా స్వీకరించే వాళ్ళకు శాస్త్రం వంటపట్ట లేదని అర్థం.

సాత్త్వికులు సాత్త్వికాహారం ప్రియంగా తీసుకోవచ్చు. కాని, సాత్త్వికాహారం తీసుకొనే వాళ్ళందరూ సాత్త్వికులు అనడానికి వీలు లేదు. అలాగే రాజస తామస ఆహారాలు కూడా. సాత్త్వికాహారాన్ని గ్రహించే వాళ్ళలో ఎంతో మంది మోసగాళ్ళు ఉన్నారు. హంతకు లున్నారు. నువ్వు గర్హించే పచ్చళ్ళు, ఉల్లిపాయలు తినే వాళ్ళలో సాత్త్విక జీవనం గడిపే వాళ్ళు, నిరంతరం ధ్యానమగ్నులై ఉండే వాళ్ళు ఎందరో ఉన్నారు. కనుక, శ్రద్ధాత్రయ విభాగ యోగాన్ని జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. ఆహార భేదాన్ని, గుణ భేదాన్ని, శ్రద్ధా భేదాన్ని తెలుసుకోవడం ఎందుకో తెలుసా? మనం ఎలా ఉన్నాము అని పరిశీలించుకొని, పరీక్షించుకొని, అవసర మైతే సరిదిద్దు కోవడానికే గాని, ఇతరుల విషయంలో న్యాయ నిర్ణేతలుగా వ్యవహరించడానికి మాత్రం కాదు. అది సాధ్యం కాదు కూడా. కనుక, గుణ భేదాలను, ఆహార భేదాలను సమన్వయిస్తూ ఇతరులను నిర్ణయించడం శాస్త్ర సమ్మతమైన విషయం కాదు. ఇది అర్థం కాని వారే పరుల్ని ఆహార దృష్ట్యా ఖండిస్తూ ఉంటారు.

ఆహారం యొక్క ప్రభావం మనస్సుపై ఉంటుంది. ఆహారం యొక్క సూక్ష్మాంశమే మనస్సు కనుక. సాత్త్వికాహారం సత్త్వ సంపద కల వారికి ప్రియంగా ఉండటమే గాక, తత్త్వ విచారానికి సహకరిస్తుంది కూడా.





కనుక, సాత్త్వికాహారాన్ని స్వీకరిస్తూ సత్త్వ ప్రధానంగా మనం జీవించాలి. ఆరాధనా భావంతో అన్నాన్ని స్వీకరించాలి. పరులతో పంచుకోవాలి. సాధకులము కనుక మనము తీసుకునే ఆహారము మనస్సు మీద దుష్ప్రభావాన్ని చూపకుండా జాగ్రత్త పడాలి.

### ఆఖ్యాయిక

ఇదొక దంత కథ. **ఆహార శుద్ధౌ సత్త్వశుద్ధిః** - అనే అంశము వచ్చినపుడు వేదికల మీద నుండి ప్రబోధకులు ఈ కథను వినిపిస్తూ ఉంటారు. వాస్తవమా, కాదా? జరిగిందేనా, కాదా? అనే మీమాంసలో తల దూర్చకుండా విషయాన్ని స్వీకరిస్తే, చాలా ఉపయుక్తంగా ఉంటుంది.

ఓఘవతీ నదీ తీరాన బాణశయ్యపై పవ్వళించి ఉన్నాడు భీష్మాచార్యుడు. దేహం లోని రక్త మంతా కారి పోయింది. ప్రాణం అల్లాడుతూ ఉంది. పంజరం నుండి ఏ క్షణ మైనా పక్షి ఎగిరి పోవచ్చు. అట్టి విషమ పరిస్థితిలో ఎముకల గూడులో దీపంలా వెలుగుతున్న భీష్మాచార్యుని హృదయం జ్ఞానగంగా ప్రవాహంతో పరవళ్ళు త్రొక్కుతూ ఉంటే, ధర్మ ప్రవచనాలు ప్రవాహ రూపంలో కదిలి ధర్మరాజు చెవులను, చిత్తాన్ని మంగళ స్నానం చేయించాయి. ధర్మమేఘమై దివ్య బోధలను వర్షించిన భీష్మాచార్యుడు, ప్రాణ త్యాగానికి, పరలోక గమనానికి మనస్సులో సిద్ధ పడుతున్నాడు.

ఇంతలో ద్రౌపది ముందుకు వచ్చింది. మహాత్మా! భీష్మ పితామహా! మీ ధర్మ ప్రవచనాలతో మహి పులకరించింది. మానవాళి కృతజ్ఞతా భావంతో తల వంచుతూ ఉంది. మీకు ప్రణామం. పునః పునః నా ప్రణామం.

మహాత్మా! ప్రస్తుతం ఇక్కడ ధర్మబోధ చేసిన మీరేనా ఆనాడు హస్తినలో రాజకొలువులో ఆసీనులై ఉండింది? నిండుసభలో స్త్రీని వలువలు ఊడదీసి పరాభవిస్తున్న వేళ ఈ ధర్మబోధలు ఎటు పోయాయి? బాణాలపై పడుకొని ప్రాణాలు అల్లాడుతున్న ఈ స్థితిలో ధర్మ ప్రసంగాలు వినిపించిన మీరు, ఆనాడు సర్వ శక్తిమంతులై ఉండి, సముచి తాసనంపై కూర్చుని ఉండి కూడా నోరు మెదపలేక పోయారు. ఈ ధర్మబోధలు ఆనాడు ఏమయ్యాయి? అని ప్రశ్నించింది.

పాండవులతో సహా సర్వులూ దిగ్భ్రాంతి చెందారు. అమ్మా, ద్రౌపదీ! మంచి ప్రశ్న వేశావు. ఇలాంటి ప్రశ్నను ధర్మరూపిణి వైన నువ్వు తప్ప మరొకరు వేయ లేరు. నా సమాధానం కూడా ఆలకించు తల్లీ! అంటూ దీర్ఘ శ్వాస తీసుకొని, అతి కష్టం మీద ప్రాణాన్ని నిలబెట్టుకొంటూ భాషించాడు భీష్మాచార్యుడు.

తల్లీ! నువ్వు చెప్పింది అక్షరాల నిజం. ఇప్పుడు ఇక్కడ ఉన్న నేనే అప్పుడు అక్కడ ఉండినాను. కాని, ఇప్పుడు ప్రాణోత్క్రమణ స్థితిలో ఉన్నా, నా బుద్ధి దీపంలా ప్రకాశిస్తూ ఉంది. ఇదే బుద్ధి ఆనాడు, అక్కడ పాగసూరి మసకబారి పోయి ఉండింది.

అమ్మా! దుష్టుడు, దుర్మార్గుడు అయిన దుర్యోధనుడు పెట్టిన అన్నం తిన్నందుకు నా బుద్ధి పనిచేయ లేదు. అశుద్ధమై పోయింది. కలుషితమై పోయింది. అందుకే అక్కడ మాట్లాడలేక పోయాను. రణరంగంలో పుణ్యాత్ముడు, ధర్మాత్ముడు అయిన నా బిడ్డ అర్జునుడు కురిపించిన బాణాలు నా దేహాన్ని చిల్లుల కుండగా మార్చేశాయి. నా లోని పాప రుధిర మంతా కారి పోయేలా చేశాయి. ఇప్పుడు కేవలం నా ప్రాణదీప మొక్కటే ఆరేందుకు సిద్ధంగా ఉంది. పాపపు కూడు వల్ల ఏర్పడిన రక్తం కారి పోగా, మిగిలి ఉన్న శుద్ధ బుద్ధితో ప్రవచించ గలిగాను' అని పలికి గాంగేయుడు కన్ను మూశాడు. ఆహారం మనస్సు పై ఎలాంటి ప్రభావాన్ని చూపుతుందో గ్రహించ డానికి ఈ కథ ఒక ఉదాహరణ.

త్రివిధ ఆహారాలను ప్రవచించిన పరమేశ్వరుడు, ప్రస్తుతం త్రివిధ యజ్ఞాలను గూర్చి చెబుతున్నాడు.

**అఫలాకాంక్షిభి ర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే ।**
**యష్టవ్య మేవేతి మనః సమాధాయ స సాత్త్వికః ॥** 11

***అఫలాకాంక్షిభిః-యజ్ఞః-విధిదృష్టః-యః-ఇజ్యతే***
***యష్టవ్యం-ఏవ-ఇతి-మనః-సమాధాయ-సః-సాత్త్వికః***

| | | | |
|---|---|---|---|
| విధిదృష్టః | = శాస్త్రసమ్మత మైనది | యః | = ఏ |
| యష్టవ్యం ఏవ ఇతి | = యజ్ఞము చేయుటయే విధిగా | యజ్ఞః | = యజ్ఞము |
| మనః | = మనస్సును | ఇజ్యతే | = చేయబడుతుందో |
| సమాధాయ | = నిశ్చయించి | సః | = అది |
| అఫలాకాంక్షిభిః | = ఫలాపేక్ష లేని వారి చేత | సాత్త్వికః | = సాత్త్విక మైనది |

**అర్జునా! ఫలాపేక్ష లేనిది, శాస్త్రోక్త మైనది, చేసి తీరాలి అనే కర్తవ్యాన్ని మనస్సుతో నిశ్చయించుకొని ఆచరించేది సాత్త్విక యజ్ఞము.**

### వ్యాఖ్య

గుణభేదాన్ని బట్టి ఆహార ప్రియత్వము ఉంటుంది అని చెబుతూ త్రివిధ ఆహారాన్ని తెలిపిన భగవంతుడు, భావనలను బట్టే భక్తి ఉంటుందని, ఉద్దేశ్యాలను అనుసరించే ఆరాధనలు ఉంటాయని తెలియ చెప్పడానికి వరుసగా త్రివిధ యజ్ఞాలను వివరిస్తున్నాడు ***( యజ్ఞం త్రివిధః ఉచ్యతే ).***

యజ్ఞాలు మూడు విధాలు. సాత్త్విక యజ్ఞము, రాజస యజ్ఞము, తామస యజ్ఞము. ఈ మూడు యజ్ఞాలను వరుసగా మూడు శ్లోకాలలో చెబుతున్నాడు. ప్రస్తుతం మొదటి శ్లోకంలో సాత్త్విక యజ్ఞాన్ని గురించి చెబుతున్నాడు.

భగవంతుడు యజ్ఞరూపుడు. కనుక, భగవ ద్భావన కలిగి ఈశ్వరార్పణ బుద్ధితో చేసే ఏ కర్మ అయినా యజ్ఞమే అవుతుంది. యజ్ఞము అనగానే వేదోక్త మైన అగ్నిహోత్రాది యజ్ఞములే అని భావించ డానికి అవకాశం లేదు. నిత్య నైమిత్తికాది కార్యాలలో ఈశ్వర భావనతో ఆచరించే వన్నీ ఆరాధనా రూపాలై యజ్ఞాలు అనబడతాయి. ఈశ్వరుడు ధర్మ రూపంలో ఉన్నాడు కనుక, దైవ స్పృహతో ధర్మాచరణం చేయడం కూడా యజ్ఞమే. ముందు త్రివిధ యజ్ఞాలను గూర్చి తెలుసుకున్న తరువాత, చివరగా యజ్ఞ విశ్లేషణములో ఈ విషయాలన్నీ చర్చించు కుందాము. ప్రస్తుతం సాత్త్విక యజ్ఞాన్ని గూర్చి తెలుసుకుందాము.

గుణభేదాన్ని బట్టి ఆహార విషయం లాగే, యజ్ఞము కూడా మూడు విధాలుగా ఉంటుంది. సాత్త్విక శ్రద్ధతో ఆచరించేది సాత్త్విక యజ్ఞము. అంటే, సాత్త్విక యజ్ఞము సాత్త్విక శ్రద్ధ కల వారికి ప్రియ మైనది అని అర్థం. సాత్త్విక యజ్ఞములో ప్రధానంగా నాలుగు విషయా లుంటాయి. నాలుగు చక్రాలతో రథం కదిలినట్లు, నాలుగు అంగాలతో సాత్త్విక యజ్ఞ రథం కదుల్తుంది. అవి (1) ఫలాసక్తి లేక పోవడము (2) శాస్త్ర దృక్పథము (3)కర్తవ్యతా దృష్టి (4) సమాధాన చిత్తం.

#### ఫలము నందు అనాసక్తి

సాత్త్విక యజ్ఞము ఫలాకాంక్ష లేనిదై ఉంటుంది. యజ్ఞము కర్మ సంబంధ మైనది. కనుక, ఫల సంబంధమై





ఉంటుంది. కర్మ ఉన్న చోట కర్మఫలం ఉంటుంది. కనుక, కర్మాచరణంలో ఉండే వారు రెండు విధాలుగా ఉంటారు. కర్మఫలము నందు ఆసక్తి కల వారు ***( ఫలా కాంక్షిభిః ).*** కర్మఫలము నందు ఆసక్తి లేని వారు ***(అఫలా కాంక్షిభిః అఫలార్థిభిః).*** రెండవ కోవకు సంబంధించిన వారు సాత్త్విక యజ్ఞమును నిర్వహిస్తున్నారు.

కర్మఫలము ఏదైనా అనిత్యమే నని వారికి తెలుసు. ధర్మార్థ కామాల వల్ల ప్రాప్తించే ఇహలోక సుఖాలు, పరలోక భోగాలు అనిత్యాలని తెలిసి, వాటి యందు త్యాగ బుద్ధిని కలవారై నందున, వారికి కర్మ ఫలాసక్తి ఉండదు. ఇతరులకు ఉపయోగపడే కర్మల నాచరిస్తూ, సమాజ అభ్యుదయానికి తమ వంతు కృషి చేస్తూ, సర్వులను తృప్తి పరుస్తూ , అట్టి యజ్ఞకర్మ చేత దృష్ట ఫలమైన ప్రశాంతతను అనుభవించే వారు చేసే కర్మ లన్నీ సాత్త్విక యజ్ఞాలే అవుతాయి. స్వార్థమే తెలియని యజ్ఞకర్మలు అంతఃకరణ శుద్ధిని కలిగిస్తాయి.

#### శాస్త్ర దృష్టి

స్వార్థం లేదు అని విధి విధానాలను విస్మరించ కూడదు. సాత్త్విక యజ్ఞాలు శాస్త్రోక్తం గానే ఉండాలి. మనం ఆచరించే కర్మ శాస్త్ర విహితమా, శాస్త్ర రహితమా అని చూసుకుంటూ చేయాలి. దృష్టిని శాస్త్రము నందు ఉంచి, తదనుగుణంగా కర్మలను ఆచరించాలి. అప్పుడే అది సాత్త్విక యజ్ఞము అవుతుంది. శాస్త్రోక్త విధి విధానాలను అనుసరిస్తూ ఆచరించేదే సాత్త్విక యజ్ఞము. దానినే 'విధి దృష్టం' అనడం జరిగింది. 'విధి దృష్టం' అంటే శాస్త్రం లోని విధిని వీక్షించడము, దాని ప్రకారము యజ్ఞాచరణమును నిర్వహించడము అని అర్థము ***(విధి దృష్టః శాస్త్ర చోదనా దృష్టః ).***

#### కర్తవ్యతా దృష్టి

ఇది నేను చేయదగిన కర్మ, చేయ వలసిన కర్మ, కనుకనే చేస్తున్నాను అనే భావనచే ఆచరించేది ఇక్కడ కర్తవ్యతా నిష్ఠ. అదే కర్తవ్యతా దృష్టి. దీనిని కర్మయోగంలో మనం అర్థం చేసుకున్నాం.

కర్మ చేసే వారు ప్రయోజనాన్ని ఆశించకుండా చెయ్యరు. ఏ కర్మ చేయాలన్నా, ఇది చేస్తే నాకు ఏమొస్తుంది? అది వింటే నాకు ఏమొస్తుంది? దర్శనం వల్ల నాకు ఏమి ప్రయోజనం? ప్రవచనం నాకు ఏ ఫలాన్ని ఇస్తుంది? ఇదంతా ఫలాసక్తి గొడవ. ఈ విధమైన ఫలదృష్టిని విడిచి, ఇది నేను చేయవలసిన కర్మ, నా కొరకు నిరీక్షిస్తున్న కర్మ, నేను అవశ్యం ఆచరించ దగిన కర్మ అనే దృష్టితో ఫలాపేక్ష లేకుండా కర్మను ఆచరించడం ఇక్కడ కర్తవ్యతా దృష్టి.

***నియతం కురు కర్మత్వం కర్మజ్యాయో హ్య కర్మణః*** - అర్జునా! తప్పకుండా చేయ వలసిన కర్మను ***(నియతం కర్మ ).*** తప్పక ఆచరించాలి. కర్మ శూన్యత కంటే, కర్మాచరణమే శ్రేష్ఠము అని కర్మయోగంలో పరమేశ్వరుడు తెలియ చేశాడు *(3 వ అ - 8 వ శ్లో).* అదే ప్రస్తుతం మనం చెప్పుకుంటున్న కర్తవ్యతా నిష్ఠ. ***యష్టవ్యం ఏవ*** - ఈ యజ్ఞ కార్యము చేయ వలసిందే, చేసి తీరవలసిందే అనే దృఢ సంకల్పమును కలిగి ఉండాలి ***( యష్టవ్యం ఏవేతి యజ్ఞ స్వరూప నిర్వర్తన మేవ కార్యం ఇతి ).*** ***యష్టవ్యం*** అనేది కర్మాచరణములో సదా మన బుద్ధిలో స్థిరంగా నిలవాలి.

మహాభారతంలో పాండవులు అనుభవించే కష్టాలను కళ్ళారా చూసి కన్నీటి పర్యంతమైన ద్రుపద నందిని ఒకనాడు ధర్మరాజును ప్రశ్నించింది. ధర్మం - ధర్మం అంటూ మీరు ధర్మాన్నే నమ్ముకున్నారు. ధర్మ కార్యాలే చేస్తున్నారు. ధర్మాచరణంలో ఉన్నందుకు ఫలం కష్టా లేనా? కన్నీళ్ళేనా? అని అడుగుతుంది. ధర్మరాజు ఏమి సమాధానం చెప్పాడో వినండి. అక్కడ మీకు ***యష్టవ్యం*** కనిపిస్తుంది. అఫలాకాంక్ష కూడా గోచరిస్తుంది ***(న ఫలాకాంక్షీ ).***

**నాహం ధర్మ** ఫలాకాంక్షీ **రాజపుత్రీ చరామ్యుత**
**దదామి దేయమిత్యేవ యజే** యష్టవ్య **మిత్యపి**

రాజపుత్రీ! ఫలాకాంక్షతో నేను ఏదీ చెయ్యలేదు. ఫలాసక్తి లేకుండానే నిర్వర్తించాను (***అఫలాకాంక్షీ***). చెయ్యాలి కనుక చేస్తున్నాను (***యష్టవ్యం***). ఇవ్వాలి కనుక ఇస్తున్నాను (***దేయం***). కర్తవ్యతా నిష్ఠే కాని, ఫల దృష్టి నాకు లేదు. కోరనిది ఏదైనా ఎలా వస్తుంది? అనే భావంతో భాషించాడు ధర్మనందనుడు. ఇక్కడ ద్రౌపదిని 'రాజపుత్రీ' అని సంబోధించడం ఆలోచించ దగిన విషయం. ఫలాసక్తితో చేసే కర్మలు రాజస కర్మలే గాని సాత్త్విక కర్మలు కావు అనే భావ స్ఫురహ 'రాజపుత్రీ' అనే సంబోధనలో ఉంది. రాజసకర్మ ఎలా ఫలాసక్తితో ఉంటుందో తరువాత శ్లోకంలో చూడ బోతాము.

**సమాధాన చిత్తం**

సమాధాన చిత్తము అంటే నిశ్చయమైన బుద్ధి. బుద్ధి లోని నిశ్చయము చేత చిత్తములో ప్రశాంతమైన స్థితి నెలకొంటుంది. అదే చిత్త సమాధానము. ఇంతకీ బుద్ధి లోని నిశ్చయ మేమిటి?

ఇది నేను చేయదగిన కర్మ కనుక చేస్తున్నాను (***యష్టవ్యమ్***). ఆ చేసే దేదో దానిని శాస్త్రోక్తంగా చేస్తున్నాను (***విధి దృష్టః***). యజ్ఞకర్మను ఆచరించడములో నాకు ఫలాసక్తి లేదు (***అఫలాకాంక్షిభిః***). కనుక, ఈ విధమైన యజ్ఞకర్మ ద్వారా 'నేను సాధించ వలసిన పురుషార్థము ఏదీ లేదు' అనేదే నిశ్చయ బుద్ధి (***మనః సమాధాయ, న అనేన పురుషార్థః మమ కర్తవ్యః ఇత్యేవం నిశ్చిత్య సః సాత్త్వికః యజ్ఞః ఉచ్యతే***).

అన్య పురుషార్థాలు లేవు అంటే ధర్మ, అర్థ, కామ పురుషార్థ ప్రయోజనాలు తనకు అవసరం లేదని అర్థము. మోక్ష మొక్కటే తాను ఆశించేది అనేది సుస్పష్టము.

కనుక, యజ్ఞకర్మకు రెండు ప్రయోజనాలు ఉంటాయి. ఒకటి ఫల భోగము. ఈ లోకానికి సంబంధించి గాని, పర లోకానికి సంబంధించి గాని ప్రాప్తించే ఫలాల యందు ఆసక్తి కలిగి యుండటము. సాత్త్విక యజ్ఞమును ఆచరించే వారికి ఇది వర్తించదు. వారు కర్మఫలాసక్తి లేని వారు కనుక ఈ విధమైన ప్రయోజనము వారికి సంబంధించింది కాదు.

రెండవది అంతఃకరణ శుద్ధి. యజ్ఞకర్మ ఏదైనా అలౌకిక కర్మే కనుక, ఫలాసక్తి లేనపుడు అది అంతఃకరణ శుద్ధ్యర్థమై ఉంటుంది. అలా శుద్ధి పడిన అంతఃకరణము ప్రశాంతతను అనుభవిస్తుంది. అదే దృష్ట ఫలమైన చిత్త సమాధానము.

సాత్త్విక యజ్ఞములో ఇంతవరకు మనం తెలుసుకున్న నాలుగు విషయాలను పరిశీలిస్తే, ప్రథమ షట్కంలో, ముఖ్యంగా మూడవ అధ్యాయం నుండి ఐదవ అధ్యాయం వరకు కర్మయోగాన్ని గూర్చి మనం చెప్పుకున్న విస్తారమైన విషయాన్నంతా ఈ నాలుగు విషయాలు సారభూతంగా అందించాయి.

*ఇక రాజస యజ్ఞాన్ని వివరిస్తున్నాడు.*

**అభిసన్ధాయ తు ఫలం దమ్భార్థ మపి చైవ యత్ ।**
**ఇజ్యతే భరతశ్రేష్ఠ తం యజ్ఞం విద్ధి రాజసమ్ ॥** 12

***అభిసంధాయ-తు-ఫలం-దంభార్థం-అపి-చ-ఏవ-యత్***
***ఇజ్యతే-భరతశ్రేష్ఠ-తం-యజ్ఞం-విద్ధి-రాజసం***





| | | | | | |
|---|---|---|---|---|---|
| భరతశ్రేష్ఠ | = | అర్జునా! | ఇజ్యతే | = | చేయబడుతుందో |
| యత్ | = | ఏది | తం | = | ఆ |
| ఫలం | = | ఫలమును | యజ్ఞం | = | యజ్ఞము |
| అభిసంధాయ తు | = | వాంఛించి గాని | రాజసం | = | రాజస యజ్ఞముగా |
| దంభార్థం అపి చ ఏవ | = | దంభము కొరకు గాని | విద్ధి | = | తెలుసుకో! |

**అర్జునా! ఫలాన్ని ఆశించి చేసేది, ఆడంబరానికి ఆచరించేది రాజస యజ్ఞము.**

**వ్యాఖ్య**

ఫలాకాంక్షతో (***అభిసంధాయ ఉద్దిశ్య***) చేసే యజ్ఞము, దంభమును ప్రదర్శించుకోవ డానికి (***దంభార్థమ్***) చేసే యజ్ఞము రాజస యజ్ఞము. ఫలాకాంక్ష లేకుండా నిర్వహించేది సాత్త్విక యజ్ఞమైతే, దానికి భిన్నంగా ఫలాసక్తితో నిర్వహించేది రాజస యజ్ఞము. శాస్త్ర విధి ననుసరించి సాత్త్విక యజ్ఞాలు సాగుతాయి. అంటే సాత్త్విక యజ్ఞములో శాస్త్ర దృష్టితో యజ్ఞ కార్యాలు నిర్వహించడం జరుగుతుందే గాని వ్యక్తిగతంగా, స్వార్థ పూరితంగా నిర్వహించడము జరగదు.

రాజస యజ్ఞాలు స్వార్థ పూరితంగా ఉంటాయి. వాటిని నిర్వహించే వారికి ఫలాసక్తే ప్రధానంగా ఉంటుంది. ఇహలోక సుఖాలు, స్వర్గలోక భోగాల మీదే దృష్టి ఉంటుంది. వారిలో మోక్షాపేక్ష లేనందున ముముక్షుత్వం ఉండదు. అక్కడ అర్థ కామాలే ప్రధాన పాత్రను పోషిస్తాయి కనుక చిత్తశుద్ధికి అవకాశము లేదు.

రాజస శ్రద్ధ కలిగి, రాజస ప్రవృత్తితో యజ్ఞ కార్యాలను నిర్వహించే వారి దృష్టి కేవలం ఫలితము పైనే ఉంటుంది. వారి దృష్టి ఫలితంపై ఉండటమే గాక, అందరి దృష్టిని ఆకర్షించాలనే దుగ్ధ కూడా వారిలో ఉంటుంది. ఇదే దంభము లేదా డంబాచారము. డాంబికుని స్వభావము.

ఈశ్వర ప్రీత్యర్థం సాత్త్వికులు యజ్ఞాలు నిర్వహిస్తారు. అంతఃకరణ శుద్ధిని విడిచి మరొక ఫలితాన్ని ఆశించరు.

తమ స్వార్థం కొరకు ఫలాపేక్షతో రాజసులు యజ్ఞ కార్యాలను ఆచరిస్తారు. పది మంది తమను గుర్తించాలని, గౌరవించాలని అభిలషిస్తారు. లోకం దృష్టిలో, లోకుల దృష్టిలో తాము గొప్పగా ఉండాలనే తాపత్రయమే గాని, భగవంతుని దృష్టిలో పడాలనే శుభేచ్ఛ వారిలో జనించదు. అందుచేత, ఆడంబరాలతో కార్యాలు నిర్వహిస్తారు. అనిత్య ఫలాలను పొందుతారు. బ్రతుకులను అనర్థంగా మార్చుకుంటారు. ఎందు కంటే, ఈ విధమైన స్వార్థపూరిత యజ్ఞాల కారణంగా, అహంకారయుత కార్యాల వలన పరమాత్మను ఎవ్వరూ పొంద లేరు. పరమేశ్వరుని పొందడానికి ఇవేవీ సాధనలు కాలేవు (***భగవ త్ప్రాప్తి మార్గ అబాహ్యత్వాత్***). ఈ సందర్భములో భగవంతుడు అర్జునుని ***భరతశ్రేష్ఠా!*** అని సంబోధించడము గమనించ దగింది. అర్జునుడు భరత కులశ్రేష్ఠుడు కావడం చేత ప్రకాశవంతమైన సాత్త్విక యజ్ఞములు ఆచరించే శక్తి సామర్థ్యాలు కల వాడే గాని, రాజస యజ్ఞా లకు సంబంధించిన వాడు కాడని యజ్ఞ యోగ్యతా సూచకంగా 'భరతశ్రేష్ఠా!' అని సంబోధించడం జరిగింది.

దక్షుడు యజ్ఞమును నిర్వహించాడు. అర్జునుడు యుద్ధం చేశాడు. పరమేశ్వరుని విస్మరించి, అహంకారంతో విజృంభించి దక్షుడు యజ్ఞమును నిర్వహించిన యజ్ఞభూమి రణభూమిగా మారింది. అర్జునుడు సాగించిన యుద్ధము యజ్ఞ మైంది. పరమేశ్వరుని ధిక్కరించి యజ్ఞమును నిర్వహించి నందుకు దక్ష యజ్ఞము

ధ్వంస మైంది. పరమేశ్వరుని ముందు పెట్టుకొని అర్జునుడు యుద్ధం చేస్తే అది యజ్ఞ మైంది. గీతా బోధతో జ్ఞానయజ్ఞ మైంది. అలాగే త్రిపురా సంహారంలో అసుర పురాలు మూడూ ఎలా దగ్ధమై పోయాయో కూడా మనకు తెలియనిది కాదు. అహంకారులకు ఎక్కడైనా, ఎప్పుడైనా పతనమే. భక్తులకు ఎప్పుడైనా, ఎక్కడైనా శ్రేయస్సే.

*కక్ష కట్టినందుకు దక్ష యజ్ఞము ధ్వంస మాయె*
*అసుర పురములు మూడును భస్మ మాయె*
*నిన్ను పూజించు వారికే పరమ పదము*
*నీ అడుగుల కడ పడి ఉందు నీలకంఠా!*

అని నీలకంఠ శతకంలో ఒక విబూది పండు.

*ఇక తామస యజ్ఞాన్ని వివరిస్తున్నాడు.*

**విధిహీన మసృష్టాన్నం మన్త్రహీన మదక్షిణమ్ ।**
**శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే ॥** 13

***విధిహీనం-అసృష్టాన్నం-మంత్రహీనం-అదక్షిణం***
***శ్రద్ధావిరహితం-యజ్ఞం-తామసం-పరిచక్షతే***

| | | | | | |
|---|---|---|---|---|---|
| విధిహీనం | = | విధిరహిత మైనది | శ్రద్ధావిరహితం | = | శ్రద్ధ లేనిది |
| అసృష్టాన్నం | = | అన్నదానము లేనిది | యజ్ఞం | = | యజ్ఞము |
| మంత్రహీనం | = | మంత్రయుతము కానిది | తామసం | = | తామస మని |
| అదక్షిణం | = | దక్షిణ లేనిది | పరిచక్షతే | = | చెబుతారు |

**పార్థా! విధి విధానము లేనిది, అన్నదానము లేనిది, మంత్రయుతము కానిది, దక్షిణ లేనిది, శ్రద్ధ లేనిది తామస యజ్ఞము.**

**వ్యాఖ్య**

తమోగుణ ప్రధానులు తామస యజ్ఞాలను నిర్వహిస్తారు. ప్రస్తుత శ్లోకంలో తామస యజ్ఞము ఐదు విషయాలతో చెప్ప బడింది. వాస్తవానికి ఇవన్నీ యజ్ఞానికి విశేషణాలుగా ఉన్నాయి. విధిహీనం, అసృష్టాన్నం, మంత్రహీనం, అదక్షిణం, శ్రద్ధా విరహితం - ఇవే తామస యజ్ఞం లోని ఐదు ప్రధాన విషయాలు.

విధిహీన యజ్ఞము, అసృష్టాన్న యజ్ఞము ('అమృష్టాన్నం' అనే పాఠాంతరము ఉంది), మన్త్రహీన యజ్ఞము, అదక్షిణ యజ్ఞము, శ్రద్ధా విరహిత యజ్ఞము - ఈ ఐదు విశేషణాలతో కూడిన యజ్ఞము తామస యజ్ఞము.

**విధిహీనం**

విధిహీనము అంటే శాస్త్ర విధికి భిన్న మైనది అని అర్థము. శాస్త్రంలో ఏ విధి విధానాలున్నవో వాటికి విపరీత మైనది విధిహీనము (***యథా చోదిత విపరీతమ్***). శాస్త్ర విధిని ఉల్లంఘించి, అతిక్రమించి ఆచరింప బడేది విధిహీనము. యజ్ఞమును నిర్వహించ వలసిన పద్ధతి శాస్త్రంలో చెప్ప బడింది. శాస్త్రోక్త మైన యజ్ఞమును శాస్త్రవిధిని అనుసరించి ఆచరించి నపుడే, దానిని ఆచరించినట్లు అవుతుంది. విధిని విస్మరించి ఆచ రించేది యజ్ఞ మెలా అవుతుంది? విధిని అనుసరించడము లేదు అంటే శ్రద్ధ సరిగా లేదని అర్థము. శ్రద్ధ లేని యజ్ఞాలు శుద్ధి లేనివి. సిద్ధిని ప్రసాదించ లేనివి. అట్టివి తామస యజ్ఞాలు అనబడుతాయి.





**అసృష్టాన్నం**

సృష్టాన్నం అంటే అన్నదానము. అసృష్టాన్నం అంటే అన్నదానము లేనిది. ఏ యజ్ఞములో అయితే అన్నదానము జరగదో అది అసృష్టాన్న యజ్ఞము (***న సృష్టం న దత్తం అన్నం యస్మిన్ యజ్ఞే సః అసృష్టాన్నః తమ్ అసృష్టాన్నం***). అన్నదానము శ్రేష్ఠమైన దానంగా చెప్ప బడింది. ముఖ్యంగా యజ్ఞ కార్యాలలో అన్నదానము చేయడం పరమ పవిత్రమైన కార్యమని శాస్త్రాలు చెబుతాయి. అన్ని దానాలలో జ్ఞాన దానము తరువాత అన్నదానానికే విశిష్టమైన స్థానం ఇవ్వ బడింది. అట్టి పవిత్రమైన అన్నదానము లేకుండా సాగే యజ్ఞము తామస యజ్ఞము.

**మన్త్రహీనం**

మంత్రహీనము అంటే అసలే మంత్రము లేనిది అని అర్థం కాదు. స్వర దోషాలతో, ఉచ్చారణ దోషాలతో కూడిన మంత్రాలతో ఆచరింపబడే యజ్ఞము మంత్రహీనము (***మన్త్రతః స్వరతః వర్ణతః వియుక్తం మన్త్ర హీనమ్***). యజ్ఞానికి మంత్రము ప్రాణము లాంటిది. మననము చేసే వారిని రక్షించేది మంత్రము (***మననాత్ త్రాయతే ఇతి మంత్రః***).

మంత్రము రక్షిస్తుంది అంటే, మంత్రము భగవంతుని స్వరూపము అని అర్థము. ఎలా? రక్షించే శక్తిమంతుడు భగవంతు డొక్కడే. కనుక, మంత్రము రక్షిస్తుంది అంటే మంత్రము భగవంతుని స్వరూపము.

ధర్మరూపంలో భగవంతుడు ఎలా ఉన్నాడో, మంత్రరూపంలో కూడా అలాగే ఉన్నాడు. కనుక, భగవంతుడు మంత్రరూపుడు. మంత్రము భగవ త్స్వరూపము. వేదము, వేద నారాయణుడు ఒక్కటే. వేద మంత్రము కూడా వేద పురుషుని కన్నా అన్యంగా లేదు. వేద మంత్రాలలో వేదమయు డైన పరమేశ్వరుడే ఉన్నాడు. కనుకనే భగవంతునికి 'మంత్రః' అని కూడా పేరు. **ఋగ్యజు స్సామ లక్షణః మంత్రః** - ఋగ్యజు స్సామ ముల రూపములో ఉండే వాడు కనుక భగవంతుడు 'మంత్ర' నామధేయుడు. అంతే కాదు. ఈ మంత్రాల చేత అర్థ మయ్యే వాడు కావడం చేత కూడా పరమేశ్వరుడు 'మంత్రః' అనే పేరుతో కీర్తింప బడ్డాడు (***మన్త్ర బోధ్యత్వా ద్వా మన్త్రః***).

యజ్ఞము మంత్రహీనంగా ఉంది అంటే అనీశ్వరంగా ఉంది అని అర్థము. మంత్రానికి, మంత్ర రూపుడైన మహేశ్వరునికి నోచుకోని యజ్ఞము తామస యజ్ఞము.

**అదక్షిణం**

దక్షిణలు ఏ యజ్ఞములో సమర్పించడం జరగదో అది అదక్షిణ యజ్ఞము. శాస్త్రము చెప్పిన విధంగా దక్షిణలు సమర్పింప బడని యజ్ఞము అదక్షిణ యజ్ఞము (***అదక్షిణం ఉక్త దక్షిణా రహితం***).

దక్షిణలు ఇవ్వడము అంటే ద్రవ్యాదులు సమర్పించడం అని అర్థము. సమర్పణము అనేది త్యాగానికి సూచకము. త్యాగం లేదు అంటే లోభము ఉందని అర్థము. లోభముతో కూడిన యజ్ఞము ఎప్పుడూ లాభించదు. లోభము అపవిత్ర మైనది. త్యాగము పవిత్ర మైనది. త్యాగ రూపము, పవిత్రము అయిన దక్షిణ సమర్పణము లేకుండా నిర్వహింపబడే యజ్ఞము అదక్షిణ యజ్ఞము. కనుక అది తామస యజ్ఞము.

**శ్రద్ధా విరహిత యజ్ఞము**

శ్రద్ధ లేకుండా చేయబడే యజ్ఞము శ్రద్ధా విరహిత యజ్ఞము (***శ్రద్ధా విహీనం శ్రద్ధా విరహితం యజ్ఞం***). శ్రద్ధ లేనిదే ఏ కార్యమూ ఫలించదు. యజ్ఞాది పవిత్ర కార్యాలలో శ్రద్ధ ప్రముఖమైన స్థానమును ఆక్రమించి

ఉంది. యజ్ఞ సాధనాలలో ఏదైనా లోపిస్తే శ్రద్ధ దానిని పూరిస్తుంది అంటారు పెద్దలు. కాని, అట్టి శ్రద్ధే లోపించి నపుడు ఇక ప్రత్యేకంగా చెప్పే దేముంటుంది? అలా ప్రధానాంగ మైన శ్రద్ధ లేకుండా ఆచరించే యజ్ఞము తామస యజ్ఞము.

శ్రద్ధ లేకుండా యజ్ఞాన్ని ఎవరైనా ఎలా నిర్వహిస్తారు? యజ్ఞంలో ఋత్విజులతో పాటు అనేక మంది యజ్ఞమును వీక్షిస్తూ ఉంటారు కదా? నిజమే. తామస యజ్ఞాన్ని నిర్వహించే వారు స్వభావతః శ్రద్ధ లేని వారైనా శ్రద్ధ ఉన్నట్లు అభినయిస్తూ యజ్ఞమును నిర్వహిస్తుంటారు. చూచే వాళ్ళకి వారు శ్రద్ధతో యజ్ఞమును నిర్వహిస్తున్నట్లే ఉంటుంది. వాస్తవానికి తామస యజ్ఞాన్ని నిర్వహించే వారికి ఏ శ్రద్ధ ఉండదు. అలా లేకనే ఉన్నట్లు ప్రదర్శించే కుహనా శ్రద్ధను తామస శ్రద్ధ అంటారు.

## యజ్ఞ సమీక్షణము

యజ్ఞము అనేది సువిశాల మైన భావార్థాలతో కూడిన పదము. భగవంతుడే యజ్ఞ రూపంలో ఉన్నాడు అన్నది తైత్తిరీయ సంహిత (*యజ్ఞోవై విష్ణుః 2 - 5 - 5*). యజ్ఞము అనగానే అగ్నిహోత్రముతో కూడిన వేదోక్త యజ్ఞమే మనస్సులో మెదుల్తుంది. వేద విధి ననుసరించి ఆచరించే యజ్ఞాలు ఎక్కువ శాతం ఫల భోగార్థమే ఉంటాయి. అవి ఇహ లోక భోగాలు కావచ్చు. లేదా, స్వర్గలోక భోగాలు కావచ్చు.

వైదిక యజ్ఞాలన్నీ పుణ్యాన్ని ఉద్దేశించి, తద్వారా స్వర్గాన్ని కాంక్షించి ఉంటాయి. కాని, నిష్కామంగా ఆచరింపబడే యజ్ఞాలు చిత్తశుద్ధిని కాంక్షించి, తద్వారా మోక్షాన్ని ప్రధానంగా చేసుకొని ఉంటాయి. అలా చూచి నపుడే అనేక యజ్ఞాలు ప్రతిపాదించబడి ఉన్నాయి.

పరమేశ్వరుని ఆరాధించి, అంతఃకరణ శుద్ధిని పొందుటకు ఉపకరించే అనేక సాధనలు యజ్ఞములుగా పిలువ బడ్డాయి. ఈశ్వర బుద్ధితో పరోపకారార్థం ఆచరించే సేవా కార్యాలు కూడా యజ్ఞములు అనబడ్డాయి.

ఒకే వ్యక్తి కూర్చుని వేదాధ్యయనం చేస్తే అది స్వాధ్యాయ యజ్ఞ మైంది. జపసాధన చేస్తే అది జపయజ్ఞ మైంది. గీతలో జ్ఞానమునే యజ్ఞముగా గుర్తించి జ్ఞానయజ్ఞం అనడం జరిగింది. దానం చేయడం యజ్ఞ మైంది. తపస్సు చేయడం కూడా యజ్ఞ మైంది.

**యజ్ఞార్థా త్కర్మణోఽ న్యత్ర లోకోఽ యం కర్మబంధనః**

భగవంతుని కొరకు (***యజ్ఞార్థాత్***) ఆచరించే కర్మ కంటే అన్యమైన కర్మలను ఆచరించే వాడు ఈ లోకంలో కర్మబంధంలో చిక్కు కుంటాడు అని శ్రీకృష్ణ పరమాత్మ గీత - కర్మయోగంలో తెలియ జేశాడు (*3వ అ - 9 వ శ్లో*).

సాత్త్వికయజ్ఞము అంతఃకరణ శుద్ధిని ప్రసాదిస్తుంది. రాజసయజ్ఞము చిత్తశుద్ధిని ప్రసాదించ లేక పోయినా పుణ్యాన్ని అనుగ్రహిస్తుంది. తామస యజ్ఞము అటు అంతఃకరణ శుద్ధిని ఇవ్వలేదు, ఇటు పుణ్యాన్ని పంచలేదు. శ్రమను, ఆయాసాన్ని కలిగించి దుఃఖాన్ని పెంచుతుంది.

ఫలార్థం యజ్ఞ కర్మలు చేసే వారు సకాములు. అంతఃకరణ శుద్ధి కొరకు యజ్ఞకర్మ లాచరించే వారు నిష్కాములు. కోరికల నుండి విడి పడిన వారు కావడం చేత సకాములు కాని వారు; అంతఃకరణ శుద్ధిని పొందియే ఉన్న వారు కనుక నిష్కాములు కానటువంటి సన్యాసులు - సర్వ కర్మ వినిర్ముక్తులై నైష్కర్మ్యము నందే ఉంటూ కర్మ యందు అకర్మను, అకర్మ యందు కర్మను దర్శిస్తూ ఉంటారు. అట్టి జ్ఞానులు సర్వ





కర్మలను చేసిన వారే అవుతున్నారు (**కృత్స్న కర్మకృత్**). ఆత్మజ్ఞాని అయిన మహాత్ముడు అన్నీ పొందే వున్న ఆప్తకాముడు కావడం చేత సర్వ కర్మల నుండి, సర్వ యజ్ఞాల నుండి విడిపడి ఉంటాడు. తానే యజ్ఞ స్వరూపుడై శోభిస్తాడు.

*త్రివిధ యజ్ఞాలను విస్తరించి చెప్పిన గీతాచార్యుడు త్రివిధ తపస్సులను గూర్చి చెబుతున్నాడు.*

**దేవ ద్విజ గురు ప్రాజ్ఞ పూజనం శౌచ మార్జవమ్ ।**
**బ్రహ్మచర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే ॥** **14**

**దేవద్విజగురు ప్రాజ్ఞ పూజనం-శౌచం-ఆర్జవం**
**బ్రహ్మచర్యం-అహింసా-చ-శారీరం-తపః-ఉచ్యతే**

| | | | |
|---|---|---|---|
| దేవద్విజగురు ప్రాజ్ఞ పూజనం | = దేవతలను, బ్రాహ్మణులను, గురువులను, పండితులను పూజించుట | అహింసా | = హింస లేకుండుట |
| | | శారీరం | = దేహ సంబంధమైన |
| శౌచం | = శుభ్రత | తపః | = తపస్సుగ |
| ఆర్జవం | = ఋజుత్వము | ఉచ్యతే | = చెప్పబడింది |
| బ్రహ్మచర్యం | = బ్రహ్మచర్యము | | |

**అర్జునా! దేవతలను, బ్రాహ్మణులను, గురువులను, జ్ఞానులను పూజించుట; శుచిత్వము, ఋజుత్వము, బ్రహ్మచర్యము, అహింస కలిగి ఉండుట - వీటిని శారీరక తపస్సు అన్నారు.**

**వ్యాఖ్య**

యజ్ఞము, దానము, తపస్సు అను ఈ మూడు సాధనలు మనుషులను దోష విముక్తుల్ని చేస్తాయి. పవిత్రుల్ని చేస్తాయి. కనుక, యజ్ఞ, దాన, తపస్సులను విడిచిపెట్ట కూడదు. తప్పక ఆచరించాలి (***న త్యాజ్యం కార్య మేవ తత్***) అని పద్దెనిమిదవ అధ్యాయం - అయిదవ శ్లోకంలో భగవానుడు బోధించడం జరిగింది. ఇంతవరకు యజ్ఞ, దాన, తపస్సులలో యజ్ఞమును గూర్చి తెలుసుకున్నాం. త్రివిధ యజ్ఞాలను బోధించిన గీతాచార్యుడు ప్రస్తుతం తపస్సును గూర్చి ప్రవచిస్తున్నాడు.

తపస్సు పవిత్ర మైనది. అది భగవంతుని స్వరూపము. బ్రహ్మదేవుడు తపోధనుడై, తపోమయుడై, తపో హృదయంతో సృష్టి కార్యాన్ని నిర్వర్తించి నట్లు (***తపోఽ తప్యత***) తైత్తిరీయ శ్రుతి. సమస్తమైన కల్మషాలను పోగొట్టే తపస్సు (***తపసా కిల్బిషం హన్తి***) మూడు విధాలుగా చెప్పబడింది (***తపః త్రివిధమ్ ఉచ్యతే***).

త్రివిధ తపస్సులు అంటే మూడు రకాలైన తపస్సులు. అవే శారీరక తపస్సు, వాచిక తపస్సు, మానసిక తపస్సు. శరీరం ద్వారా చేసేది శారీరక తపస్సు. వాక్కు ద్వారా చేసేది వాచిక తపస్సు. మనస్సు ద్వారా చేసేది మానసిక తపస్సు. గుణ ప్రాధాన్యతను బట్టి మళ్ళీ శారీరక తపస్సు సాత్త్విక, రాజస, తామస తపస్సులుగా మూడు విధాలుగా తెలుస్తుంది. అలాగే వాచిక, మానసిక తపస్సులు కూడా. ఈ విధంగా తొమ్మిది రకాలుగా విభజింప బడిన నవవిధ తపస్సులను భగవంతుడు ప్రవచిస్తున్నాడు. ముందుగా శారీరక తపస్సును గూర్చి చెబుతున్నాడు. దీనినే కాయిక తపస్సు అని కూడా అంటారు.

శారీరక తపస్సులో ప్రధానంగా రెండు విషయాలు తెలుస్తున్నాయి. తపస్వి ఏం చేయాలి? తపస్వి ఎలా ఉండాలి? ఈ రెండు విషయాలు ప్రస్తుత శ్లోకంలో ప్రధానంగా చెప్ప బడ్డాయి. తపస్వి చేయ వలసింది పూజాదులు. తపస్వి ఉండ వలసింది శుచిత్వాదులతో. పూజలో ఎవరిని పూజించాలి? ఈ విషయాన్ని నాలుగు రకాల

పూజల ద్వారా తెలిపి, తపస్సు చేసే సాధకుడు ఎలా ఉండాలి అనే విషయాన్ని శుచిత్వాదుల రూపంలో నాలుగు విధాలుగా చెబుతున్నాడు. ముందుగా నాలుగు పూజలను తెలుసుకుందాము.

## పూజా వైశిష్ట్యము

### దేవ పూజనం

దేవతా మూర్తులను పూజించడము దేవ పూజనము. బ్రహ్మ, విష్ణు, మహేశ్వర, సూర్య, అగ్ని, దుర్గ, గణేశాది దేవతలను పూజించడము దేవ పూజనము. పూజను తపస్సు అని ఎప్పుడైతే చెప్పడం జరిగిందో అది నియమంగా ఆచరించ దగింది అని అర్థము. ఆదిలో తపస్సు సంకల్ప యుతంగా ఉంటుంది. ఆ తరువాత నియమబద్ధంగా సాగుతుంది. అలాగే దేవతారాధనము అనే ఈ తపస్సు కూడా వ్రత పరిపాలనం లాగా నిత్యమూ క్రమం తప్పకుండా ఆచరించాలి. నిత్యపూజగా మారితేనే పూజ తపస్సు అవుతుంది.

పూజ పవిత్రమైన సాధన. పూజలో వాక్కు, మనస్సు కూడా సంబంధాన్ని కలిగి ఉన్నా, పూజ అనేది ప్రధానంగా దేహ సంబంధ మైనదే కావడం చేత దీనిని శారీరక తపస్సు, లేదా కాయక తపస్సు అనడం జరిగింది.

పూజ శారీరకం, లేదా కాయకం. దీపారాధన, పుష్పాలంకారము, చందన కుంకుమాది ధారణము, వస్త్రాలంకారము, దీప, ధూప, నైవేద్య సమర్పణము, నీరాజన, నమస్కారాదులు - ఈ సమస్తము దేహ నిర్వాకమే. పూజ అనేది స్వామి భృత్య న్యాయ పరిధిలో ఉంటుంది. కనుక, భక్తునిలో దైన్యము, అహంకార రాహిత్యము మొదలైన సాత్త్విక లక్షణాలు చోటు చేసుకుంటాయి.

### ద్విజ పూజనమ్

***ద్విజ*** శబ్దానికి అనేక అర్థాలు ఉన్నాయి. బ్రాహ్మణుడు, పక్షి, పాము, క్షత్రియుడు, దంతము - ఇలా ఎన్నో అర్థా లున్నాయి. ఇది జన్మ సంబంధంగా చెప్ప బడింది. రెండు జన్మలు, రెండు జాతులుగా తెలియడం చేత ***( ద్విజన్మన్, ద్విజాతిః )*** 'ద్విజ' శబ్దమును ఉపయోగించడము జరిగింది.

ముందు అండముగా జన్మించి, ఆ తరువాత పిల్లగా పుట్టడం, ఇలా రెండు జన్మ లెత్తడం చేత పక్షి ***ద్విజ*** అనబడింది. తల్లి గర్భం నుండి మనిషి పుట్టడం ఒక జన్మ అయితే, గాయత్రీ మంత్రోపదేశంతో అవిద్యా తిమిరం నుండి బయట పడి ఆత్మ వెలుగులో రమించడం మరొక జన్మ అనే భావనతో ***ద్విజ*** అంటే బ్రాహ్మణుడు అనడం జరిగింది. ఈ విషయంలో మీమాంస అవసరం లేదు. బ్రహ్మజ్ఞానము కలవాడు బ్రాహ్మణుడు అన్నది శాస్త్రం ***(బ్రహ్మ జ్ఞానేన బ్రాహణః).*** బ్రహ్మజ్ఞాని కాకపోయినా, బ్రహ్మజ్ఞానానికి ప్రయత్నించే పవిత్రాత్ముడు కూడా బ్రాహ్మణుడే అని భావించ వచ్చు. జన్మ బ్రాహ్మణుడా, కర్మ బ్రాహ్మణుడా? అనే చర్చ అనవసరం. జన్మతః, అంటే జాతి పరం గానే బ్రాహ్మణుడు అని నిర్ధారణ చేయాలి అంటే కుదరదు. ఆచారాన్ని ప్రక్కన పెట్టినా, దేవుడే లేడు అనే నాస్తిక భావాలను కలిగిన బ్రాహ్మణులు చాలా మంది ఉన్నారు. వారి దేహంపై జంధ్యము కనబడదు, వారి మనస్సులో జపం ఉండదు. కనుక బుద్ధి బ్రాహ్మణుడే బ్రాహ్మణుడు కాని జన్మ బ్రాహ్మణుడు కాడు. బ్రాహ్మణత్వము జన్మతః సిద్ధించేదే అని భావించే వారు, వారు విశ్వసించే దానిని, వినిపించే దానిని వారి ప్రవర్తనములో ఇతరులకు దర్శింప చేయాలి. కనుక సాత్త్విక జీవనము ద్వారా, ప్రశాంత ప్రబోధాల ద్వారా జనతను జాగృతం చేసే ద్విజులను పూజించడము కూడా శారీరక తపస్సే. ఇది సంప్రదాయా నికి విరుద్ధము కాదు. సంప్రదాయంలో సంప్రాప్తమైన సదాచారము.





### గురు పూజనమ్

గురు పూజనము అంటే ఆచార్య సేవనము. సద్గురు సేవనము. తన బోధల ద్వారా, ప్రవచనముల ద్వారా శిష్యుని లోని అజ్ఞాన చీకట్లను పారద్రోలే ప్రకాశ స్వరూపుడు సద్గురువు. గురుపూజలో గురువును మానవ మాత్రుడుగా మనం భావించడం లేదు. గురువులో దేవుణ్ణి చూస్తూ, ఆచార్యుణ్ణి గురుదేవుడు అంటూ, గురువును బ్రహ్మగా, విష్ణువుగా, మహేశ్వరుడుగా వీక్షించడమే గాకుండా, సాక్షాత్తు పరబ్రహ్మ స్వరూపంగా ***(గురు రేవ పరంబ్రహ్మ)*** దర్శించి సేవించడము జరుగుతుంది. ఆర్ష సంస్కృతిలో ఆచార్యునికి, ఆదిదేవునికి భేదం లేదు. నీవే బ్రహ్మము అని బోధించే గురుదేవుడు తాను బ్రహ్మము కాకుండా పోతాడా? కనుక గురుసేవ పరమ పవిత్రమైన కాయక తపస్సుగా అభివర్ణించ బడింది.

***గుకార స్త్వంధ కారో వై రుకార స్తన్నివర్తకః,***
***అంధకార నిరోధిత్వాత్ గురు రిత్యభి ధీయతే॥***

'గు' అనే అక్షరము అంధకారమును సూచిస్తుంది. 'రు' అనే అక్షరము దానిని నివారించేది అని చెప్ప బడింది. అజ్ఞానము అనే అంధకారమును నిరోధించే వాడు కనుక ఆచార్యుడు 'గురు' శబ్ద వాచ్య డయ్యాడు.

### ప్రాజ్ఞ పూజనము

'ప్రజ్ఞా' అంటే బుద్ధి, వివేకము, మేధస్సు, పాండిత్యము. ప్రజ్ఞ కల వాడు ప్రాజ్ఞుడు. పండితుడు. వివేక వంతుడు. బుద్ధిమంతుడు. అట్టి వానిని సత్కరించడమే ప్రాజ్ఞ పూజనము. బ్రహ్మజ్ఞాని కాకపోయినా, ఆచార్య స్థానంలో లేక పోయినా, సదసద్వివేకము, శాస్త్ర జ్ఞానము కలిగి; సత్ప్రవర్తన, సదాచారాది సుగుణములు గల సాత్త్వికుడు, సాధు పురుషుడు ప్రాజ్ఞుడు. అలాంటి పెద్దలకు నమస్కరించడం, వారి వద్ద వినమ్రులై వివేక వంతులు కావడము సాధకుల కర్తవ్యము. అలాంటి ప్రాజ్ఞ పూజనము కూడా శారీరక తపస్సు క్రిందికే వస్తుంది.

ఇంతవరకు కాయక తపస్సులో తపస్వి దేహంతో ఏమి చేయాలి అనే దానికి నాలుగు విధాలైన పూజలు చేయాలి అని తెలుసుకున్నాం. ఇక తపస్వి ఎలా ఉండాలి అనే విషయాన్ని నాలుగు విధాలుగా చెప్పుకుందాం.

## ప్రవర్తనా వైభవము

### శౌచము

శౌచము అంటే శుచిత్వము. శుభ్రత. పవిత్రత. వాస్తవానికి శౌచమును బాహ్య మని, అంతర మని రెండు విధాలుగా చెప్పుకోవాలి. కాని, ప్రస్తుతం మనం అధ్యయనం చేస్తున్నది శారీరక తపస్సును గూర్చి కనుక, శౌచమును కూడా అంతవరకే వీక్షించి అర్థం చేసుకోవాలి. అంతశ్శౌచాన్ని తరువాత చెప్పుకుందాం. పూర్వా ధ్యాయాలలో చెప్పుకున్నాం కూడా.

***శారీర మాద్యం ఖలు ధర్మ సాధనమ్*** - ధర్మమును, లేదా పురుషార్థమును సాధించడానికి శరీరము సాధనమై ఉండటం చేత దానిని పరిశుద్ధంగా ఉంచుకోవాలి. మనం నివసించే ప్రదేశము, ధరించే దుస్తులు, ఉపయోగించే వస్తువులు, నిత్య జీవితంలో మనం వాడుకునే ప్రతి వస్తువు శుభ్రంగా, పరిశుద్ధంగా ఉండటమే శౌచము.

బాహ్య కాలుష్యము అంటకుండా ఉండటమే శౌచము కనుక, మనము పీల్చే గాలి, త్రాగే నీరు,

భుజించే ఆహారము, తిరిగే వాతావరణము - అన్నీ పరిశుద్ధంగా ఉండేటట్లు జాగ్రత్త పడాలి. శరీరాన్ని స్నానాదుల చేత శుభ్రం చేసుకున్నా, కలుషిత మైన గాలిని పీల్చితే ఆరోగ్యం దెబ్బ తింటుంది. మలిన జలాన్ని పానం చేస్తే కాయక్లేశము సంభవిస్తుంది. ఆరోగ్యం పాడైతే, సాధన కుంటు పడుతుంది. కనుక కాయక తపస్సులో ఈ శౌచమును చేర్చడం జరిగింది.

**ఆర్జవము**

ఆర్జవము అంటే ఋజుత్వము. సరళత్వము. నిజాయతితో కూడిన ప్రవర్తనము. ఆలోచనకు, ఆలాపనకు, ఆచరణకు మధ్య ఎక్కడా అంతరము లేని స్థితి. అంటే, త్రికరణ శుద్ధిగా జీవించడము. అదే ఋజుత్వము లేదా ఆర్జవము.

*శ్లో॥ యథా చిత్తం తథా వాచః యథా వాచః తథా క్రియా,*
*చిత్తే వాచి క్రియాయాంచ సాధూనాం ఏక రూపతా ॥*

మనస్సులో ఏది ఉందో మాటలో అదే వినిపించాలి. మాట ఏది చెప్పిందో క్రియ దానిని చేసి చూపాలి. మనస్సు, మాట, మనుగడ సాధువుకు ఒకే విధంగా, ఏక రూపంగా భాసిస్తాయి. దీనినే శాస్త్రం ఆర్జవము అంటుంది. అంటే త్రికరణ శుద్ధితో జీవించడము అని అర్థము.

**బ్రహ్మచర్యము**

బ్రహ్మచర్యము అనే పదానికి విశేషార్థము ఉన్నా, మనం చర్చించేది కాయక తపస్సును గూర్చి కనుక, దేహానికి పరిమితమై అర్థం చేసుకోవడమే సముచితంగా ఉంటుంది. అలా చూచి నపుడు, బ్రహ్మచర్యము అంటే మైథున వైముఖ్యమే అని చెప్పుకోవాలి. ఇది సాధకులకు అత్యంత ప్రముఖమైన విషయము.

***మరణం బిందు పతేన జీవనం బిందు రక్షణాత్*** - వీర్య పతనమే మరణము. వీర్య రక్షణమే జీవనము అన్నది యోగశాస్త్రము. కనుక కాయక తపస్సులో బ్రహ్మచర్యమును అవలంబించడము అంటే, కేవలం మైథున క్రియ నుండి విరమించడమే కాదు. అలా విరమించడానికి అనువైన వాతావరణమును ముందు మనస్సులో సృష్టించు కోవాలి. ఇది కాయక తపస్సు కదా, ఇందులో మనస్సు యొక్క ప్రమేయ మేమిటి అనే సందేహం మీకు కలగ వచ్చు. దేహమే కాయక తపస్సులో ప్రధానము అనేది వాస్తవ మైనా ఇంద్రియ మనస్సులను పూర్తిగా ప్రక్కన పెట్టే అవకాశం లేదు. అవి అన్యోన్యాశ్రయాలు అనే విషయాన్ని విస్మరించడానికి వీలు లేదు.

బ్రహ్మచర్యము భంగ పడేది మైథున కార్యము లోనే అయినా, మైథునానికి ముందే ఒక్కొక్క స్థాయిలో అది శిథిల మౌతూ వస్తుంది. ఈ ప్రారంభ శిథిలావస్థలను నివారించుకుంటూ వస్తేనే అంతిమంగా మైథున కార్యాన్ని నిరోధించి బ్రహ్మచర్యమును పరిరక్షించు కోవడం సాధ్య పడుతుంది.

*స్మరణం కీర్తనం కేలిః ప్రేక్షణం గుహ్య భాషణమ్*
*సంకల్పోఽ ధ్యవ సాయశ్చ క్రియా నిర్వృత్తి రేవ చ,*
*ఏత న్మైథున మష్టాంగం ప్రవదన్తి మనీషిణః ॥*

బ్రహ్మచర్యమును భంగ పరచి తపస్సును భగ్నం చేసే మైథున కార్యానికి ఎనిమిది అంగాలున్నా యన్నారు పెద్దలు, పరమ యోగులు. ఇవన్నీ నిగ్రహింప బడితేనే బ్రహ్మచర్యము సాధ్య పడుతుంది.

ప్రేమికులు ఒకరి నొకరు స్మరించడము (***స్మరణం***). వారిని గూర్చి పరోక్షంలో ప్రస్తావించి, వారిని గూర్చి చెప్పుకొని సంతోషించడం (***కీర్తనం***). ఒకరితో ఒకరు కలిసి తిరగడం (***కేలిః***). అదే పనిగా ఒకరి





నొకరు చూసుకుంటూ ఉండటం (***ప్రేక్షణం***). పరస్పరం రహస్యంగా మాట్లాడు కోవడం (***గుహ్య భాషణమ్***). సంగమించాలని సంకల్పించడం (***సంకల్పః***). సంకల్పించిన దానిని నిర్ధారణ చేసుకోవడం (***అధ్యవసాయః***). నిరోధించడానికి, నిగ్రహించడానికి వీలు లేని పరిస్థితిలో సంగమించడము (***క్రియా నిర్వృత్తిః***). ఈ ఎనిమిది బ్రహ్మచర్యమును భగ్నం చేసే మైథునాంగములు. ఈ అష్టాంగ మైథునాన్ని కష్టపడి త్యజించడమే బ్రహ్మచర్యము. అదే శారీరక తపస్సు.

**అహింస**

ఎవరినీ హింసించకుండా ఉండటము అహింస. మానవులు ఆచరించ వలసిన ధర్మాలలో అహింసకు అగ్రస్థానం ఇచ్చింది వేదము. ఈ విషయాన్నే ధర్మశాస్త్రాలు పని కట్టుకొని, పని పెట్టుకొని ప్రబోధించాయి. ***అహింసా పరమో ధర్మః*** - అహింస ఉత్తమ మైన ధర్మము అన్నది శాస్త్రం.

***వాఙ్మనః కాయైః భూతానాం అనభిద్రోహః*** - వాక్కు ద్వారా గాని, మనస్సు ద్వారా గాని, కాయము ద్వారా గాని ఎవ్వరికీ ఏ విధమైన కష్టం కలిగించడం గాని, ద్రోహం తల పెట్టడం గాని చేయకుండా ఉండటమే అహింస అన్నది యోగశాస్త్రం.

పరుషమైన వాక్కుల ద్వారా ప్రత్యక్షంగా ఇతరులను హింసించకుండా ఉండటం అహింస. అంతే కాదు, విష ప్రచారాల ద్వారా పరోక్షంగా అన్యులను హింసించకుండా ఉండటము కూడా అహింసే.

కాని, ప్రస్తుత శ్లోకంలో 'అహింస' అనే దానిని కాయక తపస్సుగా చెప్పడం చేత, దేహం ద్వారా హింసించ కుండా ఉండాలి అనేది ముఖ్య విషయంగా ఉంది. ఇతరులను శారీరకంగా బాధించడం హింస. ఇతరులను కొట్టడము హింస. హింస పెట్టడం ఎలా తపో భంగమో, హింస పడటం, లేదా హింసింప బడటం కూడా తపో భంగమే. ఈ పరిస్థితులు సంభవించకుండా సాధకులు జాగ్రత్త పడాలి.

కాయక తపస్సులో అహింసకు సంబంధించి ఈ మాత్రం అవగాహన సరి పోతుంది. అంతేగాని, ఒక చెంప మీద కొడితే రెండో చెంప చూపించు - అదే అహింస అనే స్థాయికి ఎదగ నవసరం లేదు.

ఒక చెంప మీద కొట్టిన వాడు రెండవ చెంప మీద కొట్టడానికి సంశయిస్తాడా? పైగా దెబ్బ తినింది చాలక, రెండవ చెంపను కూడా చూపించడ మెందుకు? అదే మన్నా లాకర్‌లో దాచబడిన ధనమా, తీసి చూపించ డానికి? లేక కొట్ట గానే రెండు ముక్కలై అటు ఇటు పడే కొబ్బరికాయ చిప్పలా చెంప అంటే!

ఆధ్యాత్మిక విషయాలలో అతిశయాలు అవరోధాలే గాని అభివృద్ధికి సోపానాలు కావు. ప్రతి విషయాన్ని ఆవేశంతో ముడిపెట్టి అర్థం చేసుకోవడం కాదు. వివేకంతో, విచక్షణతో విచారించి అర్థం చేసుకోవాలి.

ఇక, వాచిక తపస్సును గూర్చి చెబుతున్నాడు.

అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్ ।
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే ॥ 15

***అనుద్వేగకరం-వాక్యం-సత్యం-ప్రియః-హితం-చ-యత్***
***స్వాధ్యాయాభ్యసనం-చ-ఏవ-వాఙ్మయం-తపః-ఉచ్యతే***

| | | | | | |
|---|---|---|---|---|---|
| అనుద్వేగకరం | = | ఉద్వేగకరము కానిది | హితం చ | = | హిత మైనది |
| సత్యం | = | సత్య మైనది | యత్ | = | ఏ |
| ప్రియః | = | ప్రియ మైనది | వాక్యం | = | వాక్యము |

| | | |
|---|---|---|
| స్వాధ్యాయాభ్యసనం చ ఏవ | = | వేదాధ్యయనము |
| వాఙ్మయం | = | వాక్సంబంధమైన |
| తపః | = | తపస్సుగ |
| ఉచ్యతే | = | చెప్పబడింది |

**పార్థా! పరులను నొప్పించనిది, సత్య మైనది, ప్రియ మైనది, హితకర మైనది, స్వాధ్యాయమును అభ్యసించుట - ఈ విధమైన పలుకును వాచిక తపస్సు అంటారు.**

**వ్యాఖ్య**

దేవ, ద్విజ, గురు, ప్రాజ్ఞులను సేవించుట ద్వారా; శౌచము, ఆర్జవము, బ్రహ్మచర్య, అహింసాది సాధనలను ఆచరించుట ద్వారా కాయక తపస్సును అనుష్ఠించిన సాధకులు, దేహ సంబంధమైన దోషాలను తొలగించుకొని శుద్ధి పడుతున్నారు. మోక్షానికి సిద్ధ పడుతున్నారు. కాయక తపస్సును గూర్చి ఇంతవరకు వివరించిన పరమేశ్వరుడు ఇప్పుడు వాచిక తపస్సును గూర్చి చెబుతున్నాడు.

సాధకుని నోటి నుండి ఏ విధమైన వాక్యము వినిపిస్తుందో దానిని బట్టి అతని తపస్సు తెలుస్తుంది. వాక్కు అగ్ని బీజం. వంటకు మంటలా ఉపకరిస్తుంది. అదే ఉగ్ర రూపాన్ని దాల్చి దగ్ధం చేస్తుంది. కనుక సక్రమంగా వినియోగించుకుంటే, వాక్కు తపోరూపమై అమృతాన్ని పంచుతుంది. దారి తప్పి అక్రమంగా ఆలపిస్తే వాక్కు పతన హేతువై విషాన్ని విరజిమ్ముతుంది.

మనం ఎవరితో మాట్లాడినా, ఆ మాట వెనుక ఒక ఉద్దేశ్యం ఉంటుంది. ఉండాలి. హేతువు లేకుండా ఏదంటే అది మాట్లాడటం పిచ్చివాడికే సాధ్యం. సాధారణంగా ఒక వ్యక్తి మరొక వ్యక్తితో మాట్లాడే టప్పుడు ఏదో ఒక విషయాన్నో, లేదా అనుభవాన్నో తెలియ చేసేందుకే మాట్లాడుతాడు. అదే వాక్య ప్రయోజనము ***( పర ప్రత్యయ నార్థం ప్రయుక్తస్య వాక్యస్య ).***

విషయ జ్ఞానాన్ని, లేదా అనుభవాన్ని పంచుతూ మాట్లాడే టప్పుడు ఆ వాక్యాలు వినే వారిలో వివేకాన్ని వృద్ధి చేయాలి, విచారాన్ని కలిగించాలి, అవగాహనను పెంచాలి. అంతే గాని, ఉద్వేగాన్ని కలిగించ కూడదు. అశాంతిని రేకెత్తించ కూడదు. సంశయాన్ని కల్పించ కూడదు. సంతాపాన్ని దించ కూడదు.

మాటలు చల్లగా ఉండాలే గాని, వేడిని పుట్టించ కూడదు. పంట పండినట్లు ఉండాలే గాని మంట పెట్టినట్లు ఉండ కూడదు. తృప్తిని కలిగించాలే గాని అసంతృప్తిని పంచ కూడదు. శాంతిని కలిగించాలే గాని అశాంతిని పెంచ కూడదు. ఇలా మాట్లాడటం స్థూలంగా చెప్పాలంటే వాచిక తపస్సు అవుతుంది. దీనిని శాస్త్రీయంగా, ప్రామాణికంగా అర్థం చేసుకోవాలి అంటే, కొన్ని లక్షణాలను అవశ్యం చెప్పుకొని అర్థం చేసుకోవాలి. ప్రస్తుత శ్లోకంలో భగవంతుడు అదే చెబుతున్నాడు. వాచిక తపస్సు ఎలాంటిదో విశదం చేస్తున్నాడు.

## అనుద్వేగకరం - సత్యం - ప్రియహితం వాక్యం

మనం పలికే మాట, లేదా వాక్యము వినే వారికి ఉద్వేగాన్ని కలిగించకుండా ఉండాలి. దుఃఖాన్ని కలిగించ కుండా ఉండాలి ***( అనుద్వేగకరం ప్రాణినామ్ అదుఃఖకరం వాక్యం ).*** అట్టి వాక్యము అసత్య వచనం కాకూడదు. సత్య వాక్కు గానే ఉండాలి ***( వాక్యం సత్యం ).*** ఉద్వేగము కలిగించని సత్య వాక్యము ప్రియం గాను, హితం గాను ఉండాలి ***( ప్రియం చ తత్ హితం చ ప్రియ హితం ).*** వినగానే సుఖాన్ని కలిగించేది, కర్ణపేయంగా ఉండేది ప్రియం. పరిణామ దశలో శ్రేయస్సును కలిగించేది హితం. అవే ప్రియహితాలు. దృష్టాదృష్ట ప్రయోజనాలు. ప్రియం దృష్ట ఫలం. హితం అదృష్ట ఫలం. అది స్వర్గం కావచ్చు. లేదా మోక్షం కావచ్చు. తక్షణమే సుఖాన్ని కలిగించేది ప్రియం. భవిష్యత్తులో శుభాన్ని కలిగించేది హితం. ప్రథమంగా వాచిక తపస్సులో ఇంతవరకు మనకు స్పష్టంగా అర్థం కావాలి. అప్పుడే అది వాఙ్మయ తపస్సు అవుతుంది.





అనుద్వేగకరం, సత్యం, ప్రియం, హితం - అనే ఈ నాలుగు ధర్మాల చేత వాక్యం విశేషింప బడుతూ ఉంది. అంటే ఈ నాలుగు ధర్మాలు వాక్యంలో ఉండ వలసిన విశేషాలు. అనుద్వేగకరం, సత్యం, ప్రియం, హితం అనే ఈ నాలుగు విశేషణాలు వాక్యంలో సమ ప్రాధాన్యం కలిగి ఉన్నాయి. కనుక ఈ నాలుగు ధర్మాలు వాక్యంలో సమస్థితిలో ఉండి తీరాలి. విశేషణాలైన ఈ నాలుగు ధర్మాలకు సముచ్చయాన్ని చెప్పడం కోసం చ శబ్దము ప్రయోగింప బడింది ***( విశేషణ ధర్మ సముచ్చయార్థః 'చ' శబ్దః ).*** ఈ నాలుగు ధర్మాలు వాక్యంలో సమంగా కలిస్తేనే అది వాఙ్మయ తపస్సు అవుతుంది. అవధానంతో అర్థం చేసుకోండి. అందుకే 'చ' శబ్ద ప్రయోగము. విశేషణ ధర్మాలైన అనుద్వేగకరాదులు విశేష్యమైన వాక్యముతో సముదితాలే గాక, ఆ నాలుగు విశేషణాలకు కూడా పరస్పరము సముచ్చయము ఉంది అని తెలుపడానికే 'చ' శబ్ద ప్రయోగము.

కాస్త వివరిస్తాను. మన భావాన్ని మాట ద్వారా ఒకరికి తెలియ చేసే నపుడు ఆ వాక్యంలో అనుద్వేగకర, సత్య, ప్రియ, హితము లనే లక్షణాలు నాలుగు సమంగా కలిసి ఉండాలి. అప్పుడే అది వాఙ్మయ తపస్సు అవుతుంది. ఈ నాలుగు ధర్మాలలో ఒకటవది లోపించినా, రెండవది లోపించినా, మూడవది లోపించినా అది వాచిక తపస్సు కాలేదు.

అంటే మన వాక్యము సత్యమే అయినా, అనుద్వేగకరం, ప్రియం, హితం అనే మూడు ధర్మాలలో ఒకటవది లోపించినా, రెండవది లోపించినా, మూడవది లోపించినా, ఆ పలికిన వాక్యము సత్యమే కావచ్చు. కాని, అది వాఙ్మయ తపస్సు కాలేదు.

ప్రియ వాక్యము నైనా, హితవాక్యము నైనా, అనుద్వేగకర వాక్యము నైనా ఇలాగే అర్థం చేసుకోవాలి. ఒక దానితో పాటు మిగిలిన మూడు సముచ్చయమై ఉంటేనే అది వాచిక తపస్సు అవుతుంది. ఏ ఒక్కటి లోపించినా, లేదా నాలుగు కలిసి సమంగా ఉండక పోయినా, అది సత్య వాక్యం కావచ్చు. ప్రియ వాక్యం కావచ్చు. హిత వాక్యం కావచ్చు. లేదా అనుద్వేగకర వాక్యం కావచ్చు. అంతేగాని, అలాంటి వాక్యం వాఙ్మయ తపస్సు క్రిందికి రాదు. మరి అలా వాక్య నిర్మాణం చేయడం సాధ్య మేనా? ఇంతకీ వాఙ్మయ తపస్సుకు సంబంధించిన వాక్యం ఎలా ఉండాలి? విశేషణ చతుష్టయంతో కూడిన వాక్యము నెలా ఉచ్చరించాలి? శ్రీ శంకరాచార్య స్వామి ఉదాహరణకు ఒక వాక్యాన్ని అందించారు. ఇలా మాట్లాడ గలిగితే, మన మాట లన్నీ వాచిక తపస్సులే అవుతాయి.

***శాన్తో భవ! వత్స! స్వాధ్యాయం యోగం చ అనుతిష్ఠ ! తథా తే శ్రేయో భవిష్యతి !*** ఇది విశేషణ చతుష్టయ ముతో కూడిన వాక్యము. వాచిక తపస్సు.

'నాయనా! శాంతముగా ఉండెదవు గాక! స్వాధ్యాయమును, యోగమును అనుష్ఠించు. అలా చేస్తే నీకు శ్రేయస్సు కలుగుతుంది'. ఇది వాక్యార్థం. చతుర్విధ విశేషణ సముచ్చయార్థంతో విశిష్టమైన వాక్యము, విశేషణ విశేష్యత్వముతో వాఙ్మయ తపస్సుగా ఎలా విరాజిల్లుతూ ఉందో చూడండి.

నాయనా! ప్రశాంతంగా ఉండు ***(వత్స! శాన్తో భవ!).*** ఈ మాట ఎంత హాయిగా ఉంది. ఆహ్లాదకరంగా ఉంది. మన మైతే, 'చాల్లే ఊరుకో!', అంటాము. పాండిత్యము, ప్రకోపము మరీ ఎక్కువైతే 'ఇక నోరు ముయ్యి!' అంటాము. ఇది ఎంత కటువుగా ఉంది? మనం పలికిన వాక్యం దుఃఖాన్ని కలిగిస్తూ ఉద్వేగకరంగా ఉంటే, ఆచార్యుల వారి వాక్యం ఎంత అందంగా, ఆనందంగా, అనుద్వేగకరంగా ఉందో చూడండి ***( అనుద్వేగకరం ).*** 'నాయనా! స్వాధ్యాయాన్ని , కర్మయోగాన్ని ఆచరించు' ***( స్వాధ్యాయం యోగం చ అనుతిష్ఠ ! ).*** ఈ వాక్యము వినడానికి ప్రియంగా ఉంది ***( ప్రియం ).*** అంతే కాదు. భవిష్యత్తులో హితాన్ని కలిగిస్తుంది ***( హితం ).*** 'ఇలా చేస్తే

నీకు శ్రేయస్సు కలుగుతుంది' (*తథా తే శ్రేయో భవిష్యతి!*). ఈ వాక్యం అనుద్వేగకరము, సత్యము, ప్రియము, హితము కూడా. ఇలా వాక్య నిర్మాణం చేస్తూ, చతుర్విధ విశేషణ సముచ్చయార్థముతో భాషించ గలిగితే అది వాఙ్మయ తపస్సు అవుతుంది.

వాచిక తపస్సు అనేది ప్రధానంగా అనుద్వేగకరము, సత్యము, ప్రియము, హితము అనే నాలుగు స్తంభాల మీద నిలబడిన సౌధము. నాలుగు చక్రాల మీద నడిచే రథము.

**అనుద్వేగకరం**

సత్యము కఠినం గానే ఉంటుంది. కఠోరం గానే ఉంటుంది. 'నేను అబద్ధం ఆడలేను. ఇతరులకు కష్టం కలుగుతుందని నేను సత్యం మాట్లాడకుండా ఉండలేను' అని చాలా మంది అంటూ ఉంటారు. సత్యమును పలికే మనం మన మాటల ద్వారా పరులను బాధించ గల మేమెా గాని, సత్యానికి బాధించడం తెలియదు. సత్యము సుఖ పెట్టేదే గాని దుఃఖ పెట్టేది కాదు. కష్ట పెట్టడం తెలియని సత్యాన్ని ఎలా భాషించాలో తెలియక ఇతరులను మన భాషణం ద్వారా కష్టపెట్టి, ఆ దోషాన్ని సత్యానికి అంటగట్టి, నిజం చేదుగా ఉంటుంది, సత్యం కటువుగా ఉంటుంది అని మాట్లాడటం ధర్మం కాదు.

మనం సత్యాన్నే పలకాలి. సత్య భాషణము వ్రతము లాంటిది. వ్రతాన్ని సంయమనంతో ఆచరించాలి. ప్రశాంతంగా ఆచరించాలి. ఆవేశాలను, ఉద్రేకాలను ప్రక్కన పెట్టాలి. వ్రతాన్ని ఎలా ప్రియంగా ఆచరిస్తామో, సత్య భాషణమును కూడా అలా ప్రియంగా అభ్యసించాలి.

మనం ఏమి మాట్లాడు తున్నాము అనేది ఎంత ప్రధానమో, ఎలా మాట్లాడు తున్నాము అనేది కూడా అంతే ప్రధానము. మనం ఏమి మాట్లాడు తున్నాము, ఎవరితో మాట్లాడు తున్నాము, ఎక్కడ మాట్లాడు తున్నాము, ఎప్పుడు మాట్లాడు తున్నాము, ఎలా మాట్లాడు తున్నాము - ఈ ఐదు విషయాలను మనస్సులో ఉంచుకొని మాట్లాడితే తప్పకుండా మనకు వాచిక తపస్సు అలవడుతుంది. వాఙ్నియమము కుదురుతుంది.

వాఙ్నియమము కుదిరితే, మనం మాట్లాడే వాక్యాలలో, మాలలో మాణిక్యాల లాగా పదాలు పొదగ బడతాయి. మాటల కనుగుణంగా కంఠధ్వని అనుకూలిస్తుంది. వినే వారికి వినసొంపుగా ఉంటుంది. మనసుకు కష్టం లేకుండా ఉంటుంది (*అనుద్వేగకరం*).

**సత్యము**

ఎవరినీ కష్ట పెట్ట కూడదని, అనుద్వేగకరంగా భాషించాలని అసత్యాన్ని భాషించ డానికి వీలు లేదు. మనం ఎవరితో మాట్లాడు తున్నామో, ఎవరికి బోధిస్తున్నామో, లేదా సలహా ఇస్తున్నామో అది వారికి ఉపయోగ పడాలనే కదా, మనం మాట్లాడేది? సత్యం మేలు చేస్తుంది. అసత్యం ఎలా మేలు చేస్తుంది? కనుక, అనుద్వేగకర మైన వాక్యము సత్యంగా ఉండేటట్లు చూసుకోవాలి. మన మాట మన మనస్సుతో విభేదించ కూడదు. అప్పుడే అది సత్యమైన మాట.

కాని ఇక్కడ మరొక సూక్ష్మమైన అంశము ఉంది. మనం ఏది మాట్లాడు తున్నామో అది మన మనస్సులో ఉన్నదే. పైగా అనుద్వేగకరంగా కూడా మాట్లాడు తున్నాము. మనస్సుకు, మాటకు భేదం లేకుండానే భాషి స్తున్నాము. మనస్సులో ఉన్నదే చెబుతున్నాము. కాని, మన మనస్సులో ఉన్నదే తప్పుడు సమాచార మైతే, సత్య విషయం కాని దైతే, అప్పుడు ఏమి చేయాలి? మనస్సులో ఉన్నదే చెబుతున్నాము కనుక సత్యమే పలుకు తున్నాం. కాని, మనస్సుకు తెలిసింది ఏదో అది సత్యం కాదు. అప్పుడు అది సత్య భాషణం ఎలా అవుతుంది?





ఒక వ్యక్తి విజయవాడ రైల్వే ప్లాట్‌ఫారం మీద తొందర తొందరగా పరుగులు పెడుతూ, అయ్యా! వాల్తేరు వెళ్ళే రైలు ఏ ప్లాట్‌ఫారమ్ మీద ఉంది? అని నిన్నే ప్రశ్నించాడను కుందాం. పావుగంట క్రితం అది రెండవ నెంబరు ప్లాట్‌ఫారమ్ మీద ఉండటం నీవు ప్రత్యక్షంగా చూశావు కనుక, మరో ఆలోచనకు అవకాశం లేకుండా రెండవ నెంబరు ప్లాట్‌ఫారం మీద ఉందండి అని చెప్తావు. అతడు వెళ్ళి ఆ బండిలో కూర్చుంటాడు. బండి బయలుదేరి వెళ్తుంది.

కాని, అది వాల్తేరు వెళ్ళే రైలు కాదు. చెన్నై వెళ్ళే రైలు. ప్రయాణం చేసే వ్యక్తి ఇపుడు ఎక్కడికి చేరా లని? అతని కష్టానికి, బాధకి బాధ్యు లెవరు? నువ్వే. నువ్వు వాదించ నవసరం లేదు. నువ్వు చెప్పింది సత్యమే అని మేమూ అంగీకరిస్తున్నాము. కాకపోతే, పావుగంట క్రితం నువ్వు చూచి నపుడు అది రెండవ నెంబరు ప్లాట్‌ఫారమ్ మీదనే ఉండింది. ఆ తరువాత కొద్ది సేపటికి ప్రకటన వెలువడటం, వాల్తేరు రైలు ఒకటవ నెంబరు ప్లాట్‌ఫారమ్ మీదికి వెళ్ళడం, చెన్నై రైలు రెండవ నెంబరు ప్లాట్‌ఫారమ్ మీదికి రావడం జరిగింది.

నువ్వు సత్యమే చెప్పావు. కానీ నీ చేత చెప్ప బడింది సత్యం కాదు. తెలిసి నువ్వు తప్పు చేయలేదు. కాని, అది క్షంతవ్యం కాదు. ఒప్పు చేయాలి అనుకున్నప్పుడు క్షుణ్ణంగా తెలుసుకొని చెయ్యాలి. నేను సత్యాన్నే పలికాను. పైగా అనుద్వేగకరంగా పలికాను అని నువ్వు అనుకోవచ్చు. మనస్సులో ఉన్న దానిని మార్పు లేకుండా చెప్పినంత మాత్రాన అది సత్యం కాదు. ముందుగా మన మనస్సులో ఉన్నది సత్య మేనా? అనే దానిని నిర్ధారణ చేసుకొని ఆ తరువాత, ఆ వాక్యాన్ని ప్రశాంతంగా అనుద్వేగకరంగా భాషించాలి (*అనుద్వేగకరం వాక్యం సత్యం*). ఈ సత్యాన్ని ఆవిష్కరించ డానికి శ్రీ శంకరాచార్యస్వామి భగవద్గీత - పదహారవ అధ్యాయంలో **అహింసా సత్య మక్రోధః** అనే రెండవ శ్లోకంపై భాష్యం చెబుతూ ***అప్రియానృత వర్జితం యథా భూతార్థ వచనమ్*** అని సత్యాన్ని వ్యాఖ్యానించారు. 'ప్రియంగా ఉండాలి, అసత్యం కాకుండా ఉండాలి, ఉన్న దున్నట్లు ఉండాలి' అన్నారు. కనుక, మనస్సులో ఉన్న దానిని చెప్పడమే కాకుండా, అది సత్యమో, కాదో తెలుసుకొని మరీ చెప్పాలి.

**ప్రియం**

అనుద్వేగకరము, సత్యమైన విషయమును ప్రియంగా పలకాలి. చెప్పే వ్యక్తి ఉద్వేగాన్ని కలిగించకుండా సత్యాన్ని భాషించ వచ్చు. కాని, వినే వ్యక్తి దానిని ఎలా స్వీకరిస్తున్నాడు అనేది కూడా చాలా ముఖ్యం. నువ్వు చెప్పేది సత్య మైనంత మాత్రాన వినే వాడు ఎందుకు వింటాడు? తనకు ప్రియమైన దైతేనే వింటాడు. ప్రపంచంలో ఎన్నో సత్యమైన విషయాలు ఉన్నాయి. వాటన్నిటి అవసరం అందరికీ ఎలా ఉంటుంది? ఎవరికి ఏది ఇష్టమో, ఏది ప్రియమో దానినే వాళ్ళు వింటారు. ఒకవేళ నువ్వు చెప్పేది ఎదుటి వాడికి అవసర మైనదే అనేది నీ అభిప్రాయ మైతే, దానిని అతడు గ్రహించ డానికి నువ్వు ప్రియంగా భాషించ వలసి ఉంటుంది. అప్పుడే అతడు దానిని స్వీకరిస్తాడు. కనుక, అనుద్వేగకరము, సత్యమైన విషయ మైనా దానిని ప్రియంగా వినిపించాలి (*అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియం*).

**హితం**

ప్రియంగా ఉంటుందని హితకరం కాని దానిని పలుక కూడదు. ప్రియ మైనది ఏదో అది హితకరంగా కూడా ఉండాలి. సినిమాకు పోదామా! అని ఒక వ్యక్తితో చెబితే అతనికి ప్రియంగా ఉంటుంది. కాని, అది హితం కాదు. మధుమేహ రోగికి లడ్డు పెడితే అతనికి ప్రియం గానే ఉంటుంది. కాని, అది అతనికి హితం కాదు. కనుక అనుద్వేగకరము, సత్యము, ప్రియము అయిన మాట హితకరంగా ఉండాలి (***అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియ హితం చ***). ఇలా భాషించడము వాచిక తపస్సు.

***సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాత్ న బ్రూయాత్ సత్యం అప్రియమ్ ,***
***ప్రియం చ నానృతం బ్రూయాత్ ఏష ధర్మః సనాతనః ॥***

'సత్యాన్నే పలకాలి. ప్రియంగా పలకాలి. సత్యమే అయినా అప్రియ మైన దానిని పలుక కూడదు. ప్రియంగా ఉందని అసత్యమునూ పలుక కూడదు. ఇదే సనాతన ధర్మము' అని మనుధర్మ శాస్త్రము. అలాగే పోరు ఎప్పుడూ లాభం కాదు. పొందు ఎన్నడూ నష్ట పోదు. నోరు మంచి దైతే ఊరు మంచిది అన్నారు మన పెద్దలు. కాకి చేసిన కీడే ముంది? కోయిల చేసిన మేలు మాత్రం ఏముంది? పలుకు లోనే ఉంది పరమార్థం. తెలిసి పలికితే అదే పరార్థం.

**పలుకుట తెలియని అవివేకి**
**పలవరిస్తాడు విస్తారముగా**
**పలుకుల మర్మము తెలిపే జ్ఞాని**
**ప్రవచిస్తాడు విపులముగా**
**రెండూ కాని సామాన్యుడు**
**మితముగ పలకాలి హితముగా**
**రామ రామ జయ రాజారామ్**
**రామ రామ జయ సీతారామ్**

అని రామజోగి చిట్కా.

### స్వాధ్యాయ అభ్యసనం

విశేషణ చతుష్టయ సముచ్చయ వాక్యమే వాఙ్మయ తపస్సు అని విస్తరించి చెప్పుకున్నాం. ఉదాత్త అనుదాత్తాది స్వర చతుష్టయముతో కూడిన వేదమునకే వేదత్వము. అలాగే అనుద్వేగకరాది నాలుగు విశేషణాలతో కూడిన వాక్కునకే తపో రూపత్వము.

సత్య భాషణము ఎలా వాచిక తపస్సో మనకు అర్థ మైంది. అంతటితో శ్లోకం లోని పూర్వార్ధమునకు భాష్యం చెప్పిన ట్లైంది. వాఙ్మయ తపస్సుకు రెండవ విభాగం ఉంది. అదే స్వాధ్యాయ అభ్యసనం. వేదమును, అందులోను స్వశాఖ అధ్యయనా భ్యాసమును కూడా వాఙ్మయ తపస్సు అంటారు ***(స్వాధ్యాయో అధ్యేతవ్యః).*** ఎవరు ఏ వేద శాఖకు చెందిన వారో, ఆ శాఖను నిత్యము అధ్యయనం చేయాలి అనేది వేద నిర్ణయము. ఇదే స్వాధ్యాయము. ఈ విధమైన స్వాధ్యాయము కూడా వాచిక తపస్సే అవుతుంది ***(స్వాధ్యాయ అభ్యసనం చైవ యథావిధి వాఙ్మయం తపః ఉచ్యతే).***

*త్రివిధ తపస్సులలో కాయక, వాచిక తపస్సులను విస్పష్టం చేసిన పరమేశ్వరుడు, చివరి దైన మానసిక తపస్సును గూర్చి చెబుతున్నాడు.*

**మనఃప్రసాద స్సౌమ్యత్వం మౌన మాత్మవినిగ్రహః ।**
**భావసంశుద్ధి రిత్యేత త్తపో మానస ముచ్యతే ॥** 16

***మనఃప్రసాదః-సౌమ్యత్వం-మౌనం-ఆత్మవినిగ్రహః***
***భావసంశుద్ధిః-ఇతి-ఏతత్-తపః-మానసం-ఉచ్యతే***

మనఃప్రసాదః = మనస్సు ప్రశాంతత నొందుట





సౌమ్యత్వం = ప్రసన్నత్వము
మౌనం = మౌనము
ఆత్మవినిగ్రహః = మనోనిగ్రహము
భావసంశుద్ధిః = అంతఃకరణ శుద్ధి

ఇతి ఏతత్ = ఇది అంతా
మానసం = మనః సంబంధమైన
తపః = తపస్సుగ
ఉచ్యతే = చెప్పబడింది

**అర్జునా! ప్రసన్నమైన మనస్సు, శాంతస్వభావము, మౌనము, ఆత్మనిగ్రహము, అంతఃకరణశుద్ధి - ఇదంతా మానసిక తపస్సు అన్నారు.**

**వ్యాఖ్య**

కాయమునకు సంబంధించిన తపస్సును కాయక తపస్సని, వాక్కుకు సంబంధించిన తపస్సును వాచిక తపస్సు అని తెలుసుకున్నాం. అలాగే మనస్సుకు సంబంధించిన తపస్సు మానసిక తపస్సు. అదేమిటో ఈ శ్లోకంలో తెలుసు కుంటాము. మానస తపస్సు ప్రధానంగా ఐదు విశేషాలతో కూడి ఉంది. అవి (1) చిత్త ప్రసాదము (2) సౌమ్యత్వము (3) మౌనము (4) ఆత్మ వినిగ్రహము (5) భావ సంశుద్ధి. ఈ ఐదు లింగములై మానస తపస్సును తెలియ చేస్తాయి.

శరీరం మోయ గలిగినంత బరువునే మోస్తుంది. వాక్కు కొంత సమయమును మించితే మాట్లాడ లేదు. కాని, మనస్సు అలా కాదు. మనిషి మోయలేనంత భారాన్ని మనస్సు మోస్తుంది. తాను బరు వెక్కుతున్నా, మరో వైపు బరువు నెత్తుకొనే కార్యం లోనే మనస్సు నిమగ్నమై ఉంటుంది. కాకపోతే, బరువెక్కే మనస్సును మోయలేక మనిషే కూల బడుతూ ఉంటాడు.

కళ్ళు రూపాలనే నింపు కుంటాయి. చెవులు శబ్దాలనే అందు కుంటాయి. ముక్కు గాలితో పాటుగా వాసనలనే పీల్చుకుంటుంది. కాని, మనస్సు అలా కాదు. ప్రపంచా న్నంతా తన లోకి దించుకుంటుంది. దించుకోవడం సులువే. కాని, ఉంచుకోవడం అనుకున్నంత సులువైన పని కాదు.

ఎంతో కాలంగా ఎన్నెన్నో మనస్సులో చేరి పోయాయి. ఏవి ఎక్కడ ఉన్నవో తెలియ నంతగా దూరి పోయాయి. ఇంటిదొంగ ల్లాగా తయారయ్యాయి. ఎప్పుడు ఏం పోగొట్టు కుంటామో తెలియదు. ఎవరిని తప్పు పట్టాలో అర్థం కాదు. తప్పు ఒప్పులను ప్రక్కన బెడితే, మనస్సు ముప్పులో ఉంది అనేది మాత్రం అందరికీ తెలుసు. మనస్సు బాగుంటేనే మనుగడ బాగుంటుంది. మనస్సు చెడిపోతే మనుగడ మారణహోమ మవుతుంది. మరి ఇప్పుడేమి చేయాలి? ఏముంది, మనస్సును సరి చేసుకోవాలి అంతే! ఇది మానసిక తపస్సు.

మనస్సు సరి పడి ఉండాలి అంటే, దానిని పురి పెట్టే విషయాలను మనస్సు నుండి కదిలించాలి, బయటకు తరలించాలి. అవి మనస్సును కలత పెట్టకుండా ఉండాలి అంటే, వాటి స్వస్థాన మేదో విచారించాలి. ఆలోచించి విచారించ గలిగితే అవన్నీ వలస పక్షులే నని అర్థ మవుతుంది. అర్థం కానంత వరకే ఏదయినా సమస్య. అర్థ మైన క్షణాన సమస్య ఎక్క డుంటుంది? అది ఎక్కడ ఉండ దగినదో అక్కడికే పంప బడుతుంది. మనస్సు లోని బరువు తగ్గుతుంది. భారం తగ్గిన మనస్సు తేలిక పడుతుంది. అశాంతికి దూర మవుతుంది. ప్రశాంతతకు చేరు వవుతుంది. ఇదే చిత్త ప్రసాదము. ప్రసాద చిత్తము. మానస తపస్సు లోని మొదటి విశేషము.

### చిత్త ప్రసాదము

చిత్త ప్రసాదము అంటే, చిత్తము ప్రశాంతతను పొందడము అని భావము. మనస్సును స్వచ్ఛంగా ఉంచు

కోవడమే మనసు యొక్క ప్రశాంతత, లేదా మనస్సు యొక్క ప్రసాదము (**మనసః ప్రసాదః మనసః స్వచ్ఛ ప్రశాన్తిః స్వచ్ఛ తాపాదనం మనసః ప్రసాదః**). విషాదం లేని స్థితి ప్రసాదం. వికారం లేని స్థితి ప్రసాదం. తనలో తాను తానుగా తెలిసే ప్రశాంతత. నిర్మలత్వము. నిశ్చలత్వము. మనస్సులో ప్రసాదం ఏర్పడితే ఏం జరుగుతుంది (**ప్రసాదే సతి కిం స్యాత్ ఇతి**)?

మనస్సు ప్రసాదమయ మైతే అంతరంగము ఆనంద నిలయ మవుతుంది. శోకా లన్నీ కనుమరుగవుతాయి. బాధలన్నీ తీరి పోతాయి. బరువు లన్నీ దిగి పోతాయి. దుఃఖా లన్నీ దూర మవుతాయి.

**ప్రసాదే సర్వ దుఃఖానాం హాని రస్యోప జాయతే**

ప్రసాదం ప్రాప్తించ గానే మనస్సు లోని సర్వ దుఃఖములు నశించి పోతాయి (*2 వ అ - 65 వ శ్లో*). ప్రసన్న చిత్తము కలిగిన వెంటనే బుద్ధి నిలకడను పొందుతుంది. అంతవరకు చంచలంగా ఉన్న బుద్ధి స్థిరంగా, స్థిమితంగా ఉంటుంది. ఇదంతా ఈశ్వరారాధన లోనే ప్రాప్తిస్తుంది. ప్రాప్తించింది.

***మధుర హృదయాన కురిసింది స్తుతుల వాన***
***పరుగు లెత్తాయి దోషాలు మనసు లోన***
***మరువ లేను నీ దయ ఎన్ని జన్మ లైనా***
***నీ అడుగుల కడ పడి ఉందు నీలకంఠా!***

అని నీలకంఠ శతకంలో ఒక విబూది పండు.

**సౌమ్యత్వము**

సౌమ్యత్వము అంటే సామనస్యము. ప్రసన్నమైన ముఖ వర్చస్సు అనే కార్యానికి కారణమైన అంతఃకరణ వృత్తియే సౌమ్యత్వము. ముఖంలో స్పష్టంగా తొంగి చూచే అంతఃకరణ సౌందర్యము (**సౌమ్యత్వం సామనస్యమ్ ఆహుః ముఖాది ప్రసాద కార్య అంతఃకరణస్య వృత్తిః**). రాగద్వేషాలు తటస్థ పడిన దశలో మనస్సులో ఏర్పడే ప్రశాంతత ముఖము లోను, నేత్రముల లోను గోచరించడమే సౌమ్యత్వము. క్రౌర్యానికి కారణమైన పరిస్థితులు చిత్తములో లేనపుడు, మనస్సు అక్రూర మైనపుడు, కామక్రోధాల నుండి విడిపడి నపుడు సౌమ్యత్వము కనిపిస్తుంది (**అక్రూరః సౌమ్య ఉచ్యతే**). మనస్సుకు ముఖము ముకురము లాంటిది అనే ఆంగ్ల సామెత కూడా ఉంది. మనస్సు లోని భావాలే ముఖంలో ప్రతిఫలిస్తూ ఉంటాయి.

మనిషికి తీవ్రంగా కోపం వచ్చినపుడు, కళ్ళు ఎర్ర బడటము, పెదవులు చలించడము, ముచ్చెమటలు పోయడము, ముఖము ఉగ్రంగా మారడము లాంటివి ఎలా ప్రత్యక్షంగా గోచరిస్తాయో, అలాగే మనస్సులో ప్రశాంతత నిండి నపుడు, అదే ప్రశాంతత, లేదా ప్రసన్నత ముఖంలో కూడా గోచరిస్తుంది. అదే సౌమ్యత్వము.

పద్నాల్గవ శ్లోకంలో కాయక తపస్సును గూర్చి మనం చర్చించి నపుడు, శౌచమును బాహ్యాభ్యంతర మని చెప్పుకుంటూ, కాయక తపస్సు బాహ్య శౌచ మని తెలుసుకున్నాం. అభ్యంతర శుచిని గూర్చి తదనంతరం చర్చిద్దా మని చెప్పుకున్నాం. ఆ సందర్భము ఇదే నని జ్ఞాపకం చేస్తున్నాను.

అంతః శౌచము వలన మనస్సు స్వచ్ఛంగా ఉంటుంది. ఖేదము లేని కారణంగా మనస్సు ప్రియత్వ ముతో ఉంటుంది. ఆ ఆనందమే ముఖంలో వ్యక్త మవుతుంది. ఈ విషయాన్ని పతంజలి యోగదర్శనం కూడా ధ్రువ పరచింది.

సూ॥ **సత్త్వశుద్ధి సౌమనస్య ఏకాగ్ర్యేన్ద్రియ జయ ఆత్మదర్శన యోగ్యత్వాని చ** - (సాధన పాదము - 41 వ సూ)





చిత్తశుద్ధి, సౌమనస్యము (సౌమ్యత్వము), ఏకాగ్రత, ఇంద్రియ జయము, ఆత్మదర్శన యోగ్యత్వము - ఇవన్నీ క్రమంగా సిద్ధిస్తాయి అని పతంజలి యోగదర్శనము.

**మౌనము**

మౌనము అంటే వాక్కును నియమించడము. వాక్కును నిగ్రహించడమే మౌనము. అలాంటప్పుడు అది వాచిక తపస్సు అవుతుంది గాని, మానస తపస్సు ఎలా అవుతుంది? అనే సందేహము కలుగుతుంది.

మనస్సును నిగ్రహించ గలిగితేనే వాఙ్నిరోధము జరుగుతుంది. మనస్సు సంకల్పించిన దానినే వాక్కు మాట్లాడుతుంది. మనస్సు మూగబోయిన క్షణాన మాటలు కూడా మూగబోతాయి.

ఆకస్మిక సంఘటన జరిగి వ్యక్తి దిగ్భ్రాంతి చెంది నపుడు గాని, లేదా వ్యక్తి విషాదంలో నిమగ్న మైనపుడు గాని, మనం ఎంత కుదిపినా మాట్లాడ లేక మౌనంగా ఉండి పోతాడు. అలాంటి సన్నివేశాలలో అతని చేత మాట్లా డించడం ఎవ్వరికీ సాధ్యం కాదు. ఎందుకని మాట్లాడడు? మాటలు రాకనా? కాదు, మనస్సు లేక. సంకల్పించే మనస్సు సంతాపంలో కూరుకు పోయింది కనుక, మనస్సులో సంకల్పాలు కదలడం లేదు. మనస్సు సంకల్ప రహితం కావడం చేత, మాట్లాడటానికి విషయం లేక, మాటలు మూగ బోతాయి.

ట్యాప్ త్రిప్ప గానే నీళ్ళు వస్తున్నాయి అంటే ట్యాంక్‌లో నీళ్ళు ఉన్నాయి కనుక. ట్యాంక్‌లో నీళ్ళు లేనపుడు, ట్యాప్ త్రిప్పినంత మాత్రాన నీళ్ళు వస్తాయా? మాటలు కూడా అంతే. మనస్సును నిగ్రహిస్తేనే వాక్కును నియమించడం జరుగుతుంది.

వాక్కు కార్యం. మనస్సు కారణం. కార్యమైన వాక్కును నియమించడం అంటే కారణమైన మనస్సును నియమించడం అవుతుంది. కనుక వాచామౌనము అంటే మనఃసంయమ పూర్వక మనే అర్థం. అందువల్ల కార్యమైన వాచామౌనము చేత కారణమైన మనస్సంయమము చెప్పబడుతూ ఉంది (**మౌనం వాక్సంయమోఽపి మనస్సంయమ పూర్వకః భవతీతి కార్యేణ కారణ ముచ్యతే మన స్సంయమః మౌన మితి**).

**ఆత్మ వినిగ్రహము**

ఇక్కడ ఆత్మ అంటే మనస్సు. ఆత్మ వినిగ్రహము అంటే, మనస్సును నిగ్రహించుట అని అర్థము (**ఆత్మ వినిగ్రహః మనో నిరోధః**). సర్వేంద్రియముల నుండి మనస్సును వెనుకకు మరల్చి అంతర్ముఖం చేయడము మనో నిరోధము.

మనస్సును నియమించడ మనేది సులభమైన కార్యము కాదు. నునస్సు ఎక్కడి కైనా వెళ్తుంది. ఎక్కడైనా నిలుస్తుంది. కాని, భగవంతుని వైపుకు నడవదు. తపస్సులో నిలవదు. అలా నిలబడని మనస్సును నిగ్రహించి, ధ్యేయ వస్తువుపై నిలపడమే మనో నిగ్రహము.

మనస్సును నిగ్రహించాలి అనే దెవరు? మనస్సే కదా! ఇక్కడే ఉంది సమస్య అంతా. దొంగ దొంగను పట్టుకోవడమా! ఇది సాధ్య మయ్యే పనేనా? అందుకే మనస్సును నిగ్రహించడము ఎవ్వరికీ సాధ్య పడటం లేదు.

మనస్సు పరుగులు పెట్టడం సమస్య కాదు. అలా పరుగులు పెట్టడం మనస్సుకు సహజ లక్షణము. మనస్సు బహిర్ముఖమై పలు చోట్లకు పరుగు లిడితే నష్టం లేదు. కాని, దాని మార్గాన్ని ఇష్టపడి గాని; లేదా అది కష్ట మని భావించి దానిని నిగ్రహించ డానికి గాని, మనస్సు వెంట బడి మనం పరుగు లెట్టడమే అసలైన సమస్య.

తిరిగే మనస్సును తిరగనీ. దాని వెంట బడి పోకుండా దానిని సాక్షిగా వీక్షిస్తూ ఉండిపో గలిగితే, పోలీసు పరీక్షిస్తూ ఉంటే, దొంగ నిశ్చలంగా ఏ కార్యము లేకుండా ఉండి పోయినట్లు, మనస్సును మనం వీక్షిస్తే, మనస్సులో నడిచే సంకల్పాలను పరీక్షించ గలిగితే, మనస్సు చలించదు. చక్కగా నియమింప బడుతుంది. నిశ్చలంగా ఉండి పోతుంది. మనో నిగ్రహానికి ఇది రాజమార్గము. మనస్సును అలా నిరోధించడము మానస తపస్సు అవుతుంది.

**మాట వినని మనసును**
**నియమిస్తేనే యోగము**
**మనసే మనసును నియమించునా**
**విలపించే శిశువే లాలించునా?**
**తిరిగే మనస్సును తిరగనీ**
**చూస్తూ సాక్షిగా ఉండిపో**
**రామ రామ జయ రాజారామ్**
**రామ రామ జయ సీతారామ్**

అని రామజోగి చిట్కా.

### భావ సంశుద్ధి

ఇతరులతో వ్యవహరించే టప్పుడు కపటము లేకుండా, మాయ లేకుండా ప్రవర్తించడము భావ సంశుద్ధి (***భావ సంశుద్ధిః పరైః వ్యవహారకాలే అమాయవిత్వం భావ సంశుద్ధిః***). దీనినే పూర్వం మనం 'ఆర్జవం'గా చెప్పుకున్నాం. ఇదంతా మానస తపస్సు (***ఇతి ఏతత్ తపః మానసమ్ ఉచ్యతే***).

*త్రివిధ తపస్సులను తెలిపిన పరమేశ్వరుడు గుణ భేదాన్ని బట్టి వాటిని మళ్ళీ మూడుగా విభజించి చెబుతున్నాడు. మొదట సాత్త్విక తపస్సును గూర్చి చెబుతున్నాడు.*

శ్రద్ధయా పరయా తప్తం తప స్త త్రివిధం నరైః ।
అఫలాకాంక్షిభి ర్యుక్తైః సాత్త్వికం పరిచక్షతే ॥ 17

***శ్రద్ధయా-పరయా-తప్తం-తపః-తత్-త్రివిధం-నరైః***
***అఫలాకాంక్షిభిః-యుక్తైః-సాత్త్వికం-పరిచక్షతే***

| | | | | | |
|---|---|---|---|---|---|
| అఫలాకాంక్షిభిః | = | ఫలమును కోరని వారు | తత్ | = | ఆ |
| యుక్తైః | = | యోగముతో కూడిన వారు | త్రివిధం | = | మూడు విధములైన |
| నరైః | = | నరుల చేత | తపః | = | తపస్సును |
| పరయా | = | ఉత్తమమైన | సాత్త్వికం | = | సాత్త్వికముగ |
| శ్రద్ధయా | = | శ్రద్ధతో | పరిచక్షతే | = | చెబుతున్నారు |
| తప్తం | = | ఆచరింప బడిన | | | |

**అర్జునా! ఫలాపేక్ష లేని వారు, యోగయుక్తులు, ఉత్తమ మైన శ్రద్ధతో మూడు విధాలైన తపస్సులను ఆచరిస్తారు. అవి సాత్త్విక తపస్సులు.**



### వ్యాఖ్య

కాయక, వాచిక, మానస తపస్సు లనే త్రివిధ తపస్సులను వరుసగా మూడు శ్లోకాలలో తెలిపిన తరువాత, ఆ తపస్సులు గుణ భేదము చేత మళ్ళీ త్రివిధము లని చెబుతూ, ఆ మూడు విధాలైన సాత్త్విక, రాజస, తామస తపస్సులను గూర్చి చెబుతున్నాడు. ప్రస్తుతం ఈ శ్లోకంలో సాత్త్విక తపస్సును గూర్చి వివరిస్తున్నాడు.

కాయక, వాచిక, మానస తపస్సులు ఉత్కృష్టములు. ఈ త్రివిధ తపస్సులను ఉత్తమ మైన శ్రద్ధతో (***శ్రద్ధయా పరయా***), ఫలాసక్తి లేకుండా (***అఫలా కాంక్షిభిః***), సమాహిత చిత్తులై (***యుక్తైః***) ఆచరించడము సాత్త్విక తపస్సు.

### ఆస్తిక్య బుద్ధి

సాత్త్విక తపస్సు ఉత్తమ మైన శ్రద్ధతో కూడి ఉంటుంది. ఉత్తమ మైన శ్రద్ధతో ఆచరింప బడుతుంది. ఇంతకీ దేని యందు ఉత్తమ మైన శ్రద్ధ? శాస్త్రము దేనిని ప్రతిపాదిస్తూ ఉందో దాని యందు ఆస్తిక్య బుద్ధిని కలిగి ఉండటము ఉత్తమ మైన శ్రద్ధ. అంతే కాదు. శాస్త్ర విషయము నందు ఆస్తిక్య బుద్ధిని కలిగి ఉండాలి అంటే ముందు శాస్త్రం అర్థమై ఉండాలి కదా! మరి శాస్త్రం ఎలా అర్థ మవుతుంది? ఎవరికి వాళ్ళుగా శాస్త్రాన్ని తెలుసుకొనే అవకాశం లేదు కదా! (***స్వతః అప్రాప్తం***). అలాంటిది ఆచార్యోపదేశము వల్లనే అవగత మవుతుంది. కనుక శాస్త్రము నందు ఎలాంటి ఆస్తిక్య బుద్ధి ఉందో, శాస్త్రాన్ని ఉపదేశించే గురువు నందు కూడా అదే విధమైన ఆస్తిక్య బుద్ధిని కలిగి ఉండటము శ్రద్ధ అన బడుతుంది (***శ్రద్ధయా ఆస్తిక్య బుద్ధ్యా, పరయా ప్రకృష్టయా, తప్తమ్ అనుష్ఠితమ్***).

ఈ శ్రద్ధ స్వల్ప మైంది కాదు. అల్ప మైంది కాదు. గొప్పదైన శ్రద్ధ. ఉత్తమ మైన శ్రద్ధ (***పరయా***). పూర్ణమైన శ్రద్ధ. గమ్యము చేరే వరకు చెదరని శ్రద్ధ. లక్ష్యం సిద్ధించే వరకు చలించని శ్రద్ధ. ఇట్టి ఉత్కృష్ట మైన శ్రద్ధతో సాత్త్విక తపస్సు నాచరించే వారు ఫలాకాంక్ష లేని వారు. యోగముతో కూడిన వారు.

### అఫలాసక్తులు

మోక్ష కాములైన సాధకులు కర్మఫలాల యందు ఆసక్తి లేని వారు అనే విషయాన్ని గీతాబోధ ప్రారంభం నుండి చెప్పుకుంటూనే ఉన్నాము. వీరు మోక్షమునే ఏకైక ప్రయోజనముగా భావించి కర్మలను ఆచరిస్తున్నారు కనుక, ఇహ, పరలోక భోగాల యందు త్యాగబుద్ధిని కలిగి ఉన్నారు. ఫలాసక్తి లేని వారుగా తెలుస్తున్నారు.

కర్మల యందు ఫలాసక్తి లేకుండా, కేవలం అంతఃకరణ శుద్ధి కొరకే కర్మలను ఎలా ఆచరిస్తున్నారో, తపస్సు కూడా కర్మే కనుక, తపస్సు విషయంలో కూడా ఫలాసక్తి లేని వారై ఉన్నారు (***అఫలా కాంక్షిభిః ఫలా కాంక్షా రహితైః***). కేవలం అంతఃకరణ శుద్ధియే ప్రయోజనంగా కలిగిన వారు. ధర్మార్థ కామాల యందు ఆసక్తి లేని వారు. కనుకనే వారు యోగయుక్తులు.

### యోగయుక్తులు

యుక్తులు అంటే యోగయుక్తులు. సమాహిత చిత్తులు (***యుక్తైః సమాహితైః***). ఏకాగ్ర చిత్తులు. మనస్సులో ఏ విధమైన వికారము లేని వారు. అట్టి చిత్తముతో తపస్సు నాచరించే వారు కావడం చేత వారు యోగయుక్తులు. కాయక తపస్సు అయినా, వాచిక తపస్సు అయినా, మానస తపస్సు అయినా, నిర్వికారమైన మనస్సుతో ఆచరిస్తారు కనుక వారు యోగయుక్తులు. ఈ విధమైన తపస్సు సాత్త్విక తపస్సు అన బడుతుంది (***యత్ ఈదృశం తపః సాత్త్వికం పరిచక్షతే శిష్టాః***).

ఇక రాజస తపస్సును గూర్చి చెబుతున్నాడు.

**సత్కారమాన పూజార్థం తపో దమ్భేన చైవ యత్ ।**
**క్రియతే తదిహ ప్రోక్తం రాజసం చల మధ్రువమ్ ॥** 18

**సత్కారమాన పూజార్థం-తపః-దంభేన-చ-ఏవ-యత్**
**క్రియతే-తత్-ఇహ-ప్రోక్తం-రాజసం-చలం-అధ్రువం**

| | | | |
|---|---|---|---|
| సత్కార | = సత్కారము కొరకు | తత్ | = అది |
| మాన | = గౌరవము కొరకు | ఇహ | = ఈ లోకము నందు |
| పూజార్థం | = పూజ కొరకు | చలం | = నిలకడ లేనిదిగా |
| దంభేన చ ఏవ | = కేవలము డంబము చేత | అధ్రువం | = అస్థిర మైనదిగా |
| యత్ | = ఏ | రాజసం | = రజోగుణ సంబంధ మైనదిగా |
| తపః | = తపస్సు | ప్రోక్తం | = చెప్పబడింది |
| క్రియతే | = చేయబడుతుందో | | |

**అర్జునా! సత్కారం కోసం, సన్మానం కోసం, గౌరవాల కోసం డంబాచారంతో చేసే తపస్సు రాజస తపస్సు. ఆ తపస్సు చంచల మైంది. అస్థిర మైంది.**

**వ్యాఖ్య**

ఫలాసక్తి లేకుండా, కేవలం అంతఃకరణ శుద్ధి కొరకు ఆచరించే తపస్సు సాత్త్విక మైతే, కేవలం ఫలాసక్తియే ప్రధానంగా కలిగి చిత్తమును మలినం చేసుకొనే విధంగా ఆచరించే తపస్సు రాజస తపస్సు.

ఈ తపస్సు మోక్షార్థం కాదు. చిత్తశుద్ధికీ కాదు. మరి దేనికి? సత్కార మాన పూజార్థమే ఈ రాజస తపస్సు (*సత్కార మాన పూజార్థం*).

సత్కారము అంటే సాధుకారము. ఇతడు గొప్ప తపస్వి, గొప్ప సాధువు అని పది మంది గుర్తించి స్తుతించడము సాధుకారము (*సత్కారః సాధుకారః, సాధుః అయం తపస్వీ ఇతి ఏవం అర్థం*). దీనినే సత్కార వాంఛ అంటారు. ఇది సత్కార కాంక్ష. పదుగురు గౌరవించాలనే తపన.

ఎంత గొప్ప వాడండి! ఎంత గొప్ప తపస్వి అండి! అని పది మంది పొగిడితే గాని మనస్సు తృప్తి చెందదు. ఈ సత్కార వాంఛ ఎందుకు కలుగుతుంది? తనపై తనకు సద్భావం లేదు కనుక. సాధుభావం లేదు కనుక.

సత్కారం లాగే సన్మాన కాంక్ష. ఇక్కడ సన్మానము అంటే పాదపూజలు చేయించు కోవడం, అందరి చేత నమస్కారాలు పెట్టించు కోవడం - ఇదంతా సన్మాన కాంక్ష.

పెద్ద వాళ్ళను చూచి నపుడు గౌరవ సూచకంగా లేచి దగ్గరకు వెళ్ళి నమస్కరిస్తాము. దీనిని 'ప్రత్యుత్థానము' అంటారు. అలా అందరూ తనకు అభిముఖంగా వచ్చి గౌరవించాలని, ప్రత్యుత్థాన అభివాదనములు సమర్పించాలని ఆశిస్తూ, వాటిని పొందడానికి ఆచరించే తపస్సు రాజస మవుతుంది (*మానః మాననం ప్రత్యుత్థానాభి వదనాని, తదర్థం పూజా, తదర్థం చ తపః సత్కార మాన పూజార్థం*). అది కూడా డంబాచారమే. వేషభాష అలంకారాలతో గొప్ప తపస్వి అయినట్లు అగుపించడము. దండ ధ్వజ కమండలాదులు ధరించడము, ఉచితాసనాదులు అలంకరించడము - ఇవన్నీ దంభము కొరకే. ఇదంతా రాజస తపస్సు.





ఈ విధమైన రాజస తపస్సు చంచల మైనది (**చలం**). అనిత్య మైనది (**అధ్రువమ్**). ఈ విధమైన తపస్సుకు పార లౌకిక ఫలము ఎలాగూ లేదు, రాదు. పోనీ, ఇహ లోకానికి సంబంధించినవి అయినా వస్తాయా అంటే, అవి కూడా రావచ్చు, రాక పోవచ్చు. ఒక వేళ వచ్చినా క్షణికమే. అనిత్యమే (**సర్వం దుఃఖం దుఃఖం, సర్వం క్షణికం క్షణికం**).

ఇక తామస తపస్సును గూర్చి వివరిస్తున్నాడు.

**మూఢగ్రాహే ణాత్మనో యత్పీడయా క్రియతే తపః ।**
**పర స్యోత్సాదనార్థం వా త త్తామస ముదాహృతమ్ ॥** 19

**మూఢగ్రాహేణ-ఆత్మనః-యత్-పీడయా-క్రియతే-తపః**
**పరస్య-ఉత్సాదనార్థం-వా-తత్-తామసం-ఉదాహృతం**

| | | | |
|---|---|---|---|
| మూఢగ్రాహేణ | = మూర్ఖపు పట్టుదల చేత | తపః | = తపస్సు |
| ఆత్మనః | = ఆత్మ యొక్క | క్రియతే | = చేయబడుతుందో |
| పీడయా | = పీడచే గాని | తత్ | = అది |
| పరస్య | = ఇతరుల యొక్క | తామసం | = తామస తపస్సని |
| ఉత్సాదనార్థం వా | = నాశనము కొరకు గాని | ఉదాహృతం | = చెప్పబడుతుంది |
| యత్ | = ఏ | | |

**అర్జునా! మూర్ఖపు పట్టుదలతో తనకు, లేదా ఇతరులకు వినాశాన్ని కలిగించ డానికి చేసే తపస్సును తామస తపస్సు అంటారు.**

**వ్యాఖ్య**

గుణ భేదాన్ని బట్టి సాత్త్విక తపస్సును, రాజస తపస్సును వివరించిన గీతాచార్యుడు ప్రస్తుత శ్లోకంలో తామస తపస్సును గూర్చి చెబుతున్నాడు.

తపస్సు అనేది తాపాన్ని, సంతాపాన్ని కలిగిస్తుంది. తపింప చేస్తుంది కనుక అది తపస్సు (**తపతీతి తపః**). తపింప చేసేది ఏదైనా సంతాపాన్ని, దుఃఖాన్ని కలిగించేదే (**తప సంతాపే**). మీకేం తెలుసండి? ఆ ఉద్యోగాన్ని సంపాదించ డానికి నే నెంత తపస్సు చేశానో! అని ఇతరులు అనడం మనం వింటూ ఉంటాము. ఉద్యోగానికి తపస్సు చేయడ మేమిటి? ముక్కు మూసుకొని కూర్చుంటే ఉద్యోగా లొస్తాయా! నిజమే. కాని, ఇక్కడ తపస్సు అంటే, ఇంట్లో కూర్చుని తపస్సు చేశాడని కాదు. ఉద్యోగాన్ని సంపాదించ డానికి కాళ్ళు అరిగే లాగా తిరిగాడని అర్థం. నోరు వాచే లాగా అందరిని ప్రాధేయ పడ్డాడని భావము. ఇదంతా కష్టమే కదా? అందుకే తపస్సు అన్నాడు.

తపస్సు అనేది శ్రమతో కూడింది అయినపుడు ఫలితం లేని దైతే ఎవడు శ్రమిస్తాడు? శ్రమకు ఫలితం ఉండాలి. ఉంటుంది. సాత్త్విక, రాజస తపస్సులు ఏ ఫలితాన్ని ఆశించి సాగుతాయో చూశాము. మరి, తామస తపస్సు యొక్క ఫలిత మేమిటి? తమోగుణ ప్రధానులై, తామసిక శ్రద్ధతో తామస తపస్సు నాచరించే వారు పొందే ఫలం ఏమిటి? ఈ శ్లోకంలో అదే కేంద్ర విషయం. వినండి.

తనను తాను పీడించు కోవడానికి, అంటే బాధ పెట్టు కొనుటకు చేసే తపస్సును (**ఆత్మనః పీడయా యత్తపః క్రియతే**), లేదా ఇతరులను పీడించడానికి, లేదా ఇతరుల వినాశానికి చేసే తపస్సును (**పరస్య**

***ఉత్పాదనార్థం వా )*** తామస తపస్సు అంటారు. ఒక్క వాక్యంలో చెప్పాలంటే, స్వవినాశం, పరవినాశం ఈ రెండే తామస తపస్సు యొక్క ప్రయోజనాలు.

తపస్సు చేసిన వాళ్ళు ఏవేవో అద్భుత మైనవి సాధించారని, సాధిస్తారని విన్నాం. అంతే గాని తపస్సు చేసి దీపాలు ఆర్పేసుకునే వాళ్ళను ఇక్కడే చూస్తున్నాం. ఇలాంటిది తపస్సు ఎలా అవుతుంది? తపస్సులా అనిపించే తమస్సు. అంతే.

ఇదేదో చాలా విడ్డూరంగా ఉందే! పరులను పాడు చేసే వాళ్ళ విషయాన్ని అర్థం చేసుకోగలం. కాని, స్వవినాశాన్ని, స్వయం వినాశాన్ని బుద్ధి ఉన్న వాళ్ళు ఎవ్వరైనా కాంక్షిస్తారా? అనే సందేహం మీకు రావచ్చు. మీ సంశయానికి సమాధానం మీ వాక్యం లోనే ఉంది కదా! బుద్ధున్న వాళ్ళు కాంక్షిస్తారా? అంటే, బుద్ధి లేని వాళ్ళు కాంక్షిస్తారనే కదా దాని అర్థం? వాళ్ళే ఈ తామస తపస్సు రాయుళ్ళు. మూఢులు. మూర్ఖులు. మూఢ నిర్ణయాలు తీసుకునే వాళ్ళు. మూర్ఖంగా ఆచరించే వాళ్ళు. అలాంటి వాళ్ళు తమ మూఢ నిర్ణయాలతో ***( మూఢ గ్రాహేణ అవివేక నిశ్చయేన ).*** అవివేక నిశ్చయాలతో తెలియక తమను తాము నశింప చేసుకుంటారు. తెలిసి ఇతరులకు వినాశాన్ని కలిగిస్తారు. ఈ విధమైన తపస్సును తామస తపస్సు అంటారు.

## స్వపీడనం

తామస తపస్సు మూఢంగా ఆచరించేది కనుక దారుణంగా ఉంటుంది. అదే ఉగ్ర తపస్సు. భయంకర మైనది. ఆహారం లేకుండా శరీరాన్ని శుష్కింప చేసుకునేది. శీతోష్ణాలను భరిస్తూ దుర్భరమైన కాయ క్లేశంతో ఆచరించేది. ఇంద్రియాలను శోషింప చేసేది. నిద్ర పానీయాదులను సైతం విసర్జించి, మనస్సును క్షోభకు గురి చేస్తూ, అసహజమైన జీవన మార్గంలో ప్రాణాల్ని సైతం కలత పెట్టే బీభత్సమైన తపస్సు తామస తపస్సు.

ఎవరైనా తమను తాము ఇలా పీడించు కుంటారా? వీళ్ళు మాత్రం ఎందుకని ఇలా దుఃఖాన్ని అనుభవిస్తున్నారు? అవివేకం చేత. అవివేకముతో కూడిన నిర్ణయాల వల్ల ఇలా అన్యాయమై పోతున్నారు ***(అవివేక నిశ్చయేన ).***

ఏమి చేయాలి? ఎలా చేయాలి? అది చేయదగిం దేనా, కాదా? ఈ విధమైన విచారము లేకుండా, దారి తప్పిన ఆలోచనలతో స్వార్థ పూరితమైన బుద్ధితో, వినాశ మార్గాలలో చరిస్తూ ఘోరమైన తామస తపస్సులను ఆచరిస్తారు. దేహేంద్రియ మనస్సులను శుష్కింప చేసుకొంటూ వీరూ దుర్భర దుఃఖాన్ని అనుభవిస్తారు. ఈ తపస్సు వెనుక ఉన్నదంతా మూఢత్వమే, మూర్ఖత్వమే కనుక ఇతరుల వినాశానికి కూడా కారణ మవుతారు.

## పర పీడనం

రావణాసురుడు ఎంత ఘోరమైన తపస్సు చేశాడు! చివరికి ఏమైంది? అతని తపః ఫలము ఎవరి మేలుకు ఉపకరించింది? తన వినాశానికి, పరుల వినాశానికి ఉపయోగ పడింది. అందుకే అది తామస తపస్సు.

తాను చేసిన ఉగ్ర తపస్సు ఫలంగా ఎన్నో భయంకరమైన అస్త్ర శస్త్రాలను రావణుడు సంపాదించాడు. వాటి వల్ల ఏం జరిగింది? అస్త్ర శస్త్రాలు రావణుడి వద్ద నేనా ఉండేది? శ్రీరాముడి వద్ద లేవా? హనుమంతుని వద్ద లేవా? విభీషణుడి వద్ద లేవా? ఆయుధాలకు బాధించడం తెలియదు. అస్త్రశస్త్రాలకు హింసించడం అర్థం కాదు. వాటిని పట్టుకున్న చేతులే చెడును చేస్తాయి. మారణహోమాలను సృష్టించేది మనుషులే కాని, ఆయుధాలు కాదు. అసుర మానవుల చేతిలో మారణాయుధాలు చేరితే లోకం ఏమవుతుందో ఆనాటి రావణాది రాక్షసుల





నుండి ఈ నాటి రాక్షస ఉగ్రవాదుల దాకా నిరూపించ బడుతూనే ఉంది. అప్పుడూ వినాశమే. ఇప్పుడూ వినాశమే. తామస తపస్సు ఏ రూపంలో సాగినా అది స్వపీడనం గానో, పర పీడనం గానో పరిణామం చెందక తప్పదు. తామస తపఃఫలాలు ఆగంతుకుల చేతుల్లో అణుబాంబు ల్లాగే ఉపయోగ పడతాయి. నేడు ఆ ఫలితాలు యంత్ర రూపంలో కనిపిస్తే, ఆనాడు మంత్ర రూపంలో, శబ్ద రూపంలో వినిపించాయి. అదే తేడా. మంత్ర రూపంలో ఆనాడు వినపడుతూ వినాశాన్ని సృష్టించాయి. యంత్ర రూపంలో నేడు కనపడుతూ కల్లోలాన్ని సృష్టిస్తున్నాయి.

ఈ సందర్భములో ఒక్క సత్యాన్ని మనస్సుకు పట్టించాలి. తామస యజ్ఞాలు, తామస తపస్సులు, తామసాహారాలు, ఇక చెప్పబోయే తామస దానాలు - ఇవన్నీ చెప్పడంలో ముఖ్యోద్దేశ్యము, ఎట్టి పరిస్థితుల లోను ఆ నీడల్లో విశ్రమించ వద్దని సూచించడమే. ఒకవేళ రజోగుణ, తమోగుణాలు మనలో ఉంటే, వాటిని శ్రమించి అయినా పోగొట్టుకొనే ప్రయత్నం చేయాలి. ప్రార్థనల ద్వారా పరమేశ్వరునికి దగ్గర కావాలి. వేడికి మనం దగ్గ రవుతూ ఉంటే, చలి మనకు దూర మైనట్లు, పరమేశ్వరుని భక్తి చేస్తూ ఉంటే తామస, రాజసాలు మనస్సును విడిచిపెట్టి పోతాయి.

*అపచారాలకు ఆలవాల మైతి*
*అనాచారాలే అలవాట్లుగా మారి పోయె*
*నీ కృప ఉన్న క్షణములో అవి పారిపోవా!*
*నీ అడుగుల కడ పడి ఉందు నీలకంఠా!*

అని నీలకంఠ శతకంలో ఒక విబూది పండు.

*యజ్ఞ, తపస్సుల భేదాన్ని తెలియ చేసిన భగవంతుడు, గుణ భేదాన్ని బట్టి త్రివిధ దాన భేదాన్ని వివరించడం ప్రారంభిస్తున్నాడు. మొదట సాత్త్విక దానమును చెబుతున్నాడు.*

**దాతవ్య మితి య ద్దానం దీయతేఽనుపకారిణే ।**
**దేశే కాలే చ పాత్రే చ త ద్దానం సాత్త్వికం స్మృతమ్ ॥** 20

*దాతవ్యం-ఇతి-యత్-దానం-దీయతే-అనుపకారిణే*
*దేశే-కాలే-చ-పాత్రే-చ-తత్-దానం-సాత్త్వికం-స్మృతం*

దేశే = దేశము నందు
కాలే చ = కాలము నందు
పాత్రే చ = తగిన పాత్ర యందు
అనుప కారిణే = ప్రత్యుపకారము చేయలేని వాని కొరకు
దాతవ్యం ఇతి = ఇవ్వదగినదే యని
యత్ = ఏ
దానం = దానము
దీయతే = ఇవ్వబడు చున్నదో
తత్ = ఆ
దానం = దానము
సాత్త్వికం = సాత్త్విక మని
స్మృతం = చెప్పబడింది

**అర్జునా! దానము చేయ దగింది అని నిశ్చయించుకొని, ప్రతిఫలాపేక్ష లేకుండా, దేశ కాల పాత్రలను గుర్తించి చేసే దానము సాత్త్విక దానము.**

**వ్యాఖ్య**

గుణ భేదాన్ని బట్టి మూడు విధము లైన తపస్సులను గూర్చి చెప్పుకున్నాం. అలాగే దానము కూడా

సాత్త్విక మని, రాజస మని, తామస మని మూడు విధాలుగా ఉంది. ముందుగా సాత్త్విక దానమును గూర్చి చెబుతున్నాడు.

దానము అంటే ఇవ్వ వలసింది, ఇవ్వ దగినది అని అర్థము (**దాతవ్యం ఇతి దానమ్**). ఎవరికి ఇవ్వ దగింది దానము? ప్రత్యుపకారము చేయని, చేయ లేని వానికి ఇవ్వ దగింది దానము (**అనుపకారిణే**). త్యాగ రూపమైన ఈ దానము ఎక్కడ ఇవ్వ దగింది? ఎప్పుడు ఇవ్వ దగింది? ఎలా ఇవ్వ దగింది? అనే ప్రశ్నలకు సమాధానంగా దేశ, కాల, పాత్రాదులను అనుసరించి ఇవ్వ దగింది (**దేశకాలే చ పాత్రే చ**) అని చెప్పబడుతూ ఉంది. ఈ విధమైన దానము సాత్త్విక దానము.

## దానము - ధర్మము

దానము అనే విషయాన్ని ముచ్చటించే టప్పుడు 'దానధర్మాలు' అంటూ సమాస పదాన్ని సహజంగా వాడుతూ ఉంటాము. ఇచ్చేది దానం, చేసేది ధర్మం. చేసేది అంటే ఆచరించేది. ఈ రెండిటిని ఏకం చేసి చెప్పు కుంటాము.

ఒకరికి ఇచ్చేది దానం. తాను స్వయంగా ఆచరించేది ధర్మం. దానాన్ని ఇవ్వగలం గాని ధర్మాన్ని ఎలా ఇవ్వగలం? తల్లిదండ్రులను పూజించడము బిడ్డగా నా ధర్మము. కనుక నేను పూజా విధిని నిర్వహిస్తాను. ఆచరిస్తాను. దానిని ఇవ్వడ మెలా? అలాంటప్పుడు దానధర్మాలు అని ఎందుకు అంటున్నాము? ఇది అర్థ మైతేనే దానం ఏమిటో, ప్రధానంగా సాత్త్విక దానం ఏమిటో అర్థ మవుతుంది.

చేసేది దానమే. కాని, దానిని తన ధర్మంగా గుర్తించి చేయాలి. నువ్వు చేసేది దానము. నీ చేత దానం చేయించేది ధర్మము. కనుక తన ధర్మంగా గుర్తించి చేసేదే దానము. నేను ఉన్న వాణ్ణి. లేని వాడికి దానం చేస్తున్నాను అని కాకుండా, దానం చేయడం నా ధర్మం అనే దృఢ భావనతో చేసినపుడు, దానాన్ని పుచ్చుకొనే వాడు లేని వాడు కాడు. నీ ధర్మాన్ని నీవు ఆచరించ డానికి అవకాశం ఇచ్చే 'పుణ్యం' ఉన్న వాడుగా నీకు కనిపిస్తాడు. ఇక్కడే దానకర్మ దైవకర్మగా మారుతుంది. 'కృష్ణార్పణం - రామార్పణం - శివార్పణం' అనే పవిత్ర వాక్యాలు వేదమంత్రాల లాగా వీనులలో ధ్వనిస్తాయి.

ఎవరు ఎవరికి ఏది ఇచ్చినా తమ వద్ద ఉన్నదే ఇస్తారు. లేనిది ఎలా ఇస్తారు? ఆ ఉన్న దేదో, అది మన వద్ద ఎందు కుంది? అని ప్రశ్నించుకుంటే, ఇవ్వ దగింది కనుక ఉంది (**దాతవ్యం**). పెట్టుకొనేందుకు ఉంది. పరులకు పెట్టుకొనేందుకు ఉంది అనేది అర్థం అవుతుంది. ఇది అర్థం కానపుడు, దాచి పెట్టుకొనేందుకు ఉంది అన్నట్లు అర్థ మవుతుంది.

ఉన్నది మనది కాదు. పరులకు పెట్టుకున్నదే మనది. దానగుణము లేని వారు ధన మున్నా లేని వారే. ఇవ్వ లేనిది మన వద్ద ఉంది అంటే, ఆ ఉన్నది ఏదైనా అది మనది కాదు. మన దైతే ఎందుకు ఇవ్వ లేము? ఇచ్చే శక్తి మన కున్నప్పుడే అది మన దవుతుంది. మన దైనపుడే దానిని మనం ఇవ్వ గలము. మన వద్ద ఉండి, మనది కానిదిగా ఉండినది, మన చేత ఇవ్వబడి పరుల వద్ద మనదిగా, మన 'పుణ్యం'గా శోభిస్తుంది. ఇదే దాన వైభవం. కనుకనే ఇచ్చేది దానం. ఇప్పించేది ధర్మం (**దాతవ్యం**). ఇవే దానధర్మాలు.

## సమర్పణ భావం

దానం ఎలా చేయాలి? శ్రద్ధతో చేయాలి. అశ్రద్ధతో చేయ కూడదు అన్నది ఉపనిషత్తు (**శ్రద్ధయా దేయం అశ్రద్ధయాఽ దేయం**). శ్రద్ధతో దానకర్మను ఆచరించడము అంటే, సమర్పణ భావంతో ఇవ్వడము అని





అర్థము. పుచ్చుకొనే వ్యక్తిలో ఆ వ్యక్తిని మించి మరేదో దర్శిస్తూ చేసి నపుడే దాన కర్మ సమర్పణ భావముతో ముడిపడి ఆరాధనగా శోభిస్తుంది. ఈశ్వరారాధనగా భాసిస్తుంది.

ప్రపంచంలో పంచి పెట్టడానికి ప్రపంచానికి మనం ఏమి తీసుకొని వచ్చాం? తల్లి గర్భం నుండి రిక్త హస్తాలతో వచ్చాం. ఏమీ లేని వాళ్ళం అంటూ ఏడుస్తూ మరీ వచ్చాం. విన వలసిన వాడు మన ఏడుపును విన్నాడు. దయ తలచి మన జీవితంలో వెలుగులు పూయించాడు. వేడుకలను ఆవిష్కరించాడు. దాని ఫలితంగా ఏదో ఉన్న వాళ్ళంగా ఈ రోజు ఉన్నాం. ఇచ్చిన వాణ్ణి మరచి పోకుండా, అతడు ఇచ్చిన దానిని పుచ్చుకోవడంతో పాటు, ఇచ్చే గుణాన్ని కూడా అక్కడి నుండే, అతని నుండే అంది పుచ్చుకోవాలి. అప్పుడే సంపదలలో సమర్పణలు చోటు చేసుకుంటాయి. మనం ఎవరికి ఏది ఇచ్చినా, మనం పుచ్చుకున్నదే ఇస్తున్నాము అనే ధర్మ స్పృహ ఉంటుంది. అంతేకాదు. ఇచ్చిన వాడికే తిరిగి సమర్పించు కుంటున్నాము అనే దైవ స్పృహ కూడా తోడుంటుంది. ఇక్కడే ఇచ్చే వన్నీ సమర్పణలు అవుతాయి. దానాలు ధర్మాలుగా శోభిస్తాయి.

## హారతి కర్పూరం

పువ్వులు పంచే మొక్కకు, పండ్లు పెట్టే చెట్టుకు ఎవరైనా నీళ్ళు పోస్తారు. ఆ పని కూడా చేయకుండా కేవలం పువ్వులు కోసుకునే బుద్ధులను, కాయలు ఏరుకునే ప్రబుద్ధులను గూర్చి నేను మాట్లాడటం లేదు. వారు చర్చనీయులు కారు. వారికి చోటు లేని చర్చ ఇది.

కాని, నీళ్ళు పోసే వారు కూడా, అలాంటి ప్రబుద్ధులు కాకపోయినా, త్యాగులని మాత్రం చెప్ప లేము. ఎందుకని? పూలు పూయని మొక్కలకు, కాయలు కాయని చెట్లకు వీళ్ళు నీళ్ళు పోస్తారా? ప్రత్యుపకారం ఆశించి సాగే చర్యలు త్యాగానికి ప్రతిరూపా లెలా అవుతాయి? ఏ విధమైన ప్రత్యుపకారాన్ని ఆశించకుండా, మొక్కలకు, చెట్లకు నీళ్ళు పోయాలి అంటే, వ్యక్తి ఉన్నతుడై ఉండాలి. ధర్మరూపుడై ఉండాలి. అప్పుడే చేయ గలడు. అలాంటి కార్యాన్ని ఒక్క మేఘమే చేయ గలదు. ఎత్తైన ప్రదేశమున ఊరేగే మేఘమే చేయ గలదు. కనుక ధర్మ మేఘాలై శోభించే వారే వర్ష రూపంలో దానాలు చేస్తారు. ఇవన్నీ ప్రతిఫలం ఆశించని పవిత్ర కార్యాలు. హారతి కర్పూరాలు. కర్పూర హారతులు. ఆకాశంలో పక్షి జాడ ల్లాంటివి. ప్రవహించే గంగా జలాలపై వ్రాయబడిన ప్రణవాక్షరాల వంటివి. కనుకనే, ప్రత్యుపకారమును ఆశించకుండా చేయ దగింది కనుక దానిని సాత్త్విక దానము అంటున్నాడు భగవంతుడు (**దాతవ్యం ఇతి యద్దానం దీయతే అనుపకారిణే**).

## గ్రహీత - అనుగ్రహీత

ఇచ్చే వాడు దాత. పుచ్చుకొనే వాడు గ్రహీత. దాన మిచ్చే వాడు ఇవ్వ దగిందే ఇస్తున్నాడు అని తెలుసు కున్నాం. అలాంటప్పుడు దాత ప్రత్యుపకారాన్ని ఎలా ఆశిస్తాడు? ప్రత్యుపకారాన్ని ఆశించి చేసేది దాన మెలా అవుతుంది? వ్యాపార మవుతుంది. చేసే దానము పెట్టుబడి కాగా, ప్రత్యుపకార ఫలం ఆదాయ మవుతుంది. ఇక్కడ దాన క్రియ ఎక్కడుంది? కనుక ప్రత్యుపకారము చేయని, చేయలేని వానికి (**ప్రత్యుపకార అసమర్థాయ**) ఇచ్చి నపుడే అది దానం అవుతుంది. మరి, ప్రత్యుపకారం చేసే శక్తి గల వారికి, వారి అవసరాన్ని దృష్టిలో పెట్టుకొని చేసేది దానకర్మ కాదా? అవుతుంది. కాకపోతే, పుచ్చుకొనే వాడికి ప్రత్యుపకారం చేసే శక్తి ఉన్నా, ఇచ్చే వాడు ఫలాపేక్ష లేకుండా ఇచ్చి నపుడే అది దాన మవుతుంది (**సమర్థాయాపి నిరపేక్షం దీయతే**).

ఈ విధమైన దానకర్మలో సర్వత్ర ధర్మ స్పృహే ఉంటుంది, దైవ భావనే నిండు కుంటుంది కనుక, ఇటు దాత హృదయం ఆనంద రస ప్లావిత మవుతుంది, ఆహ్లాదంతో తృప్తి చెందుతుంది; అటు దానమును స్వీకరించిన వ్యక్తి గ్రహీతగా కాకుండా అనుగ్రహీతగా కనిపిస్తాడు.

## దాన ధర్మాలు - దేశకాలాలు

దానధర్మాలు ఎక్కడ చేయాలి? ఎప్పుడు చేయాలి? ఎవరికి చేయాలి? ఈ విషయాలను దృష్టిలో ఉంచుకొని చేసి నపుడే అవి సాత్త్విక దానాలు అవుతాయి. ఏ కార్యాని కైనా సమయాలు, నియమాలు ఉంటాయి. వాటిని దృష్టిలో పెట్టుకొని ఆచరించి నపుడే కార్యాలు పూర్ణ రూపంతో శోభిస్తాయి. ముఖ్యంగా దాన ధర్మాల వంటి పవిత్ర కార్యాలు పవిత్రమైన ప్రదేశాలలో, పుణ్య కాలాల లోనే పూర్ణత్వాన్ని సంతరించు కుంటాయి.

మొదటిది దేశము. దేశము అంటే ప్రదేశము అని అర్థం. దానాలు ఏ ప్రదేశాలలో చేస్తే యుక్తము? పుణ్య ప్రదేశాలలో ఆచరించడం శ్రేయస్కరము అన్నది శాస్త్రం. ఏవి ఆ పుణ్య ప్రదేశాలు? కురుక్షేత్రము మొదలైన ప్రదేశాలు అన్నారు భాష్యకారులైన శ్రీ శంకరులు ***(దేశేపుణ్యే కురుక్షేత్రాదౌ)***. 'కురు క్షేత్రాదౌ' అనడం వల్ల కురుక్షేత్రం లోనే చేయాలని అర్థం కాదు. కురుక్షేత్రం అనేది ఉపలక్షణం మాత్రమే. దైవ సన్నిధిలో చేయడం శ్రేష్ఠము అనేదే దాని ఉద్దేశ్యము.

కురుక్షేత్రంలో భగవంతుడు గీతను బోధించాడు కనుక, ఆ ప్రదేశం పుణ్య ప్రదేశ మైంది. జ్ఞానమయ మైంది. కనుక అక్కడ త్యాగ పూరితమైన దానకర్మను నిర్వర్తించడం ప్రశస్తము. పవిత్రము.

అలా చూచి నపుడు గీతా ప్రబోధాలు జరిగే ప్రదేశా లన్నీ కురుక్షేత్రాలే. జ్ఞాన క్షేత్రాలే. అక్కడ నిర్వహించే దానా లన్నీ పవిత్ర మైనవే. ఆలయ ప్రదేశాలు, ఆశ్రమ ప్రదేశాలు, కాశీ ప్రయాగాది క్షేత్రాలు, గంగా యమునా ఇత్యాది నదీ తీరాలు - ఇవన్నీ దానయోగ్య ప్రదేశాలే.

వరద ముప్పుకు గురైన ప్రాంతాలు, కరువు కాటకాలు సంభవించిన ప్రదేశాలు, విద్యాలయాలు, వైద్య శాలలు - ఇవన్నీ దాన యోగ్య ప్రదేశాలే. కారణం, ఆయా ప్రదేశాలలో దానమును గ్రహించ డానికి యోగ్యు లైన వారు లభిస్తారు. కనుక, అక్కడ చేసిన దానం సత్పాత్ర దానమై సత్కర్మగా శోభిస్తుంది.

దానయోగ్య ప్రదేశాల లాగే దానయోగ్యమైన కాలాలు కూడా ఉన్నాయి. ఆయా కాలాలలో నిర్వహించే దానాలు సాత్త్వికాలై భాసిస్తాయి. ఆ కాలాలు ఏవి అంటారా? సంక్రాంతి మొద లైనవి అన్నారు ఆచార్యులు ***(కాలే సంక్రాన్త్యాదౌ )***. అంటే, ఉత్తరాయణ పుణ్య కాలము, గ్రహణ సమయాలు, పర్వదినాలు, అలాగే జీవితంలో ప్రధానమైన జనన, మరణ, వివాహాది తిథులు మొదలైన కాలాలలో దానధర్మాలను నిర్వహించ వచ్చు. అవన్నీ ప్రశస్త మైనవే. ప్రాధాన్యత కలిగినవే.

దేశము, కాలము తరువాత పాత్ర విషయము. ఎవరికి దానం చేయాలి? ఈ ప్రశ్న లోనే ఎవరికి దానం చేయ కూడదు? అనేది కూడా అంతర్లీనంగా ఉంది. దానిని కూడా శాస్త్రం విస్పష్టం చేసింది.

దానము సత్పాత్రమై ఉండాలి. జ్ఞానులు, సాధువులు, వృద్ధులు, బిచ్చగాళ్ళు, రోగులు, వికలాంగులు, పేద విద్యార్థులు - వీరందరూ దాన యోగ్య గ్రహీతలే. ఇదంతా సత్పాత్ర దానమే. ఇక ఎవరికి దానం చేయ కూడదు? అనే విషయాన్ని సందర్భాను సారంగా ఇక్కడ ప్రస్తావించానే గాని, ఆ ప్రసంగ మంతా తరువాత రాజస తామస దానాలను చర్చించే టప్పుడు వివరిస్తాను.

## ఆత్మ సమర్పణము

కాకులను పిలిచి తినిపిస్తూ ఉండు, ఒకనాడు పిలవకుండానే హంస లొస్తాయి ఆరగించడానికి అనే వారు మన పెద్దలు. మనం చేసే దానాలు చిన్నవే అయినా, ఒకనాడు ఆ దానక్రియల వెనుక ఉండే త్యాగ గుణము విస్తరించి, విశాలమై, మహాత్యాగానికి, ఆత్మ సమర్పణమునకు, అటుపై మహోన్నతమైన మోక్ష సన్యాసానికే దారి తీస్తుంది. అందుచేత దాన గుణము మన సంస్కృతిలో దివ్య గుణమై శోభించింది.





దానము అంటే ధనమే కానవసరం లేదు. 'ఇవ్వ దగింది' అని మనస్సుతో నిశ్చయించుకొని ఇచ్చే దంతా దానమే అవుతుంది. కొందరు అన్నదానం చేస్తారు. కొందరు వస్త్రదానం చేస్తారు. కొందరు గోదానం చేస్తారు. కొందరు భూదానం చేస్తారు. కొందరు గృహదానం చేస్తారు. కొందరు సువర్ణదానం చేస్తారు. దానాలలో కన్యాదానం శ్రేష్ఠ మైనదని చెబుతారు. అన్నిటి కన్నా ఉన్నతమైన, మహోన్నత మైన దానము జ్ఞానదానము. జ్ఞాన దానమునకు మించిన విశిష్ట దానము మరొకటి లేదు.

'నాది' అని భావించి నంత కాలము దేనినీ త్యాగము చేయ లేము. 'నాది' అనేది మమకారము. మమకారమే బంధము. నిర్మమకారమే మోక్ష రూపము అన్నది శాస్త్రం ***( మమేతి బధ్యతే జంతుః నిర్మమేతి విముచ్యతే )***. ముందు మమకారం తొలగితే, ఆ తరువాత అహంకారం తొలగుతుంది. 'నాది' అనేది ముందుగా పోతే, 'నేను' అనేది తరువాత పోతుంది. 'నాది' అనేది కర్మయోగంతో పోతుంది. 'నేను' అనే దానిని జ్ఞానము నశింప చేస్తుంది. 'నేను' అనే దేహాత్మ భావాన్ని ఒకనాడు త్యాగం చేయాలి అంటే, ముందుగా ఈ పవిత్రమైన సాత్త్విక దానాలను అలవరచు కోవాలి. ఈ కారణం గానే కాశికి పోయి ఏమి విడిచి వచ్చావు? అని అడుగుతూ ఉంటారు. కాయలను, పదార్థాలను గంగలో త్యాగం చేస్తూ, ఒకనాడు కాయమును, దేహాత్మ భావనను జ్ఞాన గంగలో త్యాగం చేస్తా రనేదే మనీషుల మనోభావం. అందుకే ఈ సాత్త్విక దానము.

**కాశి గంగలో కాయ విడిచితే**
**కైలాసము క్రిందికి దిగి రాదు**
**కాయముపై మమకారము తొలగితే**
**కన్నుల ముందే కైవల్యము**
**న్యాయము తెలిసిన త్యాగములో**
**పండును బ్రతుకు ఇది సత్యము**
**రామ రామ జయ రాజారామ్**
**రామ రామ జయ సీతారామ్**

అని రామజోగి చిట్కా.

*ఇక, రాజస దానాన్ని వివరిస్తున్నాడు.*

**య త్తు ప్రత్యుపకారార్థం ఫల ముద్దిశ్య వా పునః ।**
**దీయతే చ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతమ్ ॥** 21

***యత్-తు-ప్రత్యుపకారార్థం-ఫలం-ఉద్దిశ్య-వా-పునః***
***దీయతే-చ-పరిక్లిష్టం-తత్-దానం-రాజసం-స్మృతం***

| | | | |
|---|---|---|---|
| ప్రత్యుపకారార్థం | = ప్రత్యుపకారము కొరకు గాని | దీయతే చ | = ఈయబడు చున్నదో |
| పునః | = మరల | తత్ | = ఆ |
| ఫలం | = ఫలమును | దానం తు | = దానము |
| ఉద్దిశ్య వా | = ఉద్దేశించి కాని | రాజసం | = రాజస మని |
| పరిక్లిష్టం | = అతి కష్టముతో | స్మృతం | = చెప్పబడినది |
| యత్ | = ఏది | | |

**అర్జునా! ప్రత్యుపకారాన్ని ఆశిస్తూ, ఫలాపేక్షతో, దుఃఖ పడుతూ చేసే దానము రాజస దానము.**

**వ్యాఖ్య**

చేయ వలసింది, చేయ దగింది దానము అనే స్థిర నిశ్చయంతో చేసేది, ప్రత్యుపకార ఫలాన్ని ఆశించకుండా చేసేది, దేశకాల పాత్రలను దృష్టిలో ఉంచుకొని చేసేది సాత్త్విక దానము అని తెలుసుకున్నాం. ప్రత్యుపకారాన్ని ఆశించి చేసేది, ఫలాన్ని ఊహించి చేసేది, ఖేదంతో కూడినది రాజస దానము అని ప్రస్తుత శ్లోకంలో భగవంతుడు చెబుతున్నాడు.

దానక్రియ రెండిటి లోను ఒకటి గానే కనిపిస్తున్నా, ఉద్దేశ్యాలను, మనోభావాలను దృష్టిలో పెట్టుకొని ఆలోచించి నపుడు సాత్త్విక దానానికి, రాజస దానానికి ఆకాశానికి భూమికి ఉన్నంత అంతరం ఉంది. సాత్త్విక దానము నిస్వార్థమైన దైతే, రాజస దానము ఫలాపేక్షతో కూడింది. చెయ్య దగింది కనుక చేయాలి అని చేసేది సాత్త్విక దాన మైతే, చేయ వలసి వచ్చిందే అనే బాధతో, భారంతో చేసేది రాజస దానము.

**ప్రత్యుపకారము - ప్రతిఫలము**

నేను అతనికి దానం చేస్తాను - సమయం వచ్చి నపుడు అతడు నాకు ప్రత్యుపకారం చేస్తాడు అని ప్రతిఫలాన్ని ఆశించి చేసే దానమును రాజస దానము అంటారు. నిజం చెప్పాలి అంటే, ఇక్కడ దాన మెక్క డుంది? దాన మనే ముసుగులో వ్యాపారం నడుస్తు ఉంది. చూచే వారికి దాత - దానము అనేవి కనిపిస్తాయి. వాస్తవానికి అక్కడ దాత - దానము లేవు; వ్యాపారి - వ్యాపారము మాత్రమే ఉన్నాయి.

ప్రత్యుపకారాన్ని ఆశించి చేసే దానాన్ని వ్యాపారం అనాలి. లేదా లంచము అనాలి. వ్యాపార మైనా, లంచ మైనా, తన కేదో లాభం కలుగుతుంది అనే భావనతో చేసేదే. ఆ భావనతో చేసే టప్పుడు దానము వ్యాపార మైనా కావాలి, లేదా లంచ మైనా కావాలి. అంతేగాని, దానము మాత్రం కాలేదు. ప్రత్యుపకారాన్ని ఆశించి చేసేవే గనుక దానా లైతే, ఎన్నికలలో అభ్యర్థులు ప్రజలకు పంచి పెట్టే వన్నీ దానాలే అవుతాయి. వాటిని పుచ్చుకోవడ మైతే చేస్తారు గాని, అవి దానాలని ప్రజలు అంగీకరిస్తారా? మరి, దానాలు కానప్పుడు వాటిని ఏమనాలి? ఏమో! ఇచ్చే అభ్యర్థి లైనా చెప్పాలి, లేదా పుచ్చుకొనే ప్రజ లైనా చెప్పాలి. అవి దానా లని ఇరువురూ అంగీకరించరు. ఎందుకని? ఇరువురికీ తెలుసు అవి దానాలు కావని, పెట్టుబడులే నని. ఏ రూపాలలో నైనా అవి పెట్టుబడులే.

అవి చెంబులు కావచ్చు, చీరలు కావచ్చు. ఆట వస్తువులు కావచ్చు, తోట పరికరాలు కావచ్చు. వెండి బరిణెలు కావచ్చు, బంగారు ఉంగరాలు కావచ్చు. కొనేందుకు పచ్చనోట్లు కావచ్చు, కప్పుకొనేందుకు రగ్గులు కావచ్చు. వస్తువులు ఏవైనా, అన్నీ పెట్టుబడులే. దురాలోచనతో, దూరాలోచనతో చేసే దౌర్భాగ్యపు వ్యాపారాలే. ఒకవేళ ఇలాంటి కుహనా త్యాగులు చేసే కుటిల దానా లంటూ ఉంటే అవి రాజస దానాలే అవుతాయి. ప్రత్యుపకారాన్ని ఆశించి చేసే దానాలు. ఒక కాలంలో ఇచ్చేది మరొక కాలంలో తిరిగి అందుతుంది అనే ఆకాంక్షతో చేసే దానము రాజస దానము ***( యత్తు దానం ప్రత్యుపకారార్థం కాలేతు అయం మాం ప్రత్యుప కరిష్యతి ఇత్యేవ మర్థం ).*** కొందరు ప్రత్యుపకారం జరగదు అని తెలిసినా, మరో విధంగా ఫలాసక్తులై చేస్తారు. అవీ రాజస దానాలే.

**ఫలాకాంక్ష - స్వర్గము**

చేసిన దానానికి జీవిత కాలంలో ప్రత్యుపకారం అందుతుంది అనే భావనతో దృష్ట ఫలాన్ని ఆశించి





చేసేది రాజస దానము. అలాగే, చేసిన దానానికి జీవిత కాలంలో ప్రతిఫలం అందదు అని అర్థ మవుతూ ఉండినా, మరణానంతరము ప్రాప్తించే స్వర్గాది అదృష్ట ఫలాన్ని ఉద్దేశించి ఆచరించే దానాలు కూడా రాజస దానాల క్రిందికే వస్తాయి ***( ఫలం వా అస్య దానస్య మే భవిష్యతి అదృష్టమ్ ఇతి తదుద్దిశ్య పునః దీయతే చ ).*** ఇహంలో కాకపోయినా, పరంలో నైనా ప్రత్యుపకార ఫలం ప్రాప్తిస్తుందని భావించి చేసేవి కనుక పుణ్యకార్యాలు కూడా రాజస దానాలే.

మరి కొందరు విచిత్రంగా దానాలు చేస్తారు. ప్రత్యుపకార ఫలం అందదు అని వారికి తెలుసు. స్వర్గ ప్రాప్తి విషయంలో వారికి ఆశ ఉండదు. స్వర్గం ఒకటి ఉందని వారు నమ్మరు. అయినా అప్పుడప్పుడు పది మంది చూచే విధంగా, వంద మందికి తెలిసే విధంగా చిన్న చిన్న దానాలు పెద్ద పెద్ద ఆర్భాటాలతో, ఆడంబరాలతో చేస్తూ ఉంటారు.

వీరు నిత్య జీవితంలో ఏదో ఒక విధంగా సమాజాన్ని వంచించి ధనార్జన చేస్తారు. పెద్ద ఎత్తున ప్రజలను మోసం చేసి, విశేషంగా ధనాన్ని ఆర్జిస్తారు కనుక, సమాజ దృష్టిలో మరో విధంగా చిత్రింప బడతారు. ఆ కళంకాన్ని తొలగించుకోవా లని, పది మంది తన లోభత్వాన్ని చర్చించ కూడదని, చేసిన అకృత్యాలను దానాల ముసుగులో కప్పి పెట్ట వచ్చు నని భావించి, పుస్తకాలు లేని గ్రంథాలయాలు, ఉపాధ్యాయులు లేని పాఠశాలలు, వైద్యులు లేని ఆసుపత్రులను నిర్మించి, చాపంత గదికి చేటంత అక్షరాలతో శిలాఫలకాన్ని తగిలించి, ఖర్చులో ఖర్చు అని తమకు తాము సర్ది చెప్పుకొని, బిరుదు లిచ్చే వ్యాపార సంస్థలకు రహస్యంగా కొంత సొమ్ము ముట్ట చెప్పి, దానకర్ణ లేదా దానదుర్యోధన వంటి బిరుదులతో సన్మానం చేయించుకొని, ఏదో అలా సంతోష పడి పోతుంటారు. ఇది ఎలాంటి దానం? ఇదీ రాజసమే. ముందుగా మనం చూచిన ఇద్దరు ప్రత్యుపకార ఫలాన్ని ఆశించి చేసిన వారు. ఈ దాన దుర్యోధనులు ముందే ఫలాన్ని అందుకొని, దానం పేరిట ప్రత్యుప కారంగా ఏదో కొంత ముట్ట చెబుతారు. కనుక, ఇదీ రాజస దానమే.

ఈ విధంగా ఫలాకాంక్షతో, ప్రత్యుపకారార్థం రాజస దానాలు చేసే వారు దాన కర్మలో తృప్తి చెందరు. సంతోష పడరు. సంతృప్తికి నోచుకోరు. అయ్యో! ఎందుకు దానం చేశాను? తెలిసి ఎందుకు నష్ట పోయాను? చెయ్యక తప్పింది కాదు గాని, చెయ్యకుండా తప్పుకోనుంటే చాలా బాగుండేది. అయినా, అంత ఇవ్వకుండా ఉండాల్సింది, ఆలోచించ లేక అనవసరంగా అన్యాయమై పోయాను అని చేసిన దానానికి లోలోన కృంగి పోతూ ఉంటారు. ఈ విధంగా దుఃఖ భావంతో, దుఃఖ భారంతో ఇచ్చే దానాలు కూడా రాజస దానాలే ***(పరిక్లిష్టం ఖేద సంయుక్తం).*** లోభి కనుక పొరపాటున దానం చేస్తే, ఆ తరువాత అంతా ఆవేదనే. అంతా దుఃఖమే.

**ఆఖ్యాయిక**

పూర్వము ఆదర్శవంత మైన ఒక చిన్న గ్రామము ఉండేది. గ్రామస్థు లందరూ తమకు తామే కొన్ని ఆదర్శా లను ఏర్పాటు చేసుకొని, వాటికి అనుగుణంగా జీవిస్తూ ఉండేవారు. ఆ గ్రామంలో ఎవరి ఇంట్లో వివాహం జరిగినా, గ్రామస్థు లందరూ వచ్చి ఆ రోజు అక్కడే భోజనం చేయాలి. అది నియమం. అలా జరుగుతూ ఉండేది. ఎవరి కైనా ఆర్థిక ఇబ్బందు లుంటే గ్రామస్థు లందరూ చేతులు కలిపి కార్యం నెరవేర్చే వారే గాని సంప్రదాయ ఉల్లంఘనమునకు అంగీకరించే వారు కారు.

ఆ గ్రామంలో కృపణాచారి ఒకడు ఉండేవాడు. అతనికి ఒక్కగా నొక్క కుమార్తె. అమ్మాయి పెళ్ళి నిశ్చయ మైంది. గ్రామంలో ఉన్న ఆస్తిపరులలో కృపణాచారి కూడా ఒకడు. అమ్మాయి వివాహం తిరుపతిలో చేస్తా నని మొక్కు కున్నట్లు భార్యతో చెబుతాడు.

భర్త వ్యవహారం భార్యకు బాగా తెలుసు. మహా లుబ్దుడైన కృపణాచారి గ్రామస్థులకు భోజనాలు పెట్టడం ఇష్టం లేకనే, కాసులు ఖర్చు చేయడానికి మనస్సు అంగీకరించకనే తిరుపతి యాత్ర పెట్టాడని అర్ధాంగికి అర్థమై పోయింది.

భర్త ప్రయత్నాన్ని ఆమె త్రిప్పి కొట్టింది. కావలసినంత డబ్బు ఉంది. పైగా ఒక్కగా నొక్క కూతురు. 'లోభత్వానికైనా ఒక హద్దు ఉండాలి. ఇరవై సంవత్సరాలుగా అందరి గృహాలలో వివాహ సందర్భాలలో భోజనాలు చేస్తూ, మన బిడ్డ విషయం వచ్చే సరికి తిరుపతి కొండెక్కి కూర్చుంటా నంటే ఏం బావుంటుంది?' అంటూ భర్తను ఛీ కొట్టింది.

ఇక కృపణాచారికి తప్పింది కాదు. పెళ్ళి ఊళ్ళోనే జరగా లని భార్య పట్టు పట్టడంతో కృపణాచారి తన అమ్మాయి వివాహాన్ని గ్రామం లోనే జరిపించ డానికి నిశ్చయించుకున్నాడు. వివాహ సన్నాహాలు ప్రారంభ మయ్యాయి.

పెళ్ళి రోజు సమీపిస్తూ ఉంది. సంప్రదాయాను సారము భార్యాభర్త లిద్దరూ వెళ్ళి గ్రామస్థు లందరినీ పెళ్ళికి ఆహ్వానించారు.

ఇక ఆ రోజే పెళ్ళి. బంధువు లందరూ వచ్చేశారు. గ్రామస్థు లందరూ హాజరయ్యారు. పెళ్ళి ఘనంగా జరిగింది. భోజనాలు వడ్డించ వలసిన సమయం వచ్చింది. ఆహార పదార్థా లన్నీ సిద్ధ మయ్యాయి. అందరూ పంక్తిలో ఆసీను లైన తరువాత, వడ్డన జరిగిన పిమ్మట యజమాని సతీ సమేతంగా అందరికీ నమస్కరించాలి. 'అతిథులారా! ఆత్మీయులారా! తృప్తిగా భోజనం చేయండి' అని యజమాని పలకాలి. ఆ తరువాతే అందరూ భుజించడం ప్రారంభిస్తారు. అది ఆ గ్రామంలో సంప్రదాయము.

అందరూ భోజనానికి ఆసీను లయ్యారు. ఆకులలో ఆహార పదార్థా లన్నీ వడ్డించారు. కాని, అక్కడెక్కడా యజమాని కనుచూపు మేరలో కనిపించ లేదు. యజమాని భార్య భర్తను వెతుకుతూ అటు, ఇటు పరుగులు పెట్టింది. చివరికి కృపణాచారి జాడను కనిపెట్టింది. పాకశాల ప్రక్కన సరుకులు నిల్వ ఉంచే గదిలో బియ్యపు బస్తాల వెనుక నక్కి బిక్క మొగంతో కూర్చుని ఉన్నాడు.

'భోజనాలు వడ్డిం చేశారు. మీరు ఇక్కడ కూర్చున్నా రేమిటండీ! రండి, ఆహ్వానం పలకాలి. అందరూ నిరీక్షిస్తున్నారు' అన్నది అర్ధాంగి. కృపణాచారికి ఏమి చెయ్యాలో తోచ లేదు. భార్యను ప్రాధేయ పడుతూ, 'నేను రాలేను. మన ఇంట్లో ఒకేసారి అంత మంది భోజనం చేయడం నేను చూడలేను. నువ్వు వెళ్ళు. వెళ్ళి నా బదులు నువ్వే ఆహ్వానం పలికేయ్! అందరూ భోజనం చేసి వెళ్ళిన తరువాత నాకు చెప్పు. నేను వస్తాను' అన్నాడు.

అది విని భార్య నిర్ఘాంత పోయింది. భర్తపై చిర్రుబుర్రు లాడింది. 'ఎలాగూ భోజనాలు తయారయ్యాయి. అయిన ఖర్చేదో అయి పోయింది. మీరు రానంత మాత్రాన ఖర్చై పోయిన సొమ్ము తిరిగి వస్తుందా? పోయిన సొమ్ముతో పాటు పరువు కూడా పోతుంది. ఈ విషయం గ్రామస్థులకు తెలిస్తే, వారికి బాధ కలిగి మనల్ని గ్రామం నుండి బహిష్కరించ వచ్చు కూడా. లేవండీ!' అంటూ ఎలాగో భర్తకు నచ్చ చెప్పి తీసుకొని వచ్చి, భోజనాలు జరిగే చోట అతని ప్రక్కనే నిలబడి, ఆహ్వానం పలక మని భర్తతో మెల్లగా చెప్పింది. ఇక భర్తకు తప్ప లేదు. కృపణాచారి ఆహ్వానం పలకడం ప్రారంభించాడు.

'అతిథులారా! మా ఆహ్వానాన్ని మన్నించి, మా ఇంటికి వచ్చి, మా అమ్మాయి వివాహ మహోత్సవంలో పాల్గొన్నందుకు మీ అందరికీ మా దంపతులము కృతజ్ఞతతో నమస్కరిస్తున్నాము. మేము ఇచ్చే ఈ విందును ఆరగించి వధూవరులను ఆశీర్వదించండి. మమ్మల్ని కృతార్థుల్ని చేయండి. తృప్తిగా భోజనం చేయండి' అన్నాడు కృపణాచారి. ఆహ్వాన వాక్యం అదే. అంతే.





అందరూ ఆరగించ డానికి ఆరంభించారు. కృపణాచారి రెండవ సారి మళ్ళీ ఆహ్వాన వాక్యం వినిపించాడు. మూడవ సారి కూడా వినిపించాడు. అందరికీ ఆశ్చర్యం వేసింది. మూడు సార్లు చెప్పడ మేమిటి? అని. మొదటి ఆహ్వాన వాక్యం ముగియ గానే అక్కడి నుండి కదిలి స్వయంగా భోజన ఏర్పాట్లు చూస్తున్న భార్య, భర్త మళ్ళీ మళ్ళీ ఆహ్వానం పలకడం విని కంగారు పడింది. విషయం అర్థం గాక గబగబా భర్తను సమీపిస్తూ ఉంది. ఈ లోగా కృపణాచారి నాల్గవసారి ఆహ్వానం పలకడం ప్రారంభించాడు. ఈ సారి అతని పలుకులో ఏదో వైచిత్ర్యం ధ్వనించింది.

'మేము ఇచ్చే ఈ విందును ఆరగించి, మమ్మల్ని ఆశీర్వదించండి. తృప్తిగా భోజనం చేయండి. తృప్తిగా భోజనం చేయండి. తృప్తిగా భోజనం చేయండి' అని మూడు సార్లు మళ్ళీ పలికి,

'అయ్యా! బియ్యము కిలో ముప్పై రూపాయలు. కందిపప్పు కిలో ఎనభై రూపాయలు. తృప్తిగా భోజనం చేయండి. భోజనం చేయండి. బంగాళా దుంపలు కిలో ఇరవై ఎనిమిది రూపాయలు. వంకాయలు కిలో ముప్పై రూపాయలు. తినండి, తినండి. తృప్తిగా తినండి.

పంచదార కిలో యాభై రూపాయలు. ఆవుపాలు లీటరు ఇరవై రూపాయలు. జీడిపప్పు కిలో మూడు వందల యాభై. పాయసం త్రాగండి. తృప్తిగా త్రాగండి. తనివిదీర జుర్రండి.

అయ్యా! లడ్డూలు కిలో రెండు వందల రూపాయలు. కిలోకి ఇరవై రెండు లడ్డూలు తూగుతాయి. తినండి, తినండి. తృప్తిగా తినండి. భోజనం చేసిన తరువాత, అరటి పండు ఇస్తూ ఉన్నాము. ఒక్కొక్కరు ఒక్కొక్కటి తృప్తిగా తినండి. తిన్న ఆహారం బాగా జీర్ణ మవుతుంది. అరటిపండ్లు డజను ఇరవై ఐదు రూపాయలు. తినండి, తినండి. తృప్తిగా తినండి. వడ్డించిన అరిటాకు రెండు రూపాయలు. తినండి, అంటూనే ఉన్నాడు.

భార్య అక్కడికి వచ్చి, భర్తను బలవంతంగా లోనికి తీసుకొని వెళ్ళింది. గదిలో కూర్చోబెట్టి, భర్తతో 'ఏమిటండీ ఇదంతా?' అని అడిగింది. అంతే. భర్త భోరున విలపించాడు. 'నా జీవితంలో ఇలాంటి రోజు ఒకటుంటుం దని నేను కలలో కూడా ఊహించ లేదు. ఆ భయంకర దృశ్యాన్ని చూచి నా గుండె చెరువై పోయింది' అన్నాడు. భార్య నవ్వుతూ, 'వాళ్ళ ఇళ్ళ కెళ్ళి మెక్కి నపుడు ఏమైంది ఈ జ్ఞానం? ఈ అనుభూతి? ఈ జ్ఞానానుభూతి?' అంది.

*ఇక భగవంతుడు తామస దానాన్ని చెబుతున్నాడు.*

**అదేశకాలే యద్దాన మపాత్రేభ్య శ్చ దీయతే ।**
**అసత్కృత మవజ్ఞాతం త త్తామస ముదాహృతమ్ ॥** 22

*అదేశకాలే-యత్-దానం-అపాత్రేభ్యః-చ-దీయతే*
*అసత్కృతం-అవజ్ఞాతం-తత్-తామసం-ఉదాహృతం*

| | | | | | |
|---|---|---|---|---|---|
| అదేశకాలే | = | అనుచిత దేశకాలము లందు | దానం | = | దానము |
| అపాత్రేభ్యః చ | = | అయోగ్యులకు | దీయతే | = | ఇవ్వబడు చున్నదో |
| అసత్కృతం | = | సత్కారము లేకుండా | తత్ | = | అది |
| అవజ్ఞాతం | = | అవమాన పూర్వకంగా | తామసం | = | తామస మని |
| యత్ | = | ఏ | ఉదాహృతం | = | చెప్పబడింది |

**అర్జునా! అయోగ్య మైన దేశ కాలాదులలో అపాత్రులైన వారికి తిరస్కార భావంతో, అవమాన పూర్వకంగా చేసే దానము తామస దానము.**

### వ్యాఖ్య

యోగ్యము కాని ప్రదేశములో, అనుచిత కాలములో, అపాత్రులైన వారికి ఇచ్చే దానము తామస దానము (***అదేశ కాలే, అపాత్రేభ్యశ్చ యద్దానం దీయతే***). అలాగే సత్కారమునకు నోచుకోనిది (***అసత్కృతమ్***), అవమాన పూర్వక మైనది (***అవజ్ఞాతం***) ఏదో, అట్టి దానము తామస దానము (***తత్ తామసం ఉదాహృతమ్***).

**అశుచి ప్రదేశము**

అదేశము అంటే దానమునకు అయోగ్య మైన ప్రదేశము. దానము పవిత్ర మైనది కనుక శుచి లేని ప్రదేశము నందు ఇవ్వ కూడదు. కాని, తామసులు అలాంటి ప్రదేశాల లోనే దానం చేస్తారు. అందుచేత వారిది తామస దానము.

ఎవరికి ఏదుందో దానినే దానం చేస్తారని పూర్వ శ్లోకాలలో చెప్పుకున్నాం. ఎవరు ఎక్కడ ఉంటారో అక్కడే దానం చేస్తారు అనేది ప్రస్తుత శ్లోకంలో గ్రహించాలి. తామసులు చేసేది తామస దానము. తామసులు అపవిత్ర మైన ప్రదేశాలలో చరిస్తారే గాని పవిత్రమైన ప్రదేశాలలో చరించరు. అపవిత్రమైన స్థలాలలో ఉండే వారు, దానం చేసే అవసరమే వస్తే, అపవిత్రమైన, అశుచి స్థలము లందే గాక మరొక చోట ఎలా చేస్తారు? అలా అశుచి ప్రదేశాలలో చేసే దానము తామస దానము (***అదేశ కాలే అపుణ్యే దేశే***).

కల్లు దుకాణాల వద్ద దానం చేస్తే, దానమును గ్రహించిన వాడు, ఆ గ్రహించిన దానాన్ని దేనికి వినియోగిస్తాడు? అందుచేత అయోగ్య ప్రదేశాలలో చేసే దానము దాతను, గ్రహీతను, ఇద్దరినీ పాప పాశంతో ముడి వేస్తుంది. కనుక అది తామస దానము.

**అపుణ్య కాలము**

అశుచి ప్రదేశంలో ఎలా దానం చేయ కూడదో, అశుచి కాలంలో కూడా అలాగే దానం చేయ కూడదు. అపుణ్య కాలంలో, అశుచి సమయంలో దానం చేస్తే, అది తామస దాన మవుతుంది (***అకాలే పుణ్య హేతుత్వేన అప్రఖ్యాతే***).

దానం చేయడానికి కాలం అయోగ్యం కాదు. కాకపోతే, దానం పుచ్చుకొనే వాడి కాలం బాగ లేనపుడు ఇవ్వబడిన దానం వ్యర్థ మవుతుంది. సద్వినియోగం కాక పోగా, దుర్వినియోగ మవుతుంది.

**పాత్ర యోగ్యత్వము**

దానము సత్పాత్రముగా ఉండాలి. అపాత్ర దానము అయోగ్యము. అయోగ్యుడైన అపాత్రునికి దానం చేయడము తామస దాన మవుతుంది (***అపాత్రేభ్యః చ మూర్ఖ తస్కరాదిభ్యః***). మూర్ఖులకు, చోగులకు చేసే దానము తామస దాన మవుతుంది. వీరందరూ సోమరిపోతులు. వారికి దానం చేయడం వల్ల సోమరులను ప్రోత్సహించినట్లే అవుతుంది. సమాజ అభ్యుదయ నిరోధకులైన సోమరులను ప్రోత్సహించ కూడదు. అట్టి వారికి చేసే దానము తామస దానమే.

ఎవరికి మనం ఏది ఇచ్చినా అది వారికి ఉపయోగ పడాలి. వారు దానిని ఉపయోగ పరచు కోవాలి. అలా వినియోగించుకోలేక పోవడమే గాక, దుర్వినియోగం చేసుకొనే వారికి దానం చేయ కూడదు. ఒకవేళ చేస్తే అది తామస దాన మవుతుంది.





త్రాగుబోతుకు దానం చేస్తే ఆ తరువాత వాడి త్రాగుడు వాడు పుచ్చుకొనే దానం పైనే ఆధారపడి ఉంటుంది. జూద గాడికి దానం చేస్తే, వాడు దానిని జూదంలో పోగొట్టు కుంటాడు. అందుచేత అది అపాత్ర దానము అవుతుంది. పాత్రోచితం కాని దానం వినాశ హేతువు కనుక, అట్టి దానము తామస దాన మవుతుంది.

**అసంప్రదాయము**

అయోగ్యులైన వారికి, అంటే అపాత్రులకు మనము ఏది ఇచ్చినా అది దానం క్రిందికి రాదు. ఒకవేళ వస్తే, అది తామస దానము అవుతుంది. ఎందుకంటే, అది సంప్రదాయానికి భిన్నంగా ఉంది కనుక.

దానము అనేది ప్రశస్త మైనది, పవిత్ర మైనది అని ఇప్పటికే చాలా చెప్పుకున్నాం. దానం అంత విశిష్ట మైనది కనుకనే, దానాన్ని సమర్పించే టప్పుడు పూజాదికాలు నిర్వహించి మన పూర్వీకులు ఇచ్చే వాళ్ళు. సత్కరించకుండా ఇచ్చేది దానం కానే కాదు.

సత్కరించడము అంటే, గౌరవ ప్రదమైన సంభాషణము, పాద ప్రక్షాళన, పూజాదులను నిర్వహించడము (***సత్కృతమ్***). సత్కారము లేనిది అసత్కారము (***అసత్కృతమ్***).

ధర్మరాజు రాజసూయ యాగములో పాద ప్రక్షాళన నమస్కారాదులు నిర్వహించి ఆ తరువాత దానాలు ఇచ్చాడు. ఇంతెందుకు? బిచ్చగాడికి దానం చేసినా తల్లులు నమస్కరిస్తూ ఉండటం మనం చూస్తాము. ఇది మన సంప్రదాయము. ఈ సంప్రదాయానికి భిన్నంగా సాగే దానము దానమే కాదు. అయోగ్యు లైన వారికి, అపాత్రు లైన వారికి చేసే టప్పుడు వారిని ఎవరైనా సత్కరిస్తారా? సత్కరించరు. కనుక, అసత్కృతమైన ఆ దానము తామస దానమే.

**లేనిది సత్కారము - ఉన్నది చీత్కారము**

సత్కారము లేని దానము అయోగ్య మైనది. సత్కారము లేక పోగా చీత్కారముతో కూడు కున్నది దానము కానే కాదు. సన్మాన పూరితంగా సాగ వలసిన దాన క్రియ అవమాన పూర్వకంగా సాగడం గర్హణీయం. అందుచేత, అసత్కార చీత్కారాది లక్షణాలతో కూడు కున్నది కావడం చేత దీనిని తామసదానము అన్నారు.

అయోగ్యులకు దానం చేసే టప్పుడు వారిని ఎవ్వరూ సత్కరించరు కనుక ఆ దానము అసత్కార యుతము (***అసత్కృతమ్***). అలాంటి వారికి గౌరవ పూర్వకంగా ఎవరు దానా లిస్తారు? చీత్కారము తోనే ఇస్తారు. అవమాన పూర్వకం గానే ఇస్తారు. విసిరి కొట్టడము, తిట్టుకుంటూ ఇవ్వడము - 'ఇదిగో, తీసుకుపో. మళ్ళీ నీ ముఖం నాకు చూపకు' అని నిందిస్తూ, అవమానిస్తూ ఇస్తూ ఉంటారు. అందుచేత తామస దానము అవమానముతో కూడినది (***అవజ్ఞాతం పాత్ర పరిభవ యుక్తం***).

ఈ విధంగా అశుచి ప్రదేశాలలో, అపుణ్య కాలాలలో, పాత్ర యోగ్యత లేని వారికి, సత్కార రహితంగా, అవమాన పూర్వకంగా అర్పించే దానము ఏదో, అది తామస దానము (***యత్ దానం తత్ తామసమ్ ఉదాహృతమ్***).

చివరగా, పవిత్రమైన యజ్ఞ దాన తపస్సులు ఫలించే ఉపాయాన్ని సూక్ష్మీకరిస్తున్నాడు.

**ఓం తత్స దితి నిర్దేశో బ్రహ్మణ స్త్రివిధః స్మృతః । 23**
**బ్రాహ్మణా స్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా ॥**

***ఓం-తత్-సత్-ఇతి-నిర్దేశః-బ్రహ్మణః-త్రివిధః-స్మృతః***
***బ్రాహ్మణాః-తేన-వేదాః-చ-యజ్ఞాః-చ-విహితాః-పురా***

| | | |
|---|---|---|
| బ్రహ్మణః | = | బ్రహ్మము యొక్క |
| నిర్దేశః | = | నిర్దేశము |
| ఓం ఇతి | = | ఓం అని |
| తత్ ఇతి | = | తత్ అని |
| సత్ ఇతి | = | సత్ అని |
| త్రివిధః | = | మూడు విధములుగ |
| స్మృతః | = | చెప్పబడినది |

| | | |
|---|---|---|
| తేన | = | దాని చేత |
| బ్రాహ్మణాః | = | బ్రాహ్మణులు |
| వేదాః చ | = | వేదములు |
| యజ్ఞాః చ | = | యజ్ఞములు |
| పురా | = | పూర్వము |
| విహితాః | = | నిర్మింప బడినవి |

**అర్జునా! 'ఓం తత్ సత్' అనే ఈ మూడు మంత్రాలు బ్రహ్మ నిర్దేశాలు. పూర్వం వీటి తోనే బ్రహ్మ బ్రాహ్మణులను, వేదాలను, యజ్ఞాలను సృష్టించాడు.**

### వ్యాఖ్య

ఆహార, యజ్ఞ, దాన, తపస్సులు గుణ భేదాలను బట్టి త్రివిధము అని వివరించి, మళ్ళీ వాటి స్వభావ స్వరూపాలను వేరు వేరుగా విస్తరించి చెప్పడం జరిగింది. త్రిగుణాలలో రజోగుణ, తమోగుణాలు త్యాజ్యము లని చెప్పడం చేత సాత్త్విక మైనవే గ్రాహ్యము అని సుస్పష్ట మైంది.

ఆహారము నొక్క దానిని విడిచి పెడితే, మిగిలిన యజ్ఞ, దాన, తపస్సుల ఫలము అదృష్టమే గాని దృష్టము కాదు. అనుమాన ప్రమాణం చేత అముఖ్యమైన దృష్ట ఫలాన్ని ఊహించ గలిగినా, ప్రధానమైన ఫలము మాత్రము అదృష్టమే అనుటలో సందేహము లేదు.

సాత్త్విక శ్రద్ధ కలిగి యజ్ఞ, దాన, తపస్సులను నిర్వర్తించినా, శాస్త్ర జ్ఞానము లేని కారణంగా *(17 వ అ - 1 వ శ్లో ; అర్జునుని ప్రశ్న)* వాటిలో దోషాలు తలెత్తే ప్రమాదం లేక పోలేదు. లోపాలు ఏర్పడే అవకాశాన్ని త్రోసిపుచ్చ లేము. అలా యజ్ఞ, దాన, తపస్సులలో దోషం ఉన్నప్పుడు ఫలం రాక పోవచ్చు. ఫలం అదృష్టం కావడం చేత అది వచ్చిందో రాలేదో తెలుసుకొనే అవకాశం కూడా లేదు. అలాంటప్పుడు ఈ వైకల్యమును, లేదా వైగుణ్యమును తొలగించుకొనే దెలా? దోష పరిహారం ఏమైనా ఉందా? ఉంటే, ఏమిటది? దానికి సమాధానం గానే, దోష పరిహారార్థం భగవంతుడు ఈ శ్లోకంలో ఉపాయం చెబుతున్నాడు.

యజ్ఞ, దాన, తపస్సుల లోని వైగుణ్యమును తొలగించి, వాటికి సాద్గుణ్యమును, అంటే మంచి గుణాన్ని ఆర్జించడం కొరకు ఉపాయాన్ని ఉపదేశిస్తున్నాడు ***( యజ్ఞ దాన తపః ప్రభృతీనాం సాద్గుణ్య కరణాయ అయమ్ ఉపదేశః ఉచ్యతే ).***

ఉచ్ఛిష్టం కానిది, దోషం లేనిది ప్రపంచంలో ఒక్కటే ఉంది. అదే బ్రహ్మము. బ్రహ్మము కన్నా అన్యంగా ఏదున్నా అదంతా ఉచ్ఛిష్టమే. దోష యుతమే. బ్రహ్మ మొక్కటే సమము. బ్రహ్మమే నిర్దోషము ***( నిర్దోషం హి సమం బ్రహ్మ: 5 వ అ - 19 వ శ్లో).***

యజ్ఞ, దాన, తపస్సుల విషయములో అనుష్ఠానంలో ఎక్కడ ఏ దోషము కదిలినట్లు అనుమానం కలిగినా, దోష రహితమైన పరమాత్మను ఉచ్చరిస్తే, ఆ దోషము పరిహార మవుతుందని చెబుతున్నాడు. పరమాత్మ మంత్రోచ్చారణముతో దోషం పరిహరింప బడుతుంది. ఆ మంత్రమే ***ఓం తత్ సత్ .***

ఓంకారములో మూడు అక్షరా లున్నట్లే, బ్రహ్మ నిర్దేశ మైన ఈ మంత్రములో మూడు పదాలు ఉన్నాయి. ఈ మూడు బ్రహ్మ నిర్దేశాలు. విచిత్ర మేమిటంటే, ఈ మూడు నిర్దేశ పదాలు కలిసి ఏక మంత్రమై బ్రహ్మమును నిర్దేశిస్తాయి. అలాగే ఒక్కొక్క పదము కూడా దేనికి అదే పూర్ణరూపంతో బ్రహ్మమును నిర్దేశిస్తుంది.





నిర్దేశము అంటే నామము, లేదా పేరు అని అర్థము. ***ఓం తత్ సత్*** అనే మూడు పదాలు కలిసి, 'సత్యం జ్ఞానం అనంతం' లాగా భగవంతుని నిర్దేశిస్తాయి. లేదా, దేని కదే నిర్దేశ మవుతాయి. ప్రస్తుతం ఇది నామ నిర్దేశం.

***నిర్దిశ్యతే అనేన ఇతి నిర్దేశః*** - దేని సహాయం చేత ఒక వస్తువు తెలియ బడుతుందో, అలా తెలుసు కునేందుకు సహకరించేది నిర్దేశము అవుతుంది ***( న్యాయ లింగేన ).*** ***ఓం తత్ సత్*** అనే బ్రహ్మ నామము నిర్దేశమై నందున బ్రహ్మము నిర్దేశ్య మైంది. ఇది 'ప్రతిపాదక ప్రతిపాద్య' సంబంధము. నామము ***(ఓం తత్ సత్)*** ప్రతిపాదకము. బ్రహ్మము ప్రతిపాద్యము. ప్రస్తుతము బ్రహ్మమునకు మూడు విధాలైన నామ నిర్దేశం జరిగింది ***( త్రివిధః నామ నిర్దేశః బ్రహ్మణః ).*** ఈ మూడు విధాలైన నిర్దేశమే ***ఓం తత్ సత్.***

***ఓం తత్ సత్*** అనేది పరమాత్మ స్వరూపమును గూర్చిన నిర్దేశము. ***నిర్దేశః*** అనేది ఏకవచన ప్రయోగం కావడం చేత, ***ఓం తత్ సత్*** అనేది బ్రహ్మ ప్రతిపాదక నామము అనేది స్పష్టము.

యజ్ఞ, దాన, తపస్సులలో కర్మాచరణంలో ఏదైనా లోపం జరిగినట్లు మీకు అనిపిస్తే, వెంటనే ***ఓం తత్ సత్*** అనే బ్రహ్మ నిర్దేశాన్ని, లేదా బ్రహ్మ నామాన్ని ఉచ్చరిస్తే, వెంటనే ఆ దోషం, లేదా లోపం పరిహరింప బడుతుంది. ఇది శ్లోక హృదయం.

***ఓ మితి బ్రహ్మ*** - ఓం అనేది బ్రహ్మము అని తైత్తిరీయ శ్రుతి. కనుక ఓంకారము బ్రహ్మమునకు నామ నిర్దేశము.

***తత్త్వమసి*** - తత్ (బ్రహ్మము) త్వం (నీవు) అసి (అయి ఉన్నావు) అని ఛాందోగ్య శ్రుతి వలన ***తత్*** పదము బ్రహ్మమునకు నామ నిర్దేశము.

***సదేవ సోమ్యేదం*** - సృష్టికి పూర్వము ***సత్*** ఒక్కటే ఉండింది అని శ్రుతి ప్రతిపాదించడం చేత ***సత్*** అనేది బ్రహ్మమునకు నామ నిర్దేశ మైంది. ఇప్పుడు ఈ మూడిటిని కలిపి అర్థం చేసుకుంటే, ***ఓం తత్ సత్,*** అనేవి మూడు కూడా బ్రహ్మము యొక్క నామములే కనుక, బ్రహ్మ నామత్రయోచ్చారణము సర్వపాప, సర్వ దోష ప్రాయశ్చిత్త మని స్పష్ట మవుతూ ఉంది. కనుక, యజ్ఞ, దాన, తపస్సులను సాత్త్విక శ్రద్ధతో ఆచరించే వారు, శాస్త్ర విధిని విడిచి పెట్టి చేయడం చేత గాని ***( శాస్త్ర విధిమ్ ఉత్సృజ్య ).*** తంత్ర, మంత్ర, స్వర, వర్ణాది లోపము చేత గాని ఏర్పడిన వైగుణ్యము ప్రయోజనానికి అవరోధమును కల్పించకుండా, యజ్ఞ, దాన, తపస్సులను ఆచరించు నపుడు, సంశయము ఉత్పన్న మైనప్పుడల్లా ***ఓం తత్ సత్*** అనే బ్రహ్మ నామమును ఉచ్చరిస్తే సర్వమునకు సాద్గుణ్యము సాధింప బడి సర్వము సఫల మవుతుంది.

*ఇక 'ఓం తత్ సత్' అనే మూడు పదాలను, ఒక్కొక్క దానినే తీసుకొని వర్ణింప బోతున్నాడు. మొదట 'ఓంకారము'ను వివరిస్తున్నాడు.*

**తస్మా దో మి త్యుదాహృత్య యజ్ఞ దాన తపః క్రియాః ।**
**ప్రవర్తన్తే విధానోక్తాః సతతం బ్రహ్మవాదినామ్ ॥** 24

***తస్మాత్-ఓం-ఇతి-ఉదాహృత్య-యజ్ఞదానతపః క్రియాః***
***ప్రవర్తంతే-విధానోక్తాః-సతతం-బ్రహ్మవాదినాం***

| | | |
|---|---|---|
| తస్మాత్ | = | అందువలన |
| బ్రహ్మవాదినాం | = | బ్రహ్మవాదుల యొక్క |
| విధానోక్తాః | = | శాస్త్రోక్తము లైన |
| యజ్ఞదానతపఃక్రియాః | = | యజ్ఞములు, దానములు, తపస్సులు అనే కర్మలు |

ఓం ఇతి = ఓం అని
ఉదాహృత్య = చెప్పి

సతతం = సదా
ప్రవర్తంతే = ప్రవర్తించు చున్నవి

**అర్జునా! బ్రహ్మవేత్తలు శాస్త్రోక్తము లైన యజ్ఞ దాన తపస్సులను 'ఓం'ను ఉచ్చరిస్తూనే ఆచరిస్తారు.**

వ్యాఖ్య

***ఓం తత్ సత్*** అనే త్రివిధ నామ నిర్దేశంలో ప్రథమంగా 'ఓం' కారమును గూర్చి విస్పష్టం చేస్తున్నాడు. 'ఓం' ఒక్కటే నామ నిర్దేశం కావడం చేత ***( తస్మాత్ )*** ఓంకారమును ఉచ్చరించి ***( ఓం ఇతి ఉదాహృత్య )*** వేదవాదులైన బ్రహ్మమూర్తులు యజ్ఞ, దాన, తపస్సుల యందు ప్రవర్తించే వారు.

'ఓం' అని పలికి యజ్ఞాది కార్యాలను ప్రారంభించి, యజ్ఞము పూర్తి కాగానే 'ఓం' కారమును ఉచ్చరించి సమాప్తం చేసే వారు. ఈ విధంగా ఆద్యంతముల యందు బ్రహ్మ నిర్దేశమైన 'ఓం' కారమును ఉచ్చరించి, యజ్ఞాంగములకు సాద్గుణ్యమును సాధించుకొని ప్రకర్షమున బ్రహ్మ కర్మలలో వర్తించే వారు.

***ఓమితి ఏత దక్షరం ఇదం సర్వం -*** ఈ సమస్త ప్రపంచము ఓంకారమనే అక్షర పరబ్రహ్మము. ***భూతం భవ ద్భవిష్య దితి సర్వం ఓంకార ఏవ -*** భూత, భవిష్య ద్వర్త మానము లన్నియు ఓంకారమే అని మాండూక్య శ్రుతి. 'ఓం'కారము బ్రహ్మ నిర్దేశ వాచకము. కనుక, పరమాత్మ సర్వులను రక్షించునట్లు, ప్రణవ రూపమైన ఓంకారము కూడా ఉచ్చరించే వారిని రక్షిస్తుంది.

***ఓంకారః - అవతి భూతానీమ్ ఓం.*** సర్వ భూతములను రక్షించునది ఓంకారము. 'ఓం' అనేది 'అవ్' ధాతువు నుండి పుట్టింది. ***అవ రక్షణే*** అనే వ్యుత్పత్తి వల్ల సర్వులను రక్షించేది ఓంకారము. బ్రహ్మము నిర్దేశ్యము. ఓంకారము నిర్దేశము. కనుక ఓంకారము, లేదా ప్రణవము బ్రహ్మమునకు పేరు, లేదా నిర్దేశము ***( తస్య వాచకః ప్రణవః ).***

సృష్టి ప్రారంభములో ***ఓం తత్ సత్*** అనే నామత్రయ పూర్వకంగా బ్రాహ్మణ, వేద, యజ్ఞముల విధానము గోచరించుట చేత, ఈ అభిధాన త్రయంలో 'ఓం' అనే నామమును ఉచ్చరించిన తరువాతే యజ్ఞాది క్రియలు ఆచరిస్తారు. ***ఓమితి బ్రహ్మ ప్రసౌతి , ఓమితి శస్త్రాణి శంసన్తి , ఓమితి ప్రతిగిరం ప్రతి గృణాతి , ఓమితి సామాని గాయన్తి*** - అని వేదపారగుల క్రియలన్నీ ఓంకారము తోనే ప్రారంభ మౌతున్నా యని శ్రుతి ప్రబోధము.

*ఇక బ్రహ్మ నిర్దేశమైన 'ఓం తత్ సత్' లో రెండవ పదమైన 'తత్'ను వివరిస్తున్నాడు.*

**త ది త్యనభిసంధాయ ఫలం యజ్ఞ తపః క్రియాః ।**
**దానక్రియాశ్చ వివిధాః క్రియన్తే మోక్షకాంక్షిభిః ॥** 25

***తత్-ఇతి-అనభిసంధాయ-ఫలం-యజ్ఞ తపః క్రియాః***
***దానక్రియాః-చ-వివిధాః-క్రియంతే-మోక్షకాంక్షిభిః***

మోక్షకాంక్షిభిః = మోక్షాపేక్ష గల వారి చేత
తత్ ఇతి = అది అని
ఫలం = ఫలమును
అనభిసంధాయ = అభిలషించక

వివిధాః = వివిధములైన
యజ్ఞతపఃక్రియాః = యజ్ఞతపః కర్మలు
దానక్రియాః చ = దాన క్రియలును
క్రియంతే = ఆచరింప బడుచున్నవి

**అర్జునా! కోరికలకు దూరమైన ముముక్షువులు 'తత్' అనే పదాన్ని ఉచ్చరిస్తూ, కర్మఫలాన్ని ఆశించకుండా వివిధములైన యజ్ఞ, దాన, తపః క్రియలను ఆచరిస్తారు.**





వ్యాఖ్య

***తత్*** అనే సర్వనామ పదము బ్రహ్మ యొక్క నామము. 'తత్' అభిధానము. బ్రహ్మ అభిధేయము. 'తత్త్వమసి' మహావాక్యంలో 'తత్' పదము బ్రహ్మ నిర్దేశము. కనుక బ్రహ్మనామ మైన ***(బ్రహ్మాభిధానం)*** 'తత్' పదమును ఉచ్చరించి, కర్మఫలమును ఆశించకుండా ***( ఫలం అనభిసంధాయ )*** యజ్ఞక్రియలను, తపః క్రియలను, దానక్రియలను ముముక్షువులు అంతఃకరణ శుద్ధికై ఆచరిస్తూ ఉంటారు ***(క్రియన్తే మోక్ష కాంక్షిభిః ముముక్షుభిః ).***

'తత్' పదము ***ఓం తత్ సత్*** అనే బ్రహ్మ నిర్దేశమునకు ఉప లక్షణము. ***ఓం తత్ సత్*** అనే మూడు నామములు బ్రహ్మ నిర్దేశములు కావడం, బ్రహ్మ వాచకములైన ఈ మూడు నామములు వేదాదులకు కారణము కావడం, సృష్ట్యారంభమున బ్రహ్మదేవుడు ఈ మూడు బ్రహ్మ నామములను పలికి సృష్టి కార్యమును నిర్వర్తించడము వలన, పరమ పవిత్రమైన ఈ మూడు నామాలకు 'తత్' శబ్దము ఉపలక్షణం కావడం చేత యజ్ఞ, దాన, తపః కర్మలను ప్రారంభించు సమయము లోను, అలాగే వాటిని పరిసమాప్తం చేసే కాలం లోను 'తత్' శబ్దమును కామనా రహితులైన ముముక్షువులు అంతఃకరణ శుద్ధి కొరకు పలుకుతున్నారు. కనుక 'తత్' అను బ్రహ్మ నామము అతి ప్రశస్త మైనది. యజ్ఞాది క్రియల నిర్వహణములో ఏ విధమైన దోషము ఉండినా, లోపము చోటు చేసుకున్నా, ఏ విషయమై సంశయము కలిగినా, వెంటనే 'తత్' అనే బ్రహ్మ నామమును ఉచ్చరించుట చేత వైగుణ్యము పరిహరించ బడి సాద్గుణ్యము సాధించ బడుతుంది. ఉచ్చరించుట **(ఉచ్చార్య)** అనే విషయమునకు సమన్వయ నిమిత్తము పూర్వ శ్లోకము లోని **ఉదాహృత్య** అనే పదాన్ని గ్రహించి అన్వయించు కోవాలి.

*ఇక బ్రహ్మ నిర్దేశమైన 'ఓం తత్ సత్' లో మూడవ బ్రహ్మాభిధాన మైన 'సత్' ను వివరిస్తున్నాడు.*

**సద్భావే సాధుభావే చ స ది త్యేత త్ప్రయుజ్యతే ।**
**ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ యుజ్యతే ॥** 26

***సద్భావే-సాధుభావే-చ-సత్-ఇతి-ఏతత్-ప్రయుజ్యతే***
***ప్రశస్తే-కర్మణి-తథా-సత్-శబ్దః-పార్థ-యుజ్యతే***

పార్థ = అర్జునా!
సద్భావే = సత్తు యనెడి భావము నందు
సాధుభావే చ = మంచిది యనెడి భావము నందు
సత్ ఇతి = సత్ అనెడి
ఏతత్ = ఇది
ప్రయుజ్యతే = వాడబడు చున్నది

తథా = అటులనే
ప్రశస్తే = ప్రశస్తమైన
కర్మణి = కర్మ మందును
సత్ శబ్దః = సత్ అను శబ్దము
యుజ్యతే = వాడబడు చున్నది

**అర్జునా! సద్భావము నందు, సాధు భావము నందు 'సత్' అనే పదము ప్రయోగింప బడుతుంది. అలాగే ఉత్తమ మైన కర్మలలో కూడా ప్రయోగింప బడుతుంది.**

వ్యాఖ్య

బ్రహ్మ నిర్దేశ వాచకమైన ***ఓం తత్ సత్*** నామము లోని 'ఓం', 'తత్' శబ్దాలను ఎలా వినియోగించుకోవాలో

తెలుప బడింది (*ఓం తచ్ఛబ్దయోః వినియోగః ఉక్తః*). ఇప్పుడు సచ్ఛబ్దం యొక్క వినియోగం చెప్పబడుతూ ఉంది (*ఇదానీం సచ్ఛబ్దస్య వినియోగః ఉచ్యతే*).

సచ్ఛబ్దము యొక్క ప్రాశస్త్యమును వరుసగా రెండు శ్లోకాలలో చెబుతున్నాడు. ***సత్*** అనేది బ్రహ్మ వాచకము. ఉనికిని తెలిపే శబ్దము. ***ఘటః సన్, పటః సన్, దేవదత్తః సన్*** - కుండ ఉంది, వస్త్రము ఉంది, దేవదత్తుడు ఉన్నాడు. ఈ ఉండటము అనేది 'సత్' శబ్దానికి సంబంధించింది. ఏదయితే ఉందో అది 'సత్' (***యదస్తి తత్ సత్***). ఆ 'సత్' పదము ఎప్పుడూ ఉంది. ఏది ఉండినా దానిలో 'సత్' ఉంది. ఏదీ లేనపుడు, సృష్ట్యారంభమున కూడా 'సత్' ఉంది. 'సత్' ఒక్కటే అద్వితీయంగా ఉంది.

***సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్*** - నాయనా! ఈ సృష్టికి పూర్వము 'సత్' మాత్రమే ఉండింది అని ఛాందోగ్య శ్రుతి. ప్రస్తుత శ్లోకంలో ***సదిత్యేతత్*** అనే వాక్యాన్ని జాగ్రత్తగా పరిశీలించాలి. ***ఏతత్*** - అట్టిది, అంటే ***తదేతత్*** - అట్టి అది, ***సదితి*** - ఈ సత్‌గా ఉంది. సృష్టికి పూర్వము ఏది 'సత్' గా ఉండిందో, ఇప్పుడు ఏది ఉన్నా, అంటే లేకుండా ఉన్నది వచ్చినా (***సద్భావే***). లేక ఉన్నది బాగున్నది అని చెప్పవలసి వచ్చినా (***సాధు భావే***). 'సత్' అనేదే ప్రయోగింప బడుతూ ఉంది (***ప్రయుజ్యతే***).

లేనిది వచ్చి ఉండటము 'సద్భావము'. ఉన్నది బాగా ఉండటము 'సాధు భావము'. ఇది సుస్పష్టం కావాలి. సంతానము లేని వారికి పుత్రుడు జన్మించాడు. జన్మించిన పుత్రుడు ఉన్నాడు. పుట్టిన తరువాత ఉన్నవాడు, పుట్టక ముందు లేడు. లేని వాడు వచ్చి ఉన్నాడు. ఇది 'సద్భావం'. సత్ యొక్క ఉనికిని చాటుతూ ఉంది (***సద్భావే అసతః సద్భావే***).

ఒక అసాధువు ఉన్నాడు. అంటే, చెడు ప్రవర్తన కలిగిన వాడు. అలాంటి వాడు పరివర్తన చెంది మంచి వాడుగా మారి పోయాడు. సాధు వయ్యాడు. ఇది 'సాధుభావం' (***అసద్వృత్తస్య అసాధోః సద్వృత్తతా సాధుభావః***). అసాధువుగా ఉన్నప్పుడు ఉండట మనేది ఉంది. సాధువుగా మారిన తరువాత కూడా ఉండట మనేది ఉంది. ఇదే ***సదిత్యే తత్.***

'సద్భావము' నందు, 'సాధు భావము' నందు ఎలాగైతే సచ్ఛబ్ద ప్రయోగము జరుగుతూ ఉందో, అలాగే మంగళకరము లైన వివాహాది కర్మల యందు (***ప్రశస్తే కర్మణి***) కూడా సచ్ఛబ్దము ప్రయోగింప బడుతూ ఉంది. ఈ సచ్ఛబ్దము మన ప్రస్తుత విషయమైన యజ్ఞ, దాన, తపస్సులలో కూడా ప్రయోగింప బడుతూ ఉంది.

*ఈ విషయాన్ని తరువాత శ్లోకంలో విస్పష్టం చేస్తున్నాడు.*

**యజ్ఞే తపసి దానే చ స్థితిః సదితి చోచ్యతే ।** 27
**కర్మ చైవ తదర్థీయం సదిత్యే వాభిధీయతే ॥**

***యజ్ఞే-తపసి-దానే-చ-స్థితిః-సత్-ఇతి-చ-ఉచ్యతే***
***కర్మ-చ-ఏవ-తదర్థీయం-సత్-ఇతి-ఏవ-అభిధీయతే***

| | | |
|---|---|---|
| యజ్ఞే | = | యజ్ఞము నందు |
| తపసి | = | తపస్సు నందు |
| దానే చ | = | దానము నందు |
| స్థితిః చ | = | ఉనికియు |
| సత్ ఇతి | = | సత్ అని |
| ఉచ్యతే | = | చెప్పబడు చున్నది |
| తదర్థీయం | = | వాటి కొరకైన |
| కర్మ ఏవ చ | = | కర్మయు |
| సత్ ఇతి ఏవ | = | సత్ అనియే |
| అభిధీయతే | = | చెప్పబడు చున్నది |



**అర్జునా! యజ్ఞ, దాన, తపస్సులకు సంబంధించిన నిష్ఠ కూడా 'సత్' అనే చెప్ప బడుతుంది. బ్రహ్మ సంబంధ మైన కర్మలు కూడా 'సత్' అనే చెప్ప బడుతున్నాయి.**

**వ్యాఖ్య**

పూర్వ శ్లోకంలో ఆరంభించిన సచ్ఛబ్ద వినియోగము ఈ శ్లోకంలో కూడా కొనసాగుతూ ఉంది. యజ్ఞ, దాన, తపస్సులలో ఏ నిష్ఠ ఉందో అది 'సత్' అని చెప్పబడుతూ ఉంది (***యజ్ఞే తపసి దానే చ స్థితిః సత్ ఇతి ఉచ్యతే***). ఇది శ్లోకము యొక్క పూర్వార్థము.

స్థితి అంటే అవస్థానము, నిలకడగా ఉండటము అని అర్థము. సందర్భమును బట్టి తత్పరత్వము అని కూడా చెప్పుకోవచ్చు. యజ్ఞకార్యముల యందు (***యజ్ఞే యజ్ఞ కర్మణి***), తపస్సు నందు (***తపసి యా స్థితిః***), దానము నందు (***దానే చ యా స్థితిః***) నిలకడగా ఉండటము అనేది 'సత్' శబ్దము చేత చెప్ప బడింది (***సదితి ఉచ్యతే***). అంటే, యజ్ఞ, దాన, తపస్సుల నిర్వహణము నందు దోషాదులు ప్రాప్తించి నపుడు, ఆ యజ్ఞ, దాన, తపస్సులకు సాద్గుణ్యమును సాధించ టానికి 'సత్' శబ్దమును ఉచ్చరిస్తారు. 'సత్' అనే అభిధానము పరమాత్మనే అభిధేయముగా, ఫలముగా కలిగి ఉంది.

యజ్ఞ, దాన, తపస్సుల కొరకు చేసే కర్మను కూడా 'సత్' అనే పిలుస్తున్నారు. కారణం? ఆ కర్మ లన్నీ పరమేశ్వరునే ఫలంగా ఉద్దేశించి అన్య ఫలాభి సంధి లేకుండా ఆచరింపబడే యజ్ఞ, దాన, తపస్సుల నిమిత్తమై ఉండటం చేత (***కర్మ చ ఏవ తదర్థీయం సత్ ఇత్యేవ అభిధీయతే***). ఇది శ్లోకము యొక్క ఉత్తరార్థము.

యజ్ఞ నిర్వహణము నందు ఆచరింపబడే సర్వ కర్మలు 'సత్' అనే పిలువ బడతాయి. శ్రీధరస్వామి రచించిన సుబోధినీ టీకలో ఆకర్షణీయంగా, అలంకార ప్రియంగా ఒక వాక్యాన్ని ఉపయోగించడం జరిగింది.

***పూజోపహార గృహాంగణ పరిమార్జనోపలేపన రంగమాలికాది క్రియలు*** సిద్ధించడానికి బ్రహ్మ వాచకము లైన ***ఓం తత్ సత్*** అనే నామములను ఉచ్చరించాలి. ఇవన్నీ పరమాత్మ నిమిత్తము ఆచరింపబడే కర్మలు కనుక, పరమేశ్వరునే ఫలంగా ఉద్దేశించి చేయబడుతూ ఉన్నాయి కనుక 'సత్' శబ్దము చేత చెప్ప బడ్డాయి అంటారు. ఇంతకీ ఆ దీర్ఘ సమాస మేమిటో అది కూడా చెప్పుకుందాము.

యజ్ఞాది పూజా కార్యాలకు ఉపహారంగా ***గృహాంగణ పరిమార్జనము*** (యాగశాలను చిమ్మడము, నీళ్ళు చల్లడము), ***ఉపలేపనము*** (అలకడము), ***రంగమాలికాది క్రియలు*** (ముగ్గులు పెట్టడము, మాలికలు అల్లి అలంకరించడము) - ఇవన్నీ చేయడము కూడా 'సత్' అనే చెప్ప బడింది అన్నారు. అంటే, అన్నీ ఈశ్వరార్థం నిర్వహించే క్రియలు కావడం చేత, అవి కూడా ఈశ్వర స్వరూపమే అని భావము. కనుక, ఈశ్వర సంబంధమైన కార్యాల ఆద్యంతముల యందును 'సత్' శబ్దమును ఉచ్చరించడము మంగళకరము. మధ్యలో దోషా లున్నట్లు సంశయం కలిగితే 'సత్' శబ్దోచ్చారణం వల్ల దోషాలు పరిహరింప బడతాయి.

**తచ్ఛబ్దానాం సన్నిధే ర్బ్రహ్మప్రీతే స్తద్రూపత్వా జ్జనితం బ్రహ్మ తస్య।**

బ్రహ్మవాచక శబ్దము చేత యజ్ఞాదుల యందు సన్నిధి ప్రాప్తించడము వలన (***తచ్ఛబ్దానాం సన్నిధేః***). బ్రహ్మప్రీతి కలగటం కారణంగా (***బ్రహ్మ ప్రీతేః***). వారు బ్రహ్మ స్వరూపులే కావడం చేత (***తద్రూపత్వాత్***) వారికి బ్రహ్మత్వము నిష్పన్న మవుతూ ఉంది; సిద్ధిస్తూ ఉంది (***జనితం బ్రహ్మ తస్య***) అని శ్రీ హనుమద్భాష్యము.

*చివరగా, యజ్ఞాదు లన్నిటి లోను ప్రధాన మైనది శ్రద్ధే అనే విషయాన్ని ధ్రువ పరుస్తూ శ్రద్ధాత్రయ విభాగ యోగాన్ని సమాప్తం చేస్తున్నాడు.*

అశ్రద్ధయా హుతం దత్తం తప స్తప్తం కృతం చ యత్।
అస ది త్యుచ్యతే పార్థ న చ త త్ప్రేత్య నో ఇహ ॥

*అశ్రద్ధయా-హుతం-దత్తం-తపః-తప్తం-కృతం-చ-యత్* 28
*అసత్-ఇతి-ఉచ్యతే-పార్థ-న-చ-తత్-ప్రేత్య-నో-ఇహ*

| | | | | | |
|---|---|---|---|---|---|
| పార్థ | = | అర్జునా! | తత్ | = | అది |
| అశ్రద్ధయా | = | శ్రద్ధ లేకుండా | అసత్ ఇతి | = | అసత్తు అని |
| హుతం | = | చేయబడిన హోమము | ఉచ్యతే | = | చెప్పబడు చున్నది |
| దత్తం | = | ఇవ్వబడిన దానము | ప్రేత్య | = | పరలోకము నందు |
| తప్తం | = | చేయబడిన | నో | = | ఫలము నివ్వదు |
| తపః | = | తపస్సును | ఇహ చ | = | ఈ లోకము నందు |
| కృతం చ | = | చేయబడిన | న | = | ఫలితము నివ్వదు |
| యత్ | = | ఏది కలదో | | | |

**అర్జునా! శ్రద్ధ లేకుండా చేసే యజ్ఞ, దాన, తపస్సులు 'అసత్' అనే చెప్ప బడుతాయి. అది ఇహానికి ఉపయోగ పడదు. పరానికి పనికి రాదు.**

**వ్యాఖ్య**

యజ్ఞ, దాన, తపస్సులు; స్తుతి, నమస్కారాది కార్యాలు శ్రద్ధాన్వితాలు కనుక వాటిలో ఉన్నది 'సత్' అని గ్రహించాము. శ్రద్ధతో చేసే వన్నీ సద్రూపా లైనపుడు, అశ్రద్ధతో చేసి నపుడు, అవే అసద్రూపాలు అవుతాయి. చివరగా, ఈ శ్లోకంలో పరమేశ్వరుడు అదే చెబుతున్నాడు. అశ్రద్ధతో చేసే యజ్ఞ, దాన, తపస్సులు, స్తుతి నమస్కారాదులు 'అసత్' అని చెప్ప బడతాయి ***(అశ్రద్ధయా కృతమ్ అసత్ ఇతి ఉచ్యతే)***.

'సత్' సన్నిధిలో సాగే వన్నీ సత్కర్మలు. అసద్రూప మైనవి అసత్కర్మలు. సత్కర్మలు మంగళకరము. అసత్కర్మలు అమంగళకరము. సత్కర్మలు మోక్ష ప్రదములు. అసత్కర్మలు బంధహేతువులు. కారణం, అసత్కర్మలు పరమేశ్వరుని పొందడానికి సాధన మార్గాలు కావు. వాటిని శ్రమించి చేసినా ఫలితం ఉండదు. పరమేశ్వరుని మార్గానికి భిన్న మైనవి కనుక మరణానంతరము ఫలం ఉండదు. సాధు పురుషుల చేత నిందింప బడినవి కనుక ఇహ లోకానికి కూడా ఉపకరించవు ***(తత్ ప్రేత్య న, ఇహ చ న)***.

శ్రద్ధను ప్రస్తావిస్తూ అధ్యాయారంభంలో అర్జునుడు అడిగిన ప్రశ్నకు సమాధానంగా తన బోధను అధ్యాయం నిండా నింపి, రజ స్తమస్సులను, అశ్రద్ధను పరిత్యజించి, సాత్త్విక శ్రద్ధతో యజ్ఞ, దాన, తపస్సు లను ఆచరించే వాడు అంతఃకరణ శుద్ధిని పొంది మోక్ష సాధనమైన జ్ఞాననిష్ఠకు అర్హు డవుతాడు అని చెబుతూ శ్రద్ధాత్రయ విభాగ యోగాన్ని భగవానుడు సమాప్తం చేస్తున్నాడు.

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే శ్రద్ధాత్రయ విభాగయోగో నామ సప్తదశోఽధ్యాయః

**ఈ విధంగా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రము, శ్రీకృష్ణార్జున సంవాదము అయిన భగవద్గీత యందు శ్రద్ధాత్రయ విభాగ యోగ మనే పదిహేడవ అధ్యాయము.**



# చైతన్య భగవద్గీత

## అథ అష్టాదశోఽధ్యాయః - పద్దెనిమిదవ అధ్యాయము

## మోక్షసన్న్యాస యోగః - మోక్షసన్న్యాస యోగము

**మహద్భాగ్యం**

గీతా భవనంలో చివరి అంతస్థుకు చేరాము. ఇది పద్దెనిమిదవ అధ్యాయము. సంత్ జ్ఞానదేవ్ మాటల్లో చెప్పాలి అంటే కలశాధ్యాయము. అంటే శిఖరాధ్యాయము అని అర్థము.

గీతా జ్ఞానగంగా ప్రవాహం ఒంపు సొంపులను ఒలక బోస్తూ పదిలంగా ఒక చోట, పరవళ్ళు త్రొక్కుతూ మరొక చోట, దూసుకుంటూ, తోసుకుంటూ ఇంకొక చోట, అలా అలా అలలతో తేలుతూ తూలుతూ సాగి, సాగరంలో ప్రవేశించే చోట నది విశాలంగా కనిపించి నట్లు, అనంత జ్ఞానామృత సాగరంలో ప్రవేశించే ఈ సంగమ స్థానం వద్ద, గీతా జ్ఞానగంగా స్రోతస్విని డెబ్బై ఎనిమిది శ్లోకాలతో నిండిన విశాలమైన మోక్ష సన్యాస యోగంగా దర్శన మిస్తూ ఉంది.

గీతా జ్ఞాన జల ప్రవాహంలో మునుగుతూ తేలుతూ, శుద్ధి పడుతూ, ముక్తికి సిద్ధ పడుతూ, మనం కూడా ఈ మహా ప్రవాహంతో కలిసి పయనించాం. అనంతానంద పయోధిని దర్శించేందుకు, తరించేందుకు, తద్రూప మయ్యేందుకు పరవశించి పరవళ్ళు త్రొక్కుతున్నాం.

గీతా జ్ఞాన జలాలు ప్రసన్న గంభీరమై, ఎంతో అగాధమై ప్రవహిస్తున్నా, ఆ పవిత్ర జలాలలో ప్రవేశించిన వాడు మునిగి పోయిన దాఖలాలు లేవు. ఈత రాని వాడు కూడా మునగకుండా తేలియాడే పవిత్ర అగాధ ప్రవాహాలు గీతా జ్ఞాన జలాలు.

ఏనాడు ఏ పుణ్యం చేసుకున్నామో! గీతా జ్ఞాన గంగలో మునక వేశాం. ఏయే జన్మలలో ఏయే సుకృతాలు దాచ బడ్డాయో! వాటన్నిటి ఫలితంగా గీతా గంగోదకాన్ని తృప్తి తీరా పానం చేశాం. బాహ్యాభ్యంతరాలలో జ్ఞాన జలంతో దివ్యానందాన్ని అనుభవించాం.

ప్రయాణం చివరి దశకు చేరింది. దశలు తెలియని, దిశలు అర్థం గాని మహర్దశ వైపు ప్రయాణం సాగి పోతోంది. ఇది తిరిగి రాని పోక. ఆగదు ఈ ప్రయాణం దివ్యానంద మహాసాగరంలో ప్రవేశించే దాక.

విశ్వానికి వీడుకోలు పలికే సమయ మిది. జన్మలకు చెల్లు చీటి వ్రాసే కాల మిది. గీతా జ్ఞాన జలాలను పానం చేసిన తరువాత ఇంకెక్కడి జన్మలు? ఎక్కడున్నాయి కర్మలు? ***గీతా గంగోదకం పీత్వా పునర్జన్మ న విద్యతే*** - గీతా జ్ఞాన గంగాజలాన్ని పానం చేసిన తరువాత జన్మలు ఉండవు. కర్మలు మిగలవు. ఈ భాగ్యానికి అందరమూ నోచుకున్నాం. గీతామాత బిడ్డల మైనందుకు తల వంచి తల్లికి నమస్కరిస్తూ, తల్లి ఒడిలో కడతేరి పోతున్నాం.

**అధ్యాయ అభిధాన ప్రసక్తి**

ఇది పద్దెనిమిదవ అధ్యాయము. మోక్ష సన్యాస యోగము. ఇంతవరకు కర్మఫలాలను విడిచి పెట్టడం చూశాం. సర్వ కర్మలను విడిచి పెట్టడం చూశాం. సర్వ ధర్మాలను విడిచి పెట్టడానికి సిద్ధ పడుతున్న దశలో ఇక విడిచిపెట్ట వలసింది, సన్యసించ వలసింది మోక్షమునే అనే విప్లవాత్మక నినాదంతో ఈ అధ్యాయం మన